# ప్రార్థనలు

## నిజంగా పనిచేస్తాయా?


**రచన**

అమిరపు నటరాజన్


**సలహా మండలి**

అమిరపు నరేష్

సి. శ్రీధర్ I.A.S.

ఆచార్య పన్నాల శ్యామసుందరమూర్తి

ఆచార్య శ్రీమతి సి. హెచ్. చిరంజీవి

ఆచార్య నెమ్మాని రామగోపాల్

అమిరపు సురేష్

కంభంపాటి వెంకట రామగోపాల శర్మ


**ప్రకాశకులు**

శ్రీరామకృష్ణ సేవా సమితి,

బాపట్ల - 522 101

## ప్రకాశకుల మనవి

ప్రార్థనను గురించి విననివారు, జీవితంలో ఏదోవొక సందర్భంలో ప్రార్థన చెయ్యడానికి ప్రయత్నించని వారు ఎవరూ ఉండరు. అయినప్పటికీ, ఈ ప్రార్థన అంటే ఏమిటి, అది ఎందుకు, ఎలా పనిచేస్తుంది, అసలు పనిచేస్తుందా, అన్నవి ప్రతి మనిషికీ కలిగే ప్రశ్నలు. వీటికి సమాధానాలు తెలుసుకోవా లనుకోవడమే బహుశా పారమార్థిక జీవితానికి ప్రారంభమేమో!

శ్రీరామకృష్ణశారదావివేకానందులు ప్రార్థనను గురించి అనేక బోధలు చేశారు. రామకృష్ణ సాంప్రదాయానికి చెందిన ఆధ్యాత్మిక మాసపత్రికలలో ప్రార్థన గురించి అనేక సంపాదకీయాలు, వ్యాసాలు ప్రచురితమవుతూ వస్తున్నాయి. పూజ్య బుధానంద స్వామి 1992 నవంబరు, డిసెంబరు మాసాలలో ప్రబుద్ధభారత పత్రికలో Prayers: Do they work? (I, II) అనే పేరుతో వ్రాసిన సంపాదకీయాలు, అదే పత్రిక 1936 జనవరి సంచికలో పూజ్య నిఖిలానంద స్వామి Prayer: its necessity అనే పేరుతో వ్రాసిన వ్యాసం, ఈ పుస్తకానికి ప్రధానమైన ఆధారాలు. వాటికి ఆధునిక సత్యయుగావతార త్రిమూర్తుల బోధనలను, రకరకాల కథలను జోడించి, ప్రార్థనకు సంబంధించిన వీలైనన్ని అంశాలను స్పృశించి, వివరించడానికి ప్రయత్నించాము.

ఈ పుస్తకంలో 'స్వామీజీ' అని పేర్కొనబడినప్పుడు అది శ్రీవివేకానంద స్వామిని, శ్రీరామకృష్ణులు, గురుదేవులు అని పేర్కొనబడినప్పుడు అది శ్రీరామకృష్ణ పరమహంస దేవులను సూచిస్తుంది. వారి బోధనలను 'బోల్డ్' అక్షరాలలో ఇచ్చాము.

ఈ పుస్తక రచయిత శ్రీ అమిరపు నటరాజన్ గారికి మా కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని మరింత చక్కగా తీర్చిదిద్దడానికి తమ అమూల్యమైన సలహాలను అందించిన శ్రీ అమిరపు నరేష్, ఆచార్య పన్నాల శ్యామసుందర మూర్తి, శ్రీ సి. శ్రీధర్ ఐ.ఏ.ఎస్., డాక్టర్ నెమ్మాని రామగోపాల్, డాక్టర్ (శ్రీమతి) సి.హెచ్. చిరంజీవి, శ్రీ అమిరపు సురేష్, కె.వి. రామ గోపాల శర్మ ప్రభృతులకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

మా ప్రార్థన మేరకు రామకృష్ణమఠం, రాజమండ్రి అధ్యక్షులైన పూజ్య స్వామి అక్షరాత్మానందజీ మహరాజ్ ఈ పుస్తకానికి 'మున్నుడి'గా పరిచయవాక్యాలను అందించారు. వారికి మా హృదయపూర్వక ప్రణామములు.

ఐహిక, పారమార్థిక జీవితాలలో విజయాన్ని కోరేవారందరికీ ప్రార్థన తప్పనిసరి. ఆయా మార్గాలను అన్వేషించేవారికి ఈ చిన్న పుస్తకం ఏ కొంచెం సహాయపడినా మా ప్రయత్నం సఫలమవు తుందని భావిస్తున్నాము.

మార్చి, 2013. ప్రకాశకులు



SRI RAMAKRISHNA MATH
RAMAKRISHNA-VIVEKANANDA NAGAR
SWAMI VIVEKANANDA ROAD
RAJAHMUNDRY-533 105

Phone : 473112
E-mail : rkmrjy@rediffmail.com

# మున్నుడి

మనిషికి జీవితంలో చాలా వస్తువులు కావాలి. కోరికలు లేకుండా మనిషి జీవించలేడు. అయితే ఆ కోరికలు ఎలా తీర్చుకుంటాడనేది మనిషి మనిషికీ మారిపోతూ ఉంటుంది. పరిస్థితులను బట్టి కూడా మారిపోతూ ఉంటుంది. తాను సాధించగలిగేదే అయితే మనిషి తన ప్రయత్నంతోనే సాధిస్తాడు. దీనినే 'స్వప్రయత్నం' అంటారు. అయితే, అది అతడి శక్తియుక్తులకు మించినదైతే అతడు ఏదోవొక 'అతీతశక్తి' నుంచి సహాయాన్ని పొందడానికి ప్రయత్నిస్తాడు. ఇలా చేయడాన్నే సాధారణమైన భాషలో ప్రార్థన అంటారు. అలా చేసిన ప్రార్థన సఫలమైతే దాన్ని 'దైవకృప' అంటారు. అయితే ఇది సామాన్యంగా మనం చూసే విషయం. అయితే మన జీవితాలలో ఎదురయ్యే అనేక సందర్భాలలో ఇలా జరగడం లేదని మనకు తోచవచ్చు. అయితే మనం సామాన్యమైన ఘటనల మీద చర్చకు మాత్రమే ఇక్కడ పరిమితమవుతున్నాము.

## 6 ప్రార్థనలు నిజంగా పనిచేస్తాయా?

సాధారణంగా ప్రార్థన అంటే మనం నోటితో పలికేదే అనుకుంటాము. భగవంతుడి నుంచి సహాయాన్ని అర్థించేదే ప్రార్థన. అయితే ప్రార్థన అనేది ఇంకా అనేక రూపాలలో కనిపించవచ్చు. పూజలు, వ్రతాలు కూడా ప్రార్థనావిధానాలే. కొడుకులు కలగాలని దశరథుడు పుత్రకామేష్టి యాగం చేశాడు. అర్జునుడు పాశుపతాస్త్రం కావాలని శివుడి కోసం తపస్సు చేశాడు. అవి కూడా ప్రార్థనలే కదా? ఏదోవొక రూపంలో ప్రార్థన యొక్క విలువను చెప్పే కథలు మన పురాణాలలో కోకొల్లలుగా ఉన్నాయి. పురాణాలలోనే కాక చరిత్రలో కూడా అనేకమంది జీవితాలలో ప్రార్థనలు గొప్ప ప్రభావాన్ని చూపిన సంఘటనలు కనిపిస్తాయి.

అయితే ప్రార్థనలు సరైన ఫలితాలను ఇవ్వని సందర్భాలు కూడా అనేకం కనిపిస్తాయి. దానిని బట్టి కోరినవాడికి కోరినదాన్ని పొందే అర్హత ఇంకా కలగలేదని మనకు అర్థమవుతుంది. అయితే అటువంటి వాడికి దైవసహాయం నిరాకరించబడిందని మనం అనుకోనవసరం లేదు. అది అతడికి మరొక రూపంలో అందు తుంది. అటువంటి సందర్భాలలో మన ప్రార్థనను సందర్భాను సారంగా మార్చుకోవలసి ఉంటుంది. అడ్డంకులనే తొలగించమని కోరకుండా, వాటిని అధిగమించే శక్తిని ప్రసాదించమని ప్రార్థిస్తే అది మరింత ఆచరణాత్మకంగా ఉంటుంది.

మిగిలిన పనిముట్లలాగానే ప్రార్థన కూడా చాలా శక్తిమంతమైన పనిముట్టు. దాన్ని చాలా జాగ్రత్తగా ఉపయోగించాలి. లేకపోతే దాని నుంచి ప్రతికూలమైన ఫలితాలు వచ్చిపడవచ్చు. భగవంతుడి నుంచి సహాయాన్ని కోరేటప్పుడు మనిషి వివేకాన్ని చూపాలి. అనైతికమైన పనులు చేయడానికి సహాయమిమ్మని ప్రార్థించకూడదు. మహాభారతంలోని యక్షప్రశ్నల ఘట్టం మనందరికీ తెలుసు. ఏ ముని పాండవులను చంపడానికి ఆ భూతాన్ని పంపాడో అతణ్ణే ఆ భూతం మట్టుబెట్టింది.

బాపట్ల శ్రీరామకృష్ణ సేవాసమితికి చెందిన శ్రీఅమిరపు నటరాజన్ ప్రార్థన గురించి విస్తారంగా, లోతుగా చర్చించి దానికి పుస్తకరూపాన్ని కల్పించారు. ఈ పుస్తకం చిత్తశుద్ధిగల భక్తులకే కాక పండితులకు కూడా ఎంతైనా ఉపయోగపడగలదు.

Swami Atmaratmananda

అధ్యక్షులు

తేదీ: 8 మార్చి, 2013

రామకృష్ణ మఠం,

రాజమండ్రి.

# విషయసూచిక

# 1. పరిచయం

ఒక ఎలుక పెరుగు కుండలో పడింది. ఇక దాని భయానికి, హడావుడికి అంతులేదు. దానిలోనుంచి ఎలాగైనా బయట పడడమే దాని ప్రథమ కర్తవ్యం. అది కుండ గోడల మీద ఎగబ్రాక డానికి ప్రయత్నించింది. ఎన్నిసార్లు ఎక్కడానికి చూసినా జిడ్డుగా ఉన్న ఆ కుండ గోడలు జారిపోతున్నాయి. కుండలో నుంచి ఒక్కసారిగా అంత ఎత్తుకు దూకలేదు! ఇక ఆ కుండలోనే గుండ్రంగా ఈదుతూ బయటపడే మార్గం ఏమిటా అని వెదుకసాగింది. కానీ ఏ మార్గం కనిపించలేదు. అయినా, అది పట్టువిడువకుండా రాత్రంతా ఈదింది. దాని శక్తులన్నీ ఉడిగి పోయాయి. ఇక ఈదే శక్తి ఏమాత్రం లేదు. ఆ ఎలుక కాళ్ళు కదపడం మానేసింది. ఇక మునిగి, చావడమే నా గతి అనుకుంది. అయితే చిత్రంగా, దాని ప్రమేయం ఏమీ లేకుండానే పైకి తేలింది. కాలికి అందే దూరంలో కుండ అంచు కనిపించింది! ఇక ఆలస్యం చేయకుండా శక్తినంతా కూడదీసుకుని బయటకు దూకి పరుగు తీసింది.

అది ఎలా బయటపడింది? అంతసేపు ఈదినందువల్ల కుండలోని పెరుగు చిలకబడి, దాని శరీరం మొత్తానికి వెన్న అంటుకుని, అది పైకి తేలగలిగింది. అంతేకాక ఆ కుండలోని వెన్న మొత్తం దగ్గరకు చేరి, ఉండ కట్టింది. ఆ వెన్న ఉండ మీదకు ఎక్కి, ఎలుక బయటపడింది.

చాలాసార్లు మనిషి జీవితంలో అంతా చేసేది తానే అనుకుని ఎంతో ప్రయాసపడతాడు. అయితే త్వరలోనే తన శక్తి చాలక చతికిలపడతాడు. తనకు ఎవరైనా సహాయం చేస్తే బాగుండు ననుకుంటాడు. ఇలా ఎందుకు జరుగుతుందో తెలుసుకోవాలంటే మానవుడి స్వభావమేమిటో తెలుసుకోవాలి.

## మానవుడి స్వభావం

ఒక చిన్న పిల్లవాడు ఉన్నాడు. ఒక రోజు వాళ్ళ నాన్న బజారు నుంచి అర కేజీ బందరు లడ్డూలు తెచ్చాడు. వాళ్ళ అమ్మ వాటిలో ఒకటి తీసి వాడికి ఇచ్చింది. వాడు దాన్ని తింటూ, ఆనందంతో గంతులు వేశాడు. ప్రపంచంలో మరే ఇతర వస్తువూ అంత ఆనందాన్ని ఇవ్వలేదేమో అనిపించింది. ఒకటి అయిపోయింది. మళ్ళీ అమ్మ దగ్గరికి వెళ్ళి అడిగాడు. అమ్మ మరొక లడ్డూ ఇచ్చింది. దాన్ని కూడా ఎంతో ఆనందంగా తిన్నాడు. అ తర్వాత అమ్మ నుంచి ఇంకొకటి సంపాదించి అది కూడా తిన్న తర్వాత మళ్ళీ అమ్మ దగ్గరకు చేరాడు. ఇంకా ఎక్కువ తింటే వాడికి కడుపు

నొప్పి వస్తుందని అమ్మ వాడిని, “ఇంకా ఎక్కువ తింటే కడుపు నొప్పి వస్తుంది రా! రేపు ఇస్తాలే!” అని సముదాయించింది. వాడు చేసేది లేక అప్పటికి ఊరుకున్నాడు. కానీ ఆ బందరు లడ్డూ రుచి నాలుక మీద నుంచి చెరిగి పోలేదు. ‘అమ్మ ఎక్కడ పెట్టిందో చూద్దాం!’ అనుకున్నాడు. తన నాలుకను తన్మయత్వంలో ఓలలాడించిన ఆ బందరు లడ్డూ యొక్క మహదానందాన్ని మరొకసారి చవిచూడాలన్న కోరికతో అన్వేషణ మొదలు పెట్టాడు. వంటిల్లు అంతా వెతికాడు. కనపడలేదు. ఇంట్లోని అలమారాలన్నీ వెతికి, చివరకు బల్లల క్రిందా, మంచాల క్రిందా కూడా వెతికాడు. ఎక్కడా కనపడలేదు. మరునాడు అడిగితే మాయచేసినట్టుగా అమ్మ ఎక్కడనుంచో తీసి ఇంకొక లడ్డూ ఇచ్చింది కానీ వాటిని ఉంచిన డబ్బా ఎక్కడుందో మాత్రం వాడు కనిపెట్టలేకపోయాడు. ఇక మీకు కూడా అమ్మ ఆ లడ్డూలను ఎక్కడ పెట్టిందో తెలుసుకోవాలని ఉందా? వాడి పుస్తకాల అలమారా లోనే! వాడు ఇల్లంతా వెతికినా వెతుకుతాడు కానీ, పొరపాటుగానైనా తన పుస్తకాల అలమారా తీయడని అమ్మకు తెలుసు!

మనిషి పరిస్థితి కూడా అంతే. అపరిమితానంద హేతువైన పరబ్రహ్మం తనలోనే ఉన్నాడని తెలుసుకోక ఎక్కడెక్కడో అన్వేషిస్తాడు. చివరకు అది తనలోనే ఉందని తెలుసుకుంటాడు. నిజానికి, తొలిమానవుడి నుంచి ఆధునిక మానవుడి దాకా ఈ

అన్వేషణే మానవాళి యొక్క మౌలికలక్షణంగా కనిపిస్తోంది. అయితే ఎక్కువసార్లు మనిషి ఆ అనంతమైన ఆనందాన్ని, జ్ఞానాన్ని పొందడానికి భౌతికస్థాయిలోనూ, బుద్ధిస్థాయిలోనూ ప్రయత్నించి విఫలమౌతూ ఉంటాడు. అలా ప్రాపంచిక పద్ధతులతో తన ప్రయత్నాలన్నీ బెడిసికొట్టడం చూసి, ఒక్క క్షణం ఆగి, "అయితే వాటిని సాధించడానికి సరైన మార్గం ఏమిటి?" అని ప్రశ్నిస్తాడు. ఈ ప్రశ్నే మనిషిలో కలిగే అంతర్గతమైన మేలుకొలుపుకు నాంది.

మనిషిని కేవలం ఒక భౌతికమైన జీవిగా పరిగణిస్తే అతడు కూడా జంతువులలాగా ఆహారం, భయం, నిద్రలతో కాలక్షేపం చేస్తూ ఉండవచ్చు. మరికొంత ఉన్నతంగా, మనస్సు కలిగిన భౌతికజీవిగా నరుణ్ణి చూసినట్టయితే అతడు కొంత తర్కం నేర్చిన వానరంలాగా కనిపిస్తాడు. ఇలాంటివాడు తన నాశనాన్ని తానే కొనితెచ్చుకునే యంత్రాలను, పరిస్థితులను సృష్టించుకుని చివరకు వాటితోనే పిచ్చివాడయిపోయే 'అదృష్టాన్ని' పొందుతాడు. వానరాలు కూడా ఇలాంటి దుస్థితిని కొనితెచ్చుకోవు!

ఇక ఆ పైన, మరింత ఉన్నత స్థాయిలో, మనస్సు కలిగిన భౌతిక శరీరంలో నివాసముంటున్న ఒక ఆత్మగా మనిషిని పరిగణించవచ్చు. ఈ విధంగా చూసినప్పుడు, అనాదిగా మనిషి ఆనందం కోసం, జ్ఞానం కోసం, అమృతత్వం కోసం ఎందుకు అర్రులు చాస్తున్నాడో అర్థమవుతుంది. ఎందుకంటే అవి ఎక్కడో

కాక అతడిలోనే ఉన్నాయి. అవి అతడి సహజ స్వభావాలే అయినా, ఏదో కారణం వల్ల అతడికి దొరకకుండా పోయాయి. ఊబిలో దిగిన వ్యక్తి బయటకు రావడానికి విశ్వప్రయత్నం చేసినట్టుగా, తిరిగి వాటిని పొందడం కోసం మనిషి ప్రయాసపడడం అత్యంత సహజం. దీనినే ఆధ్యాత్మిక అన్వేషణగా చెప్పుకోవచ్చు. ఈ అన్వేషణ ఆత్మస్థాయిలో మాత్రమే సఫలీకృతమవుతుంది. ఆత్మను తెలుసుకున్నప్పుడు గొప్ప సంతృప్తి కలగడమే కాక మిగిలిన సమస్యలన్నీ కూడా సమసిపోతాయి.

## మానవుడి అన్వేషణ

భౌతిక శాస్త్రవేత్త పరమాణుపదార్థాలను, అపదార్థ పదార్థాలను; ఖగోళ శాస్త్రవేత్త అపారమైన గెలాక్సీలను; జీవ శాస్త్రవేత్త అణుజీవశాస్త్రాన్ని, కణజీవశాస్త్రాన్ని; మానసిక శాస్త్రవేత్త అగాధమైన మానవ మనస్సును పరిశోధిస్తారు – వీటన్నింటి వెనుకా ఒకే అద్భుతసత్యం ఉంది. అది తన గుట్టు విప్పకుండా, మనిషిని సమ్మోహితుణ్ణి చేస్తోంది. మనిషి – ఎన్నో విషయాలను కనుక్కున్నానని ఎంత జబ్బలు చరిచినా – ఈ విశ్వమనే అనంత సాగరతీరంలో ఒకటిరెండు రంగు రాళ్ళను ఏరుకునే చంటి పిల్లవాడు మాత్రమే. ఎందుకంటే, మానవ మేధస్సు అనే మరుగుజ్జు ఈ విశ్వాన్ని చూసి అవాక్కవుతున్నాడు.

ఈ అద్భుత సత్యానికి మూలం ఏమిటో వివరించడానికి ప్రయత్నిస్తూ, భౌతికశాస్త్రంలో సాపేక్షతా సిద్ధాంతాన్ని ఆవిష్కరించిన ప్రముఖ నోబెల్ బహుమతి గ్రహీత ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ 'ఐ బిలీవ్' అనే గ్రంథంలో ఇలా చెప్పాడు.

**"ఈ ప్రపంచంలో మనం అనుభూతి చెందగలిగిన అత్యంత సమ్మోహకరమైన విషయం, ఏమాత్రం అంతు చిక్కని విషయం, ఒకటుంది. దానినే 'మాయ' (మిస్టరీ) అనవచ్చునేమో! వాస్తవానికి, అన్ని కళలకూ, శాస్త్రాలకూ అదే మూలం. ఎవరికైతే ఈ అంతు చిక్కని మాయ అనుభవానికి రాదో, ఎవరైతే దానిని ఒక అద్భుతంగా చూడలేరో, ఎవరైతే దాన్ని గమనించే ఆనందంలో మైమరచిపోడో, అటువంటివాడు మృతకళేబరంతో సమానం. వాడి కళ్ళు మూసుకుపోయినట్టే లెక్క. జీవితంలో ఎదురయ్యే ఈ అంతుచిక్కని మాయ - బహుశా దానితోపాటు కొంత భయం కూడా కలిసివుండవచ్చు - మతానికి జన్మనిచ్చింది. మనం చొరలేని, తెలుసుకోలేని ఆ సత్యం ఒకటి యథార్థంగా ఉందనీ, అత్యున్నత స్థాయిలలో అది జ్ఞానంగానూ, అత్యంత ప్రకాశమానమైన సౌందర్యంగానూ భాసిస్తోందనీ మనిషి తెలుసుకోవాలి. మనకున్న మందకొడి ఇంద్రియజ్ఞానంతో దాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించినపుడు మనకు తెలిసేది అతికొద్ది మాత్రమేనన్న అవగాహనకు మనిషి చేరుకోవాలి. ఈ జ్ఞానం, ఈ భావం - ఇవే నిజమైన ఆధ్యాత్మికతకు మూలంగా, కేంద్రంగా ఉన్నాయి."**

ఐన్‌స్టీన్ ఎంతో చక్కగా వివరించిన ఈ విషయాన్ని బహుశా ఒక ఆధ్యాత్మికవేత్త చెప్పినా కూడా అవే మాటలలో చెప్పి

ఉండేవాడేమో! అయితే 'భయం' గురించి మాత్రం బహుశా ప్రస్తావించకుండా ఉండేవాడు! మధ్యప్రాచ్యమతాలకు చెందిన వాడవడం వల్ల, ఆయా మతాలలో భయమనే భావనకు ఉన్న ప్రాముఖ్యత వల్ల, బహుశా ఐన్‌స్టీన్ ఇలా భయాన్ని గురించి ప్రస్తావించి వుంటాడు. ఆధ్యాత్మిక దృష్టికి కావలసింది భయం కాదు – ప్రేమ, సంభ్రమం (వండర్). ఆ మాయనే (మిస్టరీని) మనం సత్యమనిగానీ, దేవుడనిగానీ పిలువవచ్చు. అది అత్యున్నతమైన జ్ఞానంగానూ, ప్రకాశమానమైన సౌందర్యంగానూ, అవధులు లేని ఆనందంగానూ తనను తాను వ్యక్తీకరించు కుంటుంది. వాటిని కోరేవాడు తప్పనిసరిగా ఆ సత్యాన్ని అన్వేషించాలి, దానితో సంబంధాన్ని ఏర్పరచుకోవాలి. అదీ, తానూ వేరుకాదని తెలుసుకోవాలి.

స్వామీజీ ఇలా చెప్పారు:

**"నేను జీవంతో ఏకమైనప్పుడే మరణం అంతమవుతుంది. నేను ఆనందంతో ఒకటైనప్పుడే దుఃఖాలు అంతమవుతాయి. నేను జ్ఞానంతో ఏకమయినప్పుడే పొరపాటు చేయడం మానతాను. అన్ని శాస్త్రాలకూ చివరి నిర్ధారణ ఇదే!"**

అజ్ఞానంలోపడి తాను భగవంతుడిలో ఒక అంశమేనన్న విషయాన్ని మనిషి తరచుగా మరచిపోతూ ఉంటాడు. ఆధ్యాత్మికం గా దారి తప్పిపోయిన మనిషి కొలను అడుగున చిక్కుకున్న గాలి

బుడగ లాంటివాడు. ఆ గాలి బుడగ పైకితేలి అనంతమైన వాతావరణంలో కలసిపోదామని ప్రయత్నించినట్టు మనిషి కూడా భగవంతుడనే అనంతత్వంలో లీనమైపోవా లనుకుంటాడు. మనిషి చేసే పనులు, సాహసాలు అన్నీ కూడా మనిషిలోని ఆత్మ తన స్వస్థలమైన పరమాత్మకు చేరుకోవడానికి చేసే ప్రయత్నాలే.

## మానవుడి శక్తియుక్తుల పరిమితులు

మనస్సుకూ, బుద్ధికీ ఉన్న శక్తులు ఎంతగొప్పవైనా సరే, మనకు సరైన దోవ చూపడంలో అవి ఘోరంగా విఫలమవుతాయి. ఓటమి ఎరుగని తర్కం, కత్తిలాంటి పదునైన మేధస్సు ఉన్నా, మనం వాటిమీదే అన్నిసార్లూ సంపూర్ణంగా ఆధారపడడానికి అవి పనికిరావు. ఎందుకంటే, వాటికి కూడా పరిమితులు ఉంటాయి. ఆ పరిమితులను దాటితే ఆయా శక్తులు ఎందుకూ కొరగావు. మానసిక ఆందోళనలనూ, తొలిచివేసే అంతర్మథనాలనూ, దుర్భరమైన ఏకాంతాన్నీ, అగాధమైన నిరాశానిస్పృహలనూ, హృదయవిదారకమైన మానవసంబంధాలనూ అనుభవించని మానవమాత్రుడెవ్వడూ లేడు. కొన్నిసార్లు ఇవి నాడీవ్యవస్థకు సంబంధించిన రోగాలుగా వికటించడమే కాక, శారీరిక రుగ్మతలుగా పరిణమిస్తాయి కూడా. మన కష్టాలన్నీ అలజడిగా వున్న మనస్సు నుంచే పుడతాయని మనం మరచిపోకూడదు. వైద్యులు, మానసికనిపుణులు మానసిక ప్రశాంతత యొక్క

అవసరాన్ని మాటిమాటికీ నొక్కి చెపుతున్నారు. ఆధ్యాత్మికమైన చిత్తశాంతి మన శరీరాలకు బలం చేకూర్చడమేకాక, కృశింపజేసే ఆందోళనలను కూడా శాంతింపజేస్తుంది. మరి ఆ చిత్తశాంతిని పొందడానికి మార్గం – ప్రార్థన!

## ప్రార్థన అంటే ఏమిటి?

ప్రార్థన అనగానే వెంటనే మన మనస్సులకు తట్టేది ఏమిటి? కేవలం కొన్ని శ్లోకాలను, స్తోత్రాలను వల్లించడం, లేకపోతే ఏదైనా మంత్రాన్ని జపం చేయడం! అలా చేసేది కూడా, చాలా యాంత్రికంగా చేస్తే సరిపోతుందని, మనం అనుకుంటాము. అయితే, ప్రార్థనను చక్కగా అర్థం చేసుకుని సాధన చేసినవారికి, అది పైపై అలంకారంగా కాక, పరమాత్మ నుంచి మనిషి పొందే ఊతంగా కనిపిస్తుంది.

అనంతమైన జ్ఞానానికీ, బలానికీ, ఆనందానికీ, పరిపూర్ణతకూ తరగని సంపద లాంటి వాడు భగవంతుడు. ఎలాగైతే తన పొలానికి నీరుపెట్టాలనుకునే రైతు సరస్సు నుంచి కాలువ తీసి తన పొలానికి నీరుపెట్టుకోవాలో అదే విధంగా అమృతత్వాన్ని కోరుకునే మనిషి భగవంతుడితో అనుబంధాన్ని ఏర్పరచుకోవాలి. ఇంటికి విద్యుచ్ఛక్తి కావాలంటే విద్యుదుత్పాదక కేంద్రంతో తీగల ద్వారా అనుసంధానం చేసుకోవాలి. అదే విధంగా భగవంతుడితో మనం ఏర్పాటు చేసుకునే సంబంధమే ప్రార్థన. దాని ద్వారా

మనం జ్ఞానానికి, సత్యానికి, ఆనందానికి నిలయమైన భగవంతుడి నుంచి మనకు కావలసిన ఆధ్యాత్మిక పరిపుష్టిని పొందుతాము.

శ్రీరామకృష్ణ పరమహంస ఇలా చెప్పారు:

**"ప్రతి ఒక్కరూ జ్ఞానాన్ని పొందవచ్చు. జీవాత్మ, పరమాత్మ అనే రెండు అంశాలున్నాయి. ప్రార్థన ద్వారా మనిషిలోని జీవాత్మను పరమాత్మతో ఏకం చేయవచ్చు. (అదే మనిషి సమస్యలకు అసలైన పరిష్కారం.) ప్రతి ఇంటికీ వంటగాస్ ఎలా సరఫరా అవుతుందో మీకు తెలుసు కదా! మనం గాస్ కావాలని ఆ సంస్థకి దరఖాస్తు చేసుకోవాలి. అప్పుడు గాస్ కంపెనీ యొక్క పెద్ద టాంకు నుంచి మన ఇంటికి గొట్టాల ద్వారా గాస్‌ను సరఫరా చేస్తారు. మన ఇంట్లో దీపాలు వెలుగుతాయి!"**

## ప్రార్థనకు నిర్వచనాలు

డాక్టర్ అలెక్సిస్ కారెల్ ప్రార్థనకు ఇలా నిర్వచనం ఇచ్చాడు: "కేవలం మంత్రాలను యాంత్రికంగా వల్లించడంగా కాక ప్రార్థన అనే దాన్ని ఒక ఆధ్యాత్మిక అభ్యున్నతిగానూ; విశ్వమంతటా నిండివుండి, దానికి అతీతంగా కూడా ఉండే ఒక మౌలిక సూత్రాన్ని చైతన్యపూర్వకంగా ధ్యానించడంలో లీనమైపోవడంగానూ, అర్థం చేసుకోవచ్చు."

ఆయనే దానికి ఇలా వివరణ కూడా ఇచ్చాడు. "ప్రార్థన అనేది మనిషి ఉత్పత్తి చెయ్యగలిగిన అత్యంత బలవంతమైన శక్తి. గురుత్వాకర్షణ శక్తి ఎంత నిజమో ప్రార్థన శక్తి కూడా అంతే

నిజమైనది. నేను వైద్యుడిగా చాలామంది రోగులను చూశాను. వారిలో కొందరు చేయిదాటిపోయిన పరిస్థితిలో ఉన్నప్పుడు, ఇక ఏ వైద్యమూ కుదరదని అనుకున్నప్పుడు, ప్రశాంతమైన ప్రార్థనాశక్తి చేత నిస్పృహలోనుంచి బయటపడి, క్రమంగా కోలుకున్నారు. ప్రార్థన అనేది రేడియం మూలకంలాగా స్వయం ప్రకాశకమైనది. ...మనం ప్రార్థించినప్పుడు, ఈ విశ్వభ్రమణానికి మూలమైన పరాశక్తితో అనుబంధాన్ని ఏర్పరచుకుంటాము. దాన్ని వేడుకోవడం ద్వారా మనలోని లోటుపాట్లు పూరించబడి, మనం మరింత శక్తిమంతులుగా ఎదుగుతాము. ఆ విధంగా, మనం చిత్తశుద్ధితో ప్రార్థించిన ప్రతిసారీ మన శరీరం, ఆత్మ మరింత ఉన్నతిని సాధిస్తాయి."

ఆధ్యాత్మిక సాధన మీద ప్రఖ్యాత రచయితగా పేరొందిన ఎవెలిన్ అండర్‌హిల్ ప్రార్థన గురించి ఇలా వ్రాశారు. "ప్రార్థన అంటే సత్యంవైపు మరలడమే. ఆద్యంతరహితుడైన పరమాత్మతో మనం చేసే సంభాషణ, సంపర్కం ఎంత అల్పమైనదిగా, తాత్కాలికమైనదిగా, సరిగా అర్థం కానట్టుగా, తోచినా ఫర్వాలేదు. ఒక చిన్నపిల్లవాడు కాసేపు అటూయిటూ తిరిగి, మళ్ళీ కాసేపు అమ్మ ఒడికి చేరినట్టుగా, మనం భగవంతుడి మీద పూర్తిగా ఆధారపడడం ఇంకా నేర్చుకోకపోయినా సరే మనం ప్రార్థన చేయడానికి ఏ సంకోచమూ ఉండనక్కర లేదు. ఎందుకంటే ప్రార్థనే

నిజంగా మన జీవిత సర్వస్వం; అదే భగవంతుని కోసం మన ఆరాటం; అదే ఆయనవైపు మన పయనం. అన్ని పరిపూర్ణతల సంగమం, సకలవిశ్వానికీ జీవధార అయిన భగవంతుడితో మానవుడు చేసే వినమ్రపూర్వకమైన సంభాషణే ప్రార్థన."

ఆ విధంగా ప్రార్థనకు ఉత్తమమైన నిర్వచనం – "మనకన్నా ఏదోవొక ఉన్నతమైన శక్తిని నమ్మి, మన బాధ్యతను పూర్తిగా దానిమీద వదిలిపెట్టడమే ప్రార్థన!"

అయితే, 'ప్రార్థన ఫలితాలను సాధించగలదా?' అన్నదే ప్రశ్న. సామాన్యమానవులనే కాక వైద్యులనూ, మానసిక నిపుణులనూ ఎంతోకాలంగా ఈ సమస్య పట్టిపీడిస్తోంది. చిత్తశుద్ధితో, నిజాయితీతో చేసే ప్రార్థన అల్లకల్లోలమవుతున్న మన మనస్సును శాంతింపజేసి, దానిలో తిరిగి సమతాస్థితిని నెలకొల్పగలదా? ప్రార్థనలు అసలు పనిచేస్తాయా? ఈ ప్రశ్నలకు మనం సమాధానం తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

# 2. అవసరం

## ప్రార్థనపట్ల సాధారణమైన దృక్పథం

ఒక బామ్మగారు తన మనవణ్ణి, "ఏరా నాయనా! ప్రతిరోజూ రాత్రి నిద్రపోయే ముందు ప్రార్థన చేస్తావా?" అని అడిగారు. వాడు, "చేస్తాను బామ్మా!" అన్నాడు. "మరి ప్రతి రోజూ ఉదయం కూడా చేస్తావా?" అని అడిగితే, ఆ పిల్లవాడు, "లేదు, లేదు! నాకు పగలు భయం వెయ్యదుగా!" అన్నాడు. నిజమే మరి, భయం వేసినప్పుడే మనందరికీ దేవుడు కావలసివస్తాడు! భయమే ప్రార్థన యొక్క అవసరాన్ని కలిగిస్తుంది!

అంత సులభమైన పనిగా కనిపించే ప్రార్థనకు అంత శక్తి ఉంటుందా అని మనలో చాలామందికి అనుమానం కలుగుతూ ఉంటుంది. పైకి ప్రార్థన చేస్తూనే ఉన్నా, లోపల మాత్రం ఆ ప్రార్థన నిజంగా పనిచేస్తుందా లేదా అన్న అపనమ్మకం మన మెదళ్ళను తొలుస్తూ ఉంటుంది. చాలాసార్లు ప్రార్థన చేస్తే పోయేదేముందిలే అనుకుంటూ ఉంటాం మనం! అనుకున్నది వస్తే సరే లేకపోతే పోయేదేముంది? 'కొండకు వెంట్రుక కట్టి లాగాడట! వస్తే కొండ వస్తుంది, పోతే వెంట్రుక పోతుంది, అంతే కదా!'

ఎవరో హాస్యాలాడుతూ, "ఎంతకాలం పాఠశాలల్లో బీజగణితాన్ని (ఆల్‌జీబ్రా) పాఠాలుగా చెపుతారో అంతకాలం విద్యార్థుల

జీవితాల్లో ప్రార్థన ఉంటూనే ఉంటుంది!" అన్నాడు. అయితే ప్రార్థనను ఇలా చులకనగా చూడకుండా దాని గురించి మరింత చక్కని అవగాహనను ఏర్పరచుకోవడం ఎంతైనా అవసరం.

## ప్రార్థన యొక్క అవసరం

ప్రార్థన అవసరం ఏపాటిదో వివరించడం చాలా కష్టం. త్యాగరాజ కృతుల కోసం మనం ఎందుకు చెవికోసుకుంటామో చెప్పడం ఎలా సాధ్యం కాదో అదే విధంగా ప్రార్థన అనేదాని అవసరం ఏమిటో విడమరచి చెప్పడం కూడా సాధ్యం కాదు. ఎలాగయితే ఆ సంగీతం చెవికి సోకగానే ఒళ్ళు పులకరించి దాని మాధుర్యం అనుభవానికి వస్తుందో అదే విధంగా ఆయన ఉన్నాడన్న విశ్వాసం హృదయంలో పొడసూపినప్పుడు ప్రార్థన దానంతట అదే మనస్సులో నుంచి ఉబికి వస్తుంది.

ప్రార్థన చెయ్యాలనే కోరిక మనకు రకరకాల సందర్భాలలో కలగవచ్చు. యుద్ధభయం వలన కానీ, విపత్కర పరిస్థితులు ఎదురైనప్పుడు కానీ, పెద్దపెద్ద బాధ్యతలను భుజానికెత్తుకోవలసిన సమయం ఎదురైనప్పుడు కానీ, ఇలా ప్రార్థించాలని మనకు అనిపిస్తుంది. మనకు తెలియకుండానే మన చేతులను జోడించి ప్రార్థనలో మునిగిపోతాము.

మొదటి ప్రపంచయుద్ధకాలంలో జనం చర్చిలలోకి చేరి తమ శత్రువులు నాశనం కావాలని ప్రార్థన చేసేవారు. వారి ప్రార్థన

స్వార్థపూరితమైనదన్న ప్రస్తావనను ప్రస్తుతానికి పక్కన పెట్టండి. అసలు విషయమేమిటంటే, జీవితంలో ఎప్పుడూ చర్చి ముఖం చూడని వారు కూడా ఆ సమయంలో చర్చికి వెళ్ళి ప్రార్థన చేశారు. తల్లులూ, తండ్రులూ, మిత్రులూ, బంధువులూ, అందరూ చర్చికి వెళ్ళి ప్రార్థనలో మునిగిపోయేవారు. ఒక స్కాట్‌లాండ్ దేశస్థుడు, "సాధారణంగా మా చర్చిలో ఎప్పుడూ సువార్త ప్రబోధమే జరుగుతుంది. కానీ యుద్ధకాలంలో మాత్రం మమ్మల్ని ప్రార్థన చేయమనేవారు!" అని చెప్పాడు. అలాంటి విపత్తు ఎదురైనప్పుడు మనకు తెలియకుండానే మనం ప్రార్థనలో మునిగిపోతాము.

అలాగే అరుదైన, ఎంతో ప్రాముఖ్యత కలిగిన, గురుతరమైన బాధ్యతలను మనం చేపట్టవలసిన సమయంలో కూడా ప్రార్థన చేయడం వలన మనకు కావలసిన ఆత్మస్థైర్యం చేకూరుతుంది. విక్టోరియా రాణి పంతొమ్మిది సంవత్సరాల వయస్సులో ఉన్నప్పుడు ఆమెను ప్రధానమంత్రి నిద్రలేపి, ఆమెను మహారాణి చేశారన్న వార్తను అందించాడు. కొద్దిసేపు ప్రధానమంత్రిని అక్కడే వేచివుండమని చెప్పి, ఆమె ప్రార్థన చేయడానికి తన గదిలోకి వెళ్ళిపోయారు.

అలాగే, వాటికన్‌లోని సిస్టీన్ దేవాలయాన్ని నిర్మించిన కాలంలో, ఆ దేవాలయంలోని గోడలమీద, లోపలి కప్పు మీద మేరీమాత (మెడొన్నా) బొమ్మలను చిత్రకారుడైన రాఫేల్

చిత్రీకరించాడు. ఆ కాలంలో, తాను వేసే చిత్రాలు జీవంతో తొణికిసలాడాలని అతడు నిరంతరం మోకాళ్ళ మీద సాగిలపడి ప్రార్థన చేస్తూ ఉండేవాడట. ఆ చిత్రాలు నేటికీ అత్యద్భుతమైన కళకు ప్రతిరూపాలుగా నిలిచివున్నాయి.

ప్రార్థన అనేది మనస్సు అతి సహజంగా చేసే పని కనుక అది అన్నిచోట్లా కనిపిస్తూనే ఉంటుంది. అంటార్కిటికాలో అరటిచెట్లు పెంచినట్టు, అది కొత్తగా తెచ్చిపెట్టుకున్నదీ, కృత్రిమమైనదీ కాదు. చాలా సందర్భాలలో మనుష్యులు తమ మదిలో మొలకెత్తుతున్న ఆ ప్రార్థన అనే భావనను తుంచివేస్తారు. మూఢనమ్మకాలు ఉన్నవారు మాత్రమే ప్రార్థన చేస్తారని వారు అనుకుంటారు. ఎవరు చేసే వాదనలు ఎలావున్నా, ప్రార్థన అనేది మాత్రం ఎల్లకాలాలకూ తప్పక నిలిచివుంటుంది.

బౌద్ధమతాన్ని ఉదాహరణగా తీసుకోండి. బుద్ధుడు, "సృష్టికర్త అయిన దేవుడంటూ ఎవరూ లేరనీ, ప్రార్థనవల్ల ఏ ప్రయోజనమూ లేద"నీ చెప్పాడు. కానీ ఈ రోజున ప్రపంచవ్యాప్తంగా కోట్లాదిమంది బౌద్ధులు బుద్ధుణ్ణే తమ దేవుడిగా చేసుకుని ప్రార్థనలు చేస్తున్నారు.

మరొక ఉదాహరణగా కన్‌ఫ్యూషియస్‌ను తీసుకోండి. ఆయన దేవుని ఉనికి గురించి ఏమీ మాట్లాడలేదు. ఆయన బోధించిన మతంలో ప్రార్థనకు చోటు లేదు. కానీ చైనాలోని ఆ మతం

అనుయాయులు కోట్లాది జనం కన్‌ఫ్యూషియస్‌కే ప్రార్థనలు చేస్తున్నారు.

ఇస్లాం మతంలో ప్రతి ఒక్కరినీ రోజుకు అయిదుసార్లు ప్రార్థన చేయమని కోరతారు. సూఫీమత ప్రకారం ప్రార్థన చేసే జీవితంలో మూడు దశలు ఉంటాయి. మొదటి దశలో పెదవులతో మాటలను పలకడం ద్వారా ప్రార్థిస్తాము. రెండవదశలో మన మనస్సులను దైవికమైన విషయాల మీద కేంద్రీకరిస్తాము. ఇక మూడవ దశలో దైవికమైన విషయాల మీద నుంచి మన మనస్సును మరలించడమే మనకు కష్టమవుతుంది.

ప్రార్థన యొక్క సమర్థత మీద గాంధీ మహాత్మునికి గొప్ప నమ్మకం ఉండేది. ఆయన ఇలా వ్రాశారు:

**"నేను అగ్నిపరీక్షలు ఎదుర్కొన్న అన్ని సందర్భాలలోనూ భగవంతుడే నన్ను కాపాడాడు. నాకు సంబంధించినంత వరకూ, 'భగవంతుడు నన్ను కాపాడాడు!' అని చెప్పే మాటకు మరింత లోతైన అర్థం ఉంది. అసలు, దాని అర్థాన్ని నేను ఇంకా పూర్తిగా తెలుసుకోలేదేమో! ఆధ్యాత్మికంగానూ, న్యాయవృత్తిపరం గానూ, సంస్థల నిర్వహణలోనూ, రాజకీయాలలోనూ, నేను ఎదుర్కొన్న అన్ని క్లిష్టపరిస్థితులలోనూ దేవుడు నన్ను కాపాడాడు. అన్ని ఆశలూ అడుగంటినప్పుడు, స్నేహితులు కనుమరుగైనప్పుడు, మనస్సులో 'హాయి' మాయమైపోయినప్పుడు, ఎక్కడ నుంచో తెలియకుండా, ఏదోవొక విధంగా సహాయం అందేది. శరణాగతి, ఆరాధన, ప్రార్థన అనేవి మూఢనమ్మకాలు కావు. ఇంకా చెప్పాలంటే, తినడం, త్రాగడం,**

**కూర్చోవడం, నడవడం లాంటి పనుల కంటే అవే మరింత వాస్తవమైనవి. నిజానికి, అవి మాత్రమే సత్యమనీ, మిగిలినవన్నీ మిథ్య అనీ చెప్పడం అతిశయోక్తి కాదేమో!"**

అమెరికా దేశపు అధ్యక్షులలో ఎంతో గొప్పవాడుగా పేరొందిన అబ్రహాం లింకన్ జీవితంలో ఎన్నో కష్టనష్టాలకోర్చి పైకెదిగాడు. ఆయన ప్రార్థన గురించి చెపుతూ, "అనేకసార్లు, అతడి దగ్గర తప్ప వేరెక్కడా సమాధానం దొరకదని రూఢిగా తెలిసినప్పుడు, నేను భగవంతుడికి మోకరిల్లాను!" అని చెప్పాడు.

దేవుడి మీద నమ్మకం లేదని మనం చెప్పినప్పుడు, ఆ అపనమ్మకం కేవలం మన ఆలోచనల స్థాయిలో ఉండేది మాత్రమే. నిజంగా మన అంతరాత్మలో అటువంటి అపనమ్మకం ఉండదు. ప్రకృతిసిద్ధంగా మనుష్యులందరూ దేవుడి మీదే ఆధార పడుతూ, దేవుణ్ణే ఊతంగా తీసుకుని జీవనయానం సాగిస్తున్నారు. భారతదేశంలో పుట్టినవాడెవడూ నాస్తికుడు కాలేడని వివేకానంద స్వామి చెప్పనే చెప్పారు! అందుచేత, జీవితంలో ఏ ఊతాన్నీ ఏర్పాటు చేసుకోని వారికి తమ జీవితం నిస్తేజంగా ఉన్నట్టు తోస్తుంది. ఎందుకంటే, నేడు ఉండి రేపు సమసిపోయే వస్తు సంపదలే ఆనందానికి మూలమని భావించేవారు, భగవంతుణ్ణి కేంద్రంగా చేసుకుని జీవించడంలో ఉన్న ఎడతెగని భద్రతనూ, ఆనందాన్నీ కోల్పోతున్నారు.

## ఆధునిక విజ్ఞానం దృష్టిలో ప్రార్థన

ఈ విశ్వంలో అంతుచిక్కని ఉన్నతశక్తిని వివరించడానికి ప్రయత్నించి, ఆధునిక విజ్ఞానశాస్త్రం దానిని వివిధ యాంత్రిక నియమాలుగానూ, పదార్థ నియమాలుగానూ నిర్వచించింది. సూర్యచంద్రులూ, గ్రహనక్షత్రాలూ, చరాచర వృక్షజంతుజాలాలూ, అణుపరమాణువులూ, వివిధరకాల ప్రకృతి శక్తులూ, అన్నీ ఆ నియమాలకు లోబడి పనిచేయవలసిందే. కానీ భౌతికమైన కొలతల అవధిని దాటని ఆధునిక విజ్ఞానశాస్త్రం ఈ నియమాల వెనుకనున్న మతలబును పూర్తిగా అర్థం చేసుకోలేనప్పటికీ, వాటిని గుడ్డివని బోధిస్తుంది. వాటికి ఏ ఉద్దేశ్యమూ, విధీ లేవని సూచిస్తుంది. మనిషి ఆ నియమాలను ఎదిరించలేడనీ, కేవలం ఈ ప్రకృతిశక్తుల తిరగలిలో అతడొక గింజ మాత్రమేననీ, దానిలోనే పడి నలిగిపోవడం కన్నా అతడు చేసేదేమీ లేదనీ ఆధునిక విజ్ఞానం బోధిస్తుంది. చివరకు దేవుడు కూడా ఆ నియమాలను దాటిపోలేడనీ, అసలు దేవుడి ప్రసక్తే అనవసరమనీ, అందుచేత ప్రార్థన చెయ్యడమే వ్యర్థమనీ అది బోధిస్తోంది. అయితే, అసలు కొన్ని నియమాలు ఉన్నాయనే విషయాన్ని అది అంగీకరిస్తోందని మనం గమనించవచ్చు.

పైనున్న ఏ దేవుడికో ప్రార్థన చెయ్యడమనేది తమ శాస్త్రీయ దృక్పథానికి చిన్నతనంగా ఉంటుందని కొంతమంది

అనుకుంటారు. వారి ఉద్దేశ్యంలో సర్వశక్తిమంతమైన మానవ మేధస్సుకు మించిన శక్తి మరొకటి ఈ విశ్వంలో లేదు. కానీ జీవితంలో కొన్నిసార్లు మనకు ఎదురయ్యే కొన్ని పరిస్థితులు ఈ ఆత్మవిశ్వాసాన్ని కూకటివేళ్ళతో కుదిపేస్తాయి. అలాంటి పరిస్థితులలో కలిగే భయంలో, చుట్టుముట్టిన అంధకారంలో, మన మనస్సు హేతుబద్ధతతో చెప్పే మాటలు గాలికెగిరిపోతాయి. అలాంటి సమయాలలోనే ఏదో ఉన్నత శక్తి యొక్క ఊతాన్ని తీసుకోవలసిన అవసరం, అంటే మతం (ఆధ్యాత్మికత) యొక్క అవసరం, మనకు తెలిసివస్తుంది.

## మతం దృష్టిలో ప్రార్థన

మతం కూడా ఆధునిక విజ్ఞానం చెప్పే నియమాలనే నమ్ముతుంది. మతం కూడా ఈ విశ్వానికి వెనుక ఒక మహోన్నత శక్తి ఉందనీ, దాని నియమాలకు మనం లోబడక తప్పదనీ బోధిస్తుంది. అయితే ఆ నియమాలకు ఎటువంటి విధివిధానాలూ లేవన్న విషయాన్నీ, ఆ నియమాలకు విచక్షణ లేదనీ, అవి చైతన్యరహితమైనవనీ చెప్పే వాదననూ, మతం అంగీకరించదు. పైగా వాటికి స్పష్టమైన దిశానిర్దేశాలు ఉన్నాయని వాదిస్తుంది.

ఒకవేళ నిజంగానే ఒక ఉన్నత శక్తి ఉన్నదనుకోండి. దానికి మనమీద అనుకంపం, జాలి కలిగేలాగ చేయడం ఎలా? ఆ శక్తితో మనం అన్యోన్యమైన సంబంధాన్ని ఎలా ఏర్పరచుకోవాలి?

ఎలాగైతే మానవుడు పదార్థనియమాల ముందు దాసోహమనక తప్పదని ఆధునిక విజ్ఞానశాస్త్రం చెపుతుందో, అలాగే మతాన్ని అనుసరించే వ్యక్తి ఆ ఉన్నతనియమాలను నిర్దేశించే శక్తిని 'దైవం' అనే పేరుతో పిలిచి, దానికి లోబడక తప్పదని చెపుతాడు. దానిని వేడుకున్నప్పుడు అది మనిషి మాట వింటుందనీ, అతడి కోరికలను తీరుస్తుందనీ చెపుతాడు. "శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు!" అని నానుడి. అదే కనుక నిజమైతే; మనకు నచ్చినా నచ్చకపోయినా, దేవుడి సంకల్పం మాత్రమే నెరవేరేటట్టయితే; ఈ జీవితపు దుఃఖాలను తట్టుకోవడానికి, జీవితంలోని విషాదాలను ఎదుర్కోవడానికి, దేవుని సంకల్పం ఎలా పనిచేస్తుందో తెలుసుకుని దానికి అనుగుణంగా నడుచుకోవడమొక్కటే మార్గం. అలా చేయడానికి ఏకైక సాధనం ప్రార్థన.

లుడ్విగ్ ఫ్యూయర్‌బాక్ (Ludwig Feuerbach) అనే జర్మన్ తత్త్వవేత్త ప్రార్థన యొక్క ప్రాముఖ్యతను ఇలా నిర్వచించాడు: "మతం యొక్క అత్యంత నిగూఢమైన సారం అతి సామాన్యమైన ఒక పనిలో కనిపిస్తుంది – అదే ప్రార్థన".

## ప్రార్థనల పరిణామం

అసలు ప్రార్థనలే అవసరం లేని స్థితికి మానవాళి ఎదగడమనేది ఎప్పటికీ జరగకపోవచ్చు. ఈ ఆధునిక కాలంలో కూడా ప్రార్థన యొక్క స్ఫూర్తి మనకు విస్పష్టంగా కనిపిస్తోంది. అయితే దాని

రూపం మారిపోయిందంతే.

తొలిమానవులు కూడా ప్రార్థనలు చేసేవారు. అయితే అది కొంత వేరుగా ఉండేది. కనికట్టు ద్వారా, ఇంద్రజాలం ద్వారా వారు భగవంతుడికి ప్రార్థన చేయడానికి ప్రయత్నించారు. ప్రకృతి లోని విపరీతపరిణామాలను చూసి తల్లడిల్లిన ఆదిమ మానవుడు తనకు శక్యం కాని పనులను దేవుడు చేస్తున్నాడనీ, తాను కూడా భగవంతుణ్ణి అనుకరించి, ప్రకృతికి అతీతంగా కనిపించే పనులను చేసి చూపితే భగవంతుడు సంతోషిస్తాడనీ భావించి ఉంటాడు. అందుచేతనే ఆ విధంగా భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకోవడానికి ప్రయత్నించాడు. "అనుకరణే నిజమౌతుంది!" అన్న సామెత అందరికీ తెలిసినదే! ఏసుక్రీస్తు, మహమ్మదు ప్రవక్త, శంకరా చార్యుడు లాంటి జగద్గురువులు దేవుడి గురించి ప్రార్థనలు చేసినప్పుడు, వారు ప్రార్థించిన విధానం తొలిమానవులు ప్రార్థించిన దానికంటే ఎంతో భిన్నంగా ఉందని మనం గ్రహించవచ్చు.

ఒక మతంలో ఆధ్యాత్మికమైన విలువలు పెరిగేకొద్దీ, ఆ మతసాధకుల ఆశయాలలో నిస్వార్థం, త్యాగం, సేవల ప్రాధాన్యత పెరుగుతుంది. శ్రీరామకృష్ణులు, "పూర్వకాలపు ఋషుల దృక్పథం ఎలా ఉండేదో తెలుసా? 'ఏదోవొక విధంగా ముందు నేను ముక్తి తెచ్చుకుంటే చాలు. ఇతరుల సంగతి నాకెందుకు?' అన్నట్టుగా వారు ప్రవర్తించేవారు" అని చెప్పారు. ఇలా జరగడాన్ని

మనం ఋగ్వేదమంత్రాలలో స్పష్టంగా చూడవచ్చు. ఋగ్వేదంలో ప్రారంభంలో కనిపించే అతి ప్రాచీనమైన ప్రార్థనలు సిద్ధుల కోసం, పేరుప్రఖ్యాతుల కోసం, ధనధాన్యాల కోసం, యుద్ధాలలో విజయం కోసం, శత్రువుల నాశనం కోసం చేసే సామాన్యమైన ప్రార్థనలలాగా కనిపిస్తాయి. కానీ, క్రమక్రమంగా అదే ఋగ్వేదం లో మానవాళి యొక్క సంక్షేమాన్ని కోరుతూ, 'సమదృష్టి'ని ప్రసాదించమని చేసే ఉదాత్తమైన ప్రార్థనలు కనిపిస్తాయి.

## ప్రార్థన మీద కొన్ని విమర్శలు, సమర్థన

"సమాజం ప్రగతిశీలంగా ఉండాలి కానీ ప్రార్థనల్లో మునిగిపోతే ప్రయోజనం లేదు. అసలు ప్రార్థనలు చేయడంవల్ల ప్రయోజనమేమిటి?" అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. అంతేకాక, "ప్రార్థనలు చేసే మనిషి ఇతరులను పట్టించుకోకుండా, సమాజం నుంచి దూరమవుతాడు. అలాంటప్పుడు ప్రార్థనల వల్ల ప్రయోజనమేమిటి?" అని కూడా ప్రశ్నించవచ్చు.

ప్రగతి ఈ రోజున చాలానే ఉంది! అయితే దానికి ఎటువంటి మూల్యం చెల్లిస్తున్నామో గమనించారా? ప్రగతి, నాగరికత అనే అందమైన పేర్లు కల ఒక 'పాండొరా పెట్టె'ను ఈ రోజున మనం తెరిచాము. (గ్రీకు ఇతిహాసాల ప్రకారం పాండొరా అనే అమ్మాయికి దేవతలు ఒక పెట్టెను ఇస్తారు. అయితే, దాని మూతను ఎన్నడూ తెరువకూడదని వారు షరతు విధిస్తారు. కానీ

దానిలో ఏముందో తెలుసుకోవాలన్న కుతూహలంతో ఆ అమ్మాయి ఆ పెట్టె మూతను తెరుస్తుంది. దానిలో నుంచి ఎన్నో రకాలైన వ్యాధిజనక సూక్ష్మజీవులు, కీటకాలు, తేళ్ళు, పాములు అన్నీ బయటకు వచ్చి, ప్రపంచమంతా వ్యాపించాయి. అప్పటి నుంచి మానవాళికి కష్టాలు మొదలయ్యాయి. ఆ విధంగా ఏమి జరుగుతుందో తెలియకుండా, ప్రకృతి విరుద్ధమైన, వినాశ కరమైన పనులను చెయ్యడాన్ని పాండొరా పెట్టెను తెరవడంతో పోలుస్తారు.) అదే విధంగా, ఈ ప్రగతి నుంచి ఎన్నో మహమ్మారులు, సమస్యలు సమాజం మీదకు విరుచుకుపడ్డాయి. ప్రగతి మానవుడికి ప్రశాంతంగా నిద్రపట్టకుండా చేసి, సామాజిక జీవనాన్ని ఒక పీడకలగా తయారుచేసింది. దానిలో నుంచి ఇంతకు ముందెన్నడూ ఎరుగనన్ని మానసిక రుగ్మతలు, నేరప్రవృత్తి, హింస వెల్లువెత్తి, సంఘం మీద విరుచుకుపడ్డాయి. కీకారణ్యాల కన్నా అపాయభరితంగా వున్న పట్టణవీధుల్ని చూస్తే ఈనాటి మన 'ప్రగతి' వింతగా కనిపిస్తుంది. అటువంటి ప్రగతిశీలసమాజం పేరుతో మనిషి యొక్క మానవత్వాన్ని నేలరాచి, అతడిలోని ఆధ్యాత్మికనైజాన్ని మనం పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నాము.

భౌతికమైన ప్రగతి మనిషిని నిర్వీర్యుణ్ణి చేస్తే, ప్రార్థన అతణ్ణి తిరిగి నిలద్రొక్కుకునేలా చేస్తుంది. ప్రగతి మనిషిలోని

మానవత్వాన్ని చంపివేసి, సమాజాన్ని భ్రష్టుపట్టిస్తే, ప్రార్థన మనిషిలోని మానవత్వానికి ప్రాణంపోసి, దివ్యత్వాన్ని ప్రోదిచేసి, తద్వారా సమాజాన్ని పవిత్రం చేస్తుంది. ప్రార్థన ద్వారా మనిషి తానేమిటో తెలుసుకుని ఉత్తముడవుతాడు. పంచదార నీటిలో కరిగి, ఆ నీటికి తీయదనాన్ని ఇచ్చినట్టు, ఉత్తముడైన మనిషి సమాజంలో మెలిగినప్పుడు సమాజం ఉన్నతిని సాధిస్తుంది.

ఒక చెట్టు స్థాణువులాగా నిలబడి ఉండడం చేత తన చుట్టూవున్న శక్తి-వినిమయ ప్రపంచంలోని హడావుడి నుంచి తప్పించుకుంటున్నట్టుగా కనిపిస్తుంది. అయితే ఆ చెట్టు నిశ్శబ్దంగా ప్రాణవాయువును సృష్టిస్తుంది. దీని నుంచి తయారయ్యే శక్తితోనే చుట్టూ వున్న ప్రపంచం నడుస్తుంది. అటువంటి వృక్షాన్ని మనం అడ్డంగా పనిలేకుండా ఉందని తూలనాడతామా? అదే లేకపోతే సమస్తజీవజాలం ఊపిరందక నేలకూలవలసిందే! అదే విధంగా ప్రార్థన చేసే మనిషి కూడా ఎవరికీ తెలియకుండా, ప్రపంచానికి ప్రాణశక్తిని అందిస్తాడు.

## ప్రార్థన ద్వారా మహనీయులైన వారు అనేకులు

అనాది నుంచీ, మహాప్రవక్తలు ఆచార్యులు అందరూ ప్రార్థన ద్వారా జ్ఞానోదయాన్ని పొందిన వారే. ఏసుక్రీస్తు తాను కలత చెందినప్పుడు, సందిగ్ధంలో పడినప్పుడు, ఏకాంతంలోకి వెళ్ళి పరలోకరాజ్యపు ప్రభువుకు ప్రార్థన చేసేవారని మనకు తెలుసు

(మార్కు 1:35). ఆ విధంగా ఏకాంతంగా అరణ్యాలలో తిరిగిన సంవత్సరాలలోనే ఆయన పరమోత్కృష్ట సత్యాన్ని సాక్షాత్కరించుకున్నారు. అలా జీవించిన కాలంలో, ఆయన తన కాలాన్ని పూర్తిగా ప్రార్థనలోనూ, భగవంతునితో మౌనసంభాషణలోనూ గడిపినట్టు మనకు తెలుస్తోంది.

మహమ్మదు ప్రవక్త జీవిత కథను చూడండి. ఆయన తరచూ కొండలలో ఏకాంతంలోకి వెళ్ళి, అక్కడ ప్రార్థనలతో దేవునిలో లీనమైపోయేవారు. అలాంటి సమయంలోనే దేవుడు ఆయనకు సత్యసాక్షాత్కారాన్ని కలిగించాడు.

ఇక, ఈ ఆధునిక కాలంలో, శ్రీరామకృష్ణ పరమహంస జీవితంలో కూడా ప్రార్థన ద్వారా ఆయన ఎలా సర్వోత్కృష్ట సత్యాన్ని సాక్షాత్కరించుకున్నారో కనిపిస్తుంది. భవతారిణి కాళికాదేవి విగ్రహం ముందు నిలబడి ఆయన, "అమ్మా! నాకు యోగం, తత్త్వం తెలియవు. నాకు ఏ పాండిత్యం లేదు. నేను నీ చంటిబిడ్డను. నాకు కనపడు తల్లీ!' అని ప్రార్థించేవారు. రోజుల తరబడి, రాత్రీపగలూ తేడా లేకుండా, ఆయన దివ్యజననిని ప్రార్థిస్తూ ఉండేవారు. సాయంత్రం గంగానది ఒడ్డున, "అమ్మా! ఈ నిరర్థకమైన జీవితంలో ఇంకొక రోజు గడిచిపోయింది. అయినా నాకు నీ దర్శనభాగ్యం కలుగలేదు!" అని నేలమీద పొర్లుతూ ప్రార్థించేవారు. చిన్నపిల్లవాడు ఏడ్చినట్టుగానూ, భరించలేని

బాధలో ఉన్నవాడిలాగానూ ఆయన ఆక్రోశించేవారు. ఆయన చుట్టూ చేరిన జనం, 'ఈ కుర్రవాడి తల్లి చనిపోయినట్టుంది!' అనుకునేవారు. ఇక ఒకరోజు ఈ బాధ ఎంత ఎక్కువైపోయిందంటే ఆయన భవతారిణీ కాళి విగ్రహం ముందు నిలబడి, "అమ్మా! నువ్వు కేవలం ఊహాకల్పితమైన దానివేనా? మనుష్యులు మతిభ్రమించి నీకు ప్రార్థనలు చేస్తారా? పూర్వం నీవు ఎందరో మహానుభావులకు సాక్షాత్కరించి, వారి జీవితాలను నీ చల్లని చూపులతో మధురం చేశావుట కదా! నీ దర్శనాన్ని పొందడానికి అర్హత లేనివాణ్ణా నేను?" అంటూ, అమ్మ దర్శనాన్ని పొందలేని ఈ జీవితం వ్యర్థమనుకుంటూ, అక్కడ గోడకు వేలాడుతున్న ఒక పెద్ద కత్తిని తీసుకుని ఆయన తన తల ఖండించుకోబోయారు. ఆ క్షణంలోనే అమ్మ తన మహితోన్నత మహితమైన రూపంలో ఆయనకు సాక్షాత్కరించింది.

ఆ విధంగా ప్రపంచంలోని మహాత్ములందరూ ప్రార్థన ద్వారా జ్ఞానోదయాన్ని పొందినవారే.

# 3. ఒక కథ

## గజేంద్రమోక్షణ

ప్రార్థన యొక్క ఫలసాధకత్వాన్ని చక్కగా వివరించేందుకు మన పురాణాలలో కనిపించే ఉత్తమోత్తమమైన కథ గజేంద్రమోక్షణ. ఏనుగునూ, మొసలినీ పాత్రలుగా తీసుకుని ఈ కథ చెప్పినా దీనిలో మానవులు ఎదుర్కొనే సమస్యాత్మక పరిస్థితులనూ, వాటిని ఎదుర్కోవడంలో మనిషిపడే ప్రయాసనూ చక్కగా వివరించారు. 'గజ' అనే మాటను తిరగవేస్తే అది 'జగ' అవుతుంది. ఆ విధంగా ఈ గజేంద్రుడి కథ ద్వారా జగత్తు గురించీ, అది ముక్తి పొందే విధానాన్నీ వివరించారని ఒక వ్యాఖ్యానం.

అన్నీ బాగా జరుగుతున్న రోజులలో మనిషి తనంతటి వాడు లేడనీ, తనకెవ్వరూ ఎదురు నిలువలేరనీ ప్రగల్భాలు పలుకుతాడు. కొంతవరకూ అలాగే జరుగుతుంది కూడా. అయితే రోజులన్నీ ఒకేలా ఉండవు. తన స్థితిగతులు తల్లక్రిందులైనప్పుడు మనిషికి గర్వం అణుగుతుంది. తనకన్నా బలవంతమైన శక్తి యొక్క ఆసరా దొరికితే బాగుండునని అనుకుంటాడు. నిజానికి, మనిషి గర్వాన్ని అణచడానికే పరిస్థితులు తల్లక్రిందులౌతాయేమో కూడా! ఈ ప్రపంచమే భగవంతుడి ఆట! ఆయన తన ఆటలో మనమందరం

ఆడాలనీ, గెలవాలని తపన పడాలనీ, ప్రయాస పడాలనీ, చివరకు గెలిచి ఆనందించాలనీ భగవంతుడు కోరతాడు. మనతోపాటు ఆయన కూడా సంతోషిస్తాడు.

చిన్నపిల్లలు 'తల్లి' ఆట ఆడుతూ ఉంటారు. ఆ ఆటలో సాధారణంగా వారి అమ్మ 'తల్లి'గా ఉంటుంది. ఒకరు దొంగ అవుతారు. తల్లి దొంగ కళ్ళు మూసి మిగిలిన పిల్లలందరినీ దాక్కోమంటుంది. తరువాత దొంగను వదులుతుంది. దాక్కున్న వాళ్ళందరూ ఆ దొంగకు దొరకకుండా తల్లిని చేరుకోవాలి. తల్లిని చేరకముందే ఆ దాక్కున్నవారిని దొంగ కనిపెడితే వారు 'ఔట'యిపోయినట్టే. అయితే కొందరు అతితెలివితో తల్లి వెనకాలే దాక్కునో, లేకపోతే చాలా దగ్గరలో దాక్కునో త్వరగా తల్లిని తాకుతాననుకుంటే అది తల్లికి ఇష్టం ఉండదు. అలా ఆడనివ్వదు. ఎంతో కష్టపడి తన దగ్గరకు చేరితేనే తల్లికి ఇష్టం.

ఆ ఆటలోనే కాక నిజజీవితంలో కూడా ఇదే నిజం. మనం ఒక్క నిముషంలోనే ఆయనను చేరిపోతే అది భగవంతుడికి నచ్చదు. ఆట కొంతకాలం సాగడమే భగవంతుడికి ఇష్టం. తన కోసం ఎంతో ఆరాటపడి, శ్రమపడి, చివరకు ఆయనను ప్రేమించడం నేర్చుకున్నప్పుడే భగవంతుడు తన భక్తుడికి దర్శనమిచ్చి అతడి అలసట తీరుస్తాడు. ఈ వైనాన్నే మనం మహాభాగవతంలోని గజేంద్రమోక్షణ అనే కథలో చదువవచ్చు. పోతన భాగవతంలోని

కొన్ని పద్యాల సహాయంతో మనం ఈ కథనూ, అందులోని పరమార్థాన్నీ తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాము.

గజరాజయిన గజేంద్రుడు మహాబలవంతుడు. అడవిలో అతడికి ఎదురులేదు. బలగర్వంతో నన్ను మించినవాడు లేడని అనుకుంటూ ఉన్నాడు. ఒకనాడు అనేక ఆడ ఏనుగులతో కలసి విహరిస్తూ, ఒక సరస్సు వద్దకు వచ్చి దానిలో దిగి ఆటలాడ సాగాడు. ఇంతలో ఆ సరస్సులో ఉన్న ఒక పెద్ద మొసలి వచ్చి అతడితో పోరాటానికి దిగింది.

ఆ ఏనుగుకూ, మొసలికీ మధ్య భయంకరమైన పోరాటం జరుగసాగింది. ఏనుగు మొసలిని నీటిలోనుంచి బయటకు లాగడానికి ప్రయత్నిస్తూ ఉంటే, మొసలి ఆ ఏనుగును మరింత లోతుకు లాగసాగింది. ఏనుగు తన తొండంతో ఆ మొసలిని పట్టుకుని విసిరివెయ్యాలని ప్రయత్నించింది. కాళ్ళతో దాన్ని మట్టగించాలని ప్రయత్నించింది. అయినా మహాబలశాలి అయిన ఆ మొసలి లొంగలేదు. మొసలి పట్టు వదిలించుకుని ఒడ్డుమీదకు పోదామని ఏనుగు ప్రయత్నించిన ప్రతిసారీ ఆ మొసలి ఏనుగును తిరిగి నీటిలోనికి లాగసాగింది. ఇలా ఆ రెంటికీ గొప్ప వీరత్వంతో జరుగుతున్న పోరాటాన్ని చూసి లోకాలన్నీ అచ్చెరువొందాయి.

అయితే ఆ పోరాటం ఎంతకీ తెగడం లేదు. గజేంద్రుడికి నేలమీద ఎదురులేనప్పటికీ, నీటిలో మొసలికి స్థానబలమెక్కువ.

క్రమంగా మొసలి నెగ్గుతున్నట్టుగా కనపడసాగింది. దాని పట్టు ఎలా వదిలించుకోవాలో, ఈ పోరాటంలో ఎలా గెలుపు సాధించాలో అర్థం కాక గజేంద్రుడు సతమతమవ్వసాగాడు. 'ఈ మొసలిని ఎలా గెలవాలి? ఏ దేవుణ్ణి పిలవాలి? ఎవరు నన్ను కాపాడతారు? ఇంత బలంగావున్న ఈ మొసలిని అడ్డగించి నన్ను రక్షించే వారెవరు? అలా నన్ను కాపాడగలిగిన సర్వసమర్థులూ, పుణ్యాత్ములూ ఎవరైనా ఉంటారా? ఇప్పుడు నాకెవరు దిక్కు?' అనుకోసాగాడు.

క్రమంగా అతడిలో నిరాశ క్రమ్ముకోసాగింది. అంతకాలంగా తాను విర్రవీగుతున్న గొప్పలన్నీ ఇప్పుడు ఎందుకూ పనికి రాకుండా పోతున్నాయే అనుకోసాగాడు. 'ఇన్నాళ్ళుగా అడవిలోని అన్ని జంతువుల చేత, మిగిలిన ఏనుగుల చేత గౌరవాన్ని పొందు తున్నాను. అసంఖ్యాకమైన ఆడ ఏనుగులకు ఆధిపత్యం వహించాను. చక్కని గంధపు చెట్ల నీడలో సుఖంగా ఉండకుండా ఈ నీళ్ళ మీద ఆశతో ఇక్కడకు వచ్చి, ఈ మొసలి నోటిలో చిక్కుకున్నాను. నా గతి ఏమవుతుందో?' అని వగచసాగాడు.

ఘోరకష్టాలు దాపురించినప్పుడు మనుషులంతా ఇలాగే ఆలోచిస్తారు. 'లోకం ఆకాశానికి ఎత్తివేసే గొప్ప పనులు ఎన్నో చేశాను కదా! అందరూ నన్ను ఎంతో గౌరవించారు కదా! అయినా నా పరిస్థితి ఇప్పుడు ఇలా అయిందేమిట'ని ఆశ్చర్యపోతారు.

మహాబలవంతులైన పాండవులు కూడా అడవుల పాలయ్యారు కదా! అనిత్యమైన ఈ ప్రపంచంలో మనం చేసే పనులన్నీ అశాశ్వతమేననీ, శాశ్వతమైనదేదో వేరే ఉన్నదనీ, దాన్ని శరణు వేడడం కన్నా వేరే మార్గం లేదనీ, కష్టాలు వచ్చినప్పుడే మనకు అర్థమవుతుంది.

**"మంచి అనుభవాల కంటే చెడు అనుభవాలే మనకు ఎక్కువ పాఠాలు నేర్పిస్తాయని చెప్పడానికి నేను సాహసించగలను!" అని వివేకానంద స్వామి చెప్పిన మాట మనం మరచిపోకూడదు.**

అయితే గజేంద్రుడికి ఏ దేవుడికి ప్రార్థన చెయ్యాలో పాలుపోలేదు. దేవుడి గురించి తాను విన్న విషయాలను కూర్చి, వాటినే ప్రార్థనగా గజేంద్రుడు మలచాడు.

**ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై**
**ఎవ్వని యందుడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం**
**బెవ్వఁ డనాదిమధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁ దానైనవాఁ**
**డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్**

"ఈ లోకం ఎవరి వలన పుడుతుందో, ఎవరిలో ఉంటుందో, ఎవరిలో లీనమౌతుందో, ఈ లోకానికి పరమేశ్వరుడు ఎవడో, మూలకారణం ఎవడో, పుట్టుక, పెరుగుట, చావు లేని వాడు ఎవడో, అన్నీ తానే అయిన వాడు ఎవడో, అటువంటి ఈశ్వరుణ్ణే నేను శరణువేడతాను!" అని ప్రార్థించాడు. ఈ ప్రార్థన చాలా

సరళంగా కనిపించినా ఎంతో అమోఘమైనది. ప్రపంచంలో తనకు వింతగా కనిపించే వాటన్నింటినీ చేర్చి, వాటి వెనుకనున్న శక్తి ఏదో మహాబలవంతమైనదనీ, అదే తనను కాపాడగలదనీ భావించి గజరాజు ఈ ప్రార్థన చేశాడు.

నిజానికి, ప్రార్థన చేయడానికి మనకేమీ తెలియనవసరం లేదు. మనం శరణువేడిన ఆ ఉన్నతశక్తి పట్ల విశ్వాసంతో మన మనస్సులోని మాటను దానికి నివేదించడమే ప్రార్థన. గజేంద్రుడు తన ప్రార్థనను ఇంకా ఈ విధంగా కొనసాగించాడు.

**లోకంబులు లోకేశులు లోకస్థులుఁదెగిన తుది నలోకం బగు పెం**
**జీఁకటి కవ్వలనెవ్వం, డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్**

'ఈ సమస్త లోకాలూ, వాటి అధిపతులూ, ఈ లోకాలలో ఉండేవారందరూ గతించిన తర్వాత మిగిలే కారుచీకట్లకు అవతల ఒకే రూపంతో వెలుగుతూ ఉండే పరమేశ్వరుణ్ణి నేను సేవిస్తాను.'

**కలఁడందురు దీనులయెడఁ**
**గలఁడందురు పరమయోగి గణములపాలం**
**గలఁడందు రన్ని దిశలను,**
**గలఁడు కలండనెడు వాఁడు గలఁడో లేఁడో**

'ఆర్తుల వెంట, దీనుల వెంట దేవుడు ఉంటాడట. ఉత్తములైన యోగులకు చెంతనే ఉంటాడట. అన్ని దిక్కులలోనూ ఉంటాడట. అలా అందరూ "ఉన్నాడు, ఉన్నాడు!" అనేవాడు అసలు ఉన్నాడో

లేడో!' అని తన అనుమానాన్ని వ్యక్తం చేశాడు. మనుష్యులందరికీ ఈ విధమైన అనుమానం తప్పక కలుగుతుంది. అవతార పురుషు లందరూ కూడా ఏదోవొక సమయంలో ఇదే విధమైన అనుమానాన్ని ఎదుర్కొన్నారు. అయితే ఈ పరిస్థితి కూడా ఆ దేవుడి ఆటలో ఒక భాగమే. ఇదే మన విశ్వాసం మరింతగా పెరిగేందుకు తోడ్పడుతుంది. చివరిగా తన శక్తి అంతా నశించిపోయి, ఇలా ప్రార్థన చేశాడు.

**లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెన్ మూర్ఛవచ్చెఁన్ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప నితఃపరం బెరుఁగ మన్నింపం దగు దీనునిన్,**
**రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!**

'ఇక నా శరీరంలో ఏమాత్రం బలం మిగలలేదు. ధైర్యం తల్లక్రిందులైంది. ప్రాణాలు కడగడుతున్నాయి. స్పృహతప్పి మూర్ఛ వస్తోంది. శరీరం పూర్తిగా అలసిపోయింది. నిలబడడానికే ఎంతో ప్రయాసపడవలసివస్తోంది. ఇక నాకు నీవు తప్ప వేరెవరూ లేరు. ఓ ఈశ్వరా! ఓ భక్తవరదా! వరాలిచ్చే దేవతవు! నన్ను రక్షించడమే న్యాయం కదా! నన్ను కావరాదా!'

గజేంద్రుడు గొప్ప బలవంతుడు. ఎంతో గొప్పగా పోరాడాడు. తన శక్తినంతా ఉపయోగించి ఆ మొసలిని మట్టుబెట్టడానికి ప్రయత్నించాడు. ఎక్కడా ఒళ్ళు దాచుకోవడానికి ప్రయత్నించ

లేదు. అయితే, తనలోని శక్తులన్నీ ఉడిగిన తర్వాత తనకన్నా ఉన్నతమైన శక్తిని సహాయం కోరాడు. అప్పటి వరకూ సాగించిన పోరాటంలో, అతడి ప్రయత్నలోపం ఏమాత్రం లేదు. ప్రార్థన చేసేవాడు చూపవలసిన అన్ని సుగుణాలనూ గజేంద్రుడు చూపాడు. ఆర్తిలో ఉన్న భక్తుడి ప్రార్థనలకు దేవుడి ప్రతిస్పందన ఎలా ఉంటుందో ఇప్పుడు మనం చూడవచ్చు. అతడి ప్రార్థనలను విని, శ్రీమహావిష్ణువే స్వయంగా బయలుదేరి వచ్చాడు.

ఆ సమయంలో విష్ణువు వైకుంఠంలో ఉన్నాడు. అక్కడ అమృతపు సరస్సుకు ప్రక్కనే ఉన్న చలువరాతి శిలల మీద వేసిన కలువపూల పాన్పుమీద లక్ష్మీదేవితో వినోదిస్తున్నాడు. ఆ సమయంలో 'కాపాడు! కాపాడు!' అంటూ గజేంద్రుడు చేస్తున్న ఆక్రందనలు ఆయనకు వినిపించాయి. ఆర్తత్రాణపరాయణుడైన విష్ణువు ఒక్క ఉదుటున పైకి లేచి, తన భక్తుని చెంతకు గబగబా బయలుదేరాడు. ఆయన స్థితి ఇలా ఉంది.

**సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే**
**పరివారంబును జీరఁ డభ్రకపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో**
**పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై**

ఆ తరుణంలో ఆయన తాను ఏ స్థితిలో ఉన్నాడో చూసుకోవడం లేదు. ఏమయిందో, ఎక్కడికి బయలుదేరుతున్నాడో

లక్ష్మీదేవితో చెప్పడం లేదు. శంఖచక్రాలను చేతులలోకి తీసుకోలేదు. తన పరివారాన్ని పిలువలేదు. తన వాహనమైన గరుత్మంతుణ్ణి కూడా పిలువకుండా, పరుగెత్తి పోసాగాడు. ఇక గత్యంతరం లేక, ఆయన వెంట లక్ష్మీదేవి, శంఖచక్రాదులు, తక్కిన పరివారం మొత్తం బయలుదేరారు.

గజేంద్రుడున్న కొలను వద్దకు చేరుకుని విష్ణువు తన చక్రాయుధంతో ఆ మొసలి శిరస్సును ఖండించాడు. చక్రాయుధం దెబ్బకి మరణించిన ఆ మకరి 'హూహూ' అనే పేరుగల గంధర్వుడిగా మారి, విష్ణువుకు సాగిలపడి మొక్కి, తన లోకానికి సాగిపోయాడు. మొసలి నోటి నుండి విముక్తి పొందిన ఆ గజరాజు సపరివారంగా శ్రీమహావిష్ణువును పరిపరివిధాల స్తుతించాడు. శ్రీమహావిష్ణువు గజేంద్రుణ్ణి ప్రేమతో నిమిరి అతడి అలసట తీర్చాడు. గజేంద్రుడు కూడా విష్ణుసాయుజ్యం పొందాడు.

మనం ప్రార్థన చేసినప్పుడు భగవంతుడు తప్పక వింటాడనీ, మన సహాయానికి వస్తాడనీ మనం ఈ కథ ద్వారా అర్థం చేసుకోవాలి. ఏ పరిస్థితులలోనైనా సరే భగవంతుడు తప్ప మనిషికి వేరే గతి లేదు.

# 4.వర్గీకరణలు

## చేసే పద్ధతిని బట్టి ప్రార్థనల వర్గీకరణ

ప్రార్థనను మానసికం, వాచికం అని రెండుగా విభజించవచ్చు. మనస్సులోనే చేసేది మానసికం. వాచికం అంటే నోటితో పలికేది.

కోరికల, మోహాల రూపంలో మన మనస్సులలో అనేక మలినాలు దాగి ఉంటాయి. ఈ కోరికలే మనస్సు యొక్క చంచలత్వానికి కారణం. ఒక పారదర్శకమైన స్ఫటికం ఉందనుకోండి. దాన్ని ఏ వస్తువు దగ్గర ఉంచితే, ఆ వస్తువు రంగులో అది కనిపిస్తుంది. మనస్సు కూడా అంతే. ఈ క్షణంలో మనస్సు దేని గురించి చైతన్యంగా ఉంటుందో (అంటే చురుకుగా ఆలోచిస్తూ ఉంటుందో) దాని రంగునే అది పులుముకుంటుంది.

అయితే మనస్సులో రెండు పొరలు ఉంటాయి. ఒకటి పైన ఉండే చైతన్యస్థితి అయితే, మరొకటి అడుగున ఉండే

ఉపచైతన్యస్థితి. చైతన్యస్థితిలో ఉన్న ఆలోచన కొంతసేపటి తర్వాత ఉపచైతన్యస్థితిలోకి వెళ్ళిపోతుంది (అంటే మరుగున పడి పోతుంది). ప్రవహించే నది అడుగున ఇసుక, ఒండ్రుమట్టి పేరుకు పోతూ ఉంటాయి. అలాగే మన మనస్సు యొక్క ఉప చైతన్య భాగంలో మనం నిత్యం చేసే ఆలోచనలు మరుగునపడి, అనేక కల్మషాల రూపంలో పేరుకుపోతూ ఉంటాయి. నదిలో పేరుకున్న ఇసుక, మట్టి ఎలాగైతే నది ప్రవహించే గతిని మార్చివేస్తాయో అదే విధంగా, ఉపచైతన్య స్థితిలోని ఆలోచనలు పైకి కనపడకపోయినా, మన ప్రవర్తనను మార్చివేస్తాయి. కాబట్టి ఉపచైతన్య స్థితిలోని మనస్సు మన వ్యక్తిత్వానికి తన 'రంగును' పులుముతుందని మనం అర్థం చేసుకోవాలి. ఈ రంగును వదిలించుకోవడం అంత సులభం కాదు.

అయితే, మనస్సులోకి ఒకే ఆలోచనను పదేపదే చొప్పించడం వలన మనస్సు దానికి తగ్గట్టుగా మారిపోతుంది. ఈ ప్రక్రియను అర్థం చేసుకోవడానికి ఒక ఉదాహరణను చూద్దాం. ఎండిపోయిన సిరాబుడ్డిని మంచినీళ్ళతో శుభ్రం చేస్తున్నపుడు రంగు నీళ్ళే ఆ బుడ్డి నుండి బయటకు వస్తాయి. మనం వదలకుండా మంచి నీటిని పోస్తూ ఉంటే రంగు అంతా పోయి, చివరకు మంచినీళ్ళే బయటకు వస్తాయి. అలాగే మనస్సును శుభ్రపరచడానికి మంచి ఆలోచనల్నే నీరులాగా వాడాలి. నిరంతరం ఇంద్రియ విషయాల

మీద పని చేయడం వల్ల మన మనస్సులో కామం, లోభం మొదలైన దుర్గుణాలు పేరుకుపోయాయి. దాన్ని భగవంతుడి మీద, ఆయన గుణగణాల మీద నిరంతరం సంచరించేలా చేయడం వలన దాన్ని మనం ప్రశాంతపరచి, ఆనందమయమైన ఆధ్యాత్మిక మార్గంలోకి మలచవచ్చు.

ఈ విధంగా చూసినప్పుడు మానసికమైన ప్రార్థన అంటే ఏమిటో మనం అర్థం చేసుకోవచ్చు. భగవంతుడి రూపం మీద, గుణగణాల మీద, ఆయన చేసిన మహల్లీలల మీద, మౌనంగా, పెదవులు కదపకుండా, మనస్సును కేంద్రీకరించడమే మానసిక ప్రార్థన. భగవంతుణ్ణి, "అగణిత గుణగణ సముద్రుడు (అంటే లెక్కకు అందని మంచి గుణాలు కలవాడు)" అని రామానుజా చార్యులు కీర్తించారు. ఆ గుణాలలో మనకు నచ్చే ఏ గుణాన్ని అయినా తీసుకుని మనం ఆలోచించవచ్చు. పవిత్రత, కారుణ్యం, సౌందర్యం, ప్రేమ, మొదలైన సుగుణాలలో దేన్ని అయినా మనం ఎంచుకోవచ్చు. ఇలా చేయడం ద్వారా ఉపచైతన్య స్థితిలో నిద్రాణంగా ఉన్న కల్మషాలన్నింటినీ తొలగించడం సాధ్యమవు తుంది. మొండిదైన మనస్సు యొక్క చపలత్వం క్రమక్రమంగా తగ్గిపోతుంది. మనస్సులో విభేదాలు, అంతర్మథనాలు తొలగి పోతాయి. కొత్త శక్తి, కొత్త ఆనందం లోపలి నుంచి పైకి ఉబికి వస్తాయి. మనం కొత్త మనుష్యులుగా మారిపోతాము.

ఇక వాచికమైన ప్రార్థన మనందరికీ బాగా పరిచయమున్నదే. మనం మాటల ద్వారా, శ్లోకాల ద్వారా, స్తోత్రాల ద్వారా రోజూ ఈ రకమైన వాచిక ప్రార్థనను చేస్తూనే ఉంటాము. ఇది మానసికమైన ప్రార్థన కన్నా ఒక మెట్టు దిగువనే ఉన్నా, మనలో అత్యధిక శాతానికి ఇదే శరణ్యం. ఎందుకంటే ఈ వాచిక ప్రార్థనకు అంత ఎక్కువ ఏకాగ్రత అవసరం లేదు. అయితే ఇది అంతకన్నా ఎక్కువ ఏకాగ్రత అవసరమైన మానసిక ప్రార్థనకు దారి తీస్తుంది.

అయితే, వాచికమైన ప్రార్థన చేస్తున్న సమయంలో మనం పలుకుతున్న మాటల మీద మన మనస్సు ఏకాగ్రమయ్యేలా జాగ్రత్త తీసుకోవాలి. దీని గురించి గాంధీజీ హెచ్చరిస్తూ, “మీరు చేసే ప్రార్థన ఏ రూపంలో ఉన్నా ఫర్వాలేదు కానీ మీ నోటిలో నుంచి మాటలు వెలువడేటప్పుడు మీ మనస్సు ఎటో పారిపోకుండా జాగ్రత్త పడండి!” అని చెప్పారు. సాధారణంగా మన నోరు పలికే ప్రార్థనలు యాంత్రికంగా బయటకు వస్తూ ఉంటాయి. వాటిని మనం మనస్ఫూర్తిగా పలుకము. కానీ, మన ప్రార్థన సఫలమవ్వాలంటే మన పలుకులకు చిత్తశుద్ధి తోడవ్వడం ఎంతైనా అవసరం.

## కోరేదాన్ని బట్టి ప్రార్థనల వర్గీకరణ

మనం దేన్ని కోరుతూ ప్రార్థిస్తామో దాన్ని బట్టి ప్రార్థనలను మూడు రకాలుగా విభజించవచ్చు.

అవి: అర్జీల లేదా ఫిర్యాదుల ప్రార్థనలు; జ్ఞానం కోసం చేసే ప్రార్థనలు; విశ్వకళ్యాణం కోసం చేసే ప్రార్థనలు.

**అర్జీల, ఫిర్యాదుల ప్రార్థనలు**

కష్టాలు, దుఃఖాలు, దురదృష్టాలు ఎదురైనప్పుడు మనిషి భగవంతుణ్ణి కలగజేసుకోమని కోరతాడు. తన కష్టాలు తీరేందుకు, తన కోరికలు నెరవేరేందుకు సహాయాన్ని కోరతాడు.

ఇలా ప్రార్థించేవారికి భగవంతుడు సరిగా అర్థం కాలేదనే చెప్పుకోవాలి. కొన్నిసార్లు ఈ ప్రార్థనలు చిన్న పిల్లల అర్థంపర్థం లేని కోరికలలాగా ఉంటాయి.

ఒక ధనవంతుడు ఇలా ప్రార్థిస్తున్నాడట: "ఓ ప్రభూ! నా ఊపిరితిత్తుల్లో కఫం చేరకుండా చూడు. నన్ను దోమలు కుట్టకుండా చూడు! ఇంకొక లక్ష సంపాదించే వరకూ నేను బ్రతికివుండేలా చూడు! నేను బ్యాంకులో కుదువబెట్టిన సొమ్ముకు వడ్డీని కళ్ళారా చూసుకోవాలి కదా! బొగ్గుగనులలో నేను పెట్టిన పెట్టుబడులు పెరిగేలా చూడు!"

కోరడంతో కథ ముగిసిపోదు. 'ప్రతి కోరిక వెనుక పెద్దపులి ఉన్నట్టు,' అలా తీరిన కోరిక మొదట్లో సుఖంలాగా కనిపించినా, ఆ తర్వాత అదే విషతుల్యంగా పరిణమిస్తుంది. (ఒక కథ చెపుతా విను!, 'బాటసారి-కల్పవృక్షం', పేజీ 21) అది పెట్టే బాధలకు తట్టుకోలేక, మనం జుట్టు పీక్కుని, అటువంటి కోరిక

కోరినందుకు మనల్ని మనమే తిట్టుకుని, దాన్ని తీర్చినందుకు దేవుణ్ణి కూడా తిట్టి, ఏడుస్తూ కూర్చుంటాము.

అయితే ఇలా ప్రార్థనలు చేసేవాడు కూడా మంచివాడేనని గీతలో కృష్ణుడు చెప్పాడు. ఎందుకంటే మనుష్యులు తమ స్వభావం వల్ల, పరిస్థితుల వల్ల ఘోరమైన నిస్సహాయస్థితిలో పడిపోతారు. అటువంటప్పుడు భగవంతుణ్ణి కాకపోతే ఎవరిని వేడుకుంటారు?

కాబట్టి మనుష్యులు తాము కోరుతున్నదాని కోసం ప్రార్థించడం తప్పు కాదు కానీ ఆ ప్రార్థనను నిజంగా తీర్చాలా వద్దా అన్న నిర్ణయాన్ని భగవంతుడికే వదిలిపెట్టడాన్ని నేర్చుకోవాలి.

**జ్ఞానం కోసం చేసే ప్రార్థనలు**

సగటు మనిషి ఎలాగైతే తన కోర్కెలు తీర్చమని భగవంతుడికి ప్రార్థన చేస్తాడో, ఆధ్యాత్మిక సాధకుడు ఆధ్యాత్మిక విషయాలలో తనకు సహాయపడమనీ, తనకు చిత్తశుద్ధినీ, జ్ఞానాన్నీ కలిగించమనీ వేడుకుంటాడు. ఈ ప్రార్థనలో కూడా భక్తుడు భగవంతుడికి అర్జీ పెట్టుకున్నట్టే కనపడుతుంది. కానీ మనం చిత్తశుద్ధి కోసం, భక్తి కోసం, వైరాగ్యం కోసం, జ్ఞానం కోసం ప్రార్థించినపుడు ఇక ఆ ప్రార్థనను మనం సాధారణమైన ప్రార్థనగా భావించలేము.

"భక్తి కావాలనుకునే కోరిక, కోరిక కాదు!" అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. మామూలు కోరికలు మనిషిని

మరిన్ని బంధాలలో పడవేస్తాయి కానీ భక్తి, జ్ఞానం అతణ్ణి అన్ని బంధాల నుంచీ విముక్తుణ్ణి చేస్తాయి.

వివేకానంద స్వామి యువకుడుగా ఉన్నప్పుడు హఠాత్తుగా అతడి తండ్రి మరణించడంతో ఆస్తులన్నీ పోగొట్టుకుని కటిక దారిద్ర్యంలో గడపవలసి వచ్చింది. తల్లీ, తోబుట్టువులూ పస్తులుండడం చూడలేక శ్రీరామకృష్ణులను తన కష్టాలు తీరే మార్గం కోసం జగన్మాతకు ప్రార్థన చేయమని కోరాడు. ఆయన 'నీవే కోర'మని అతడికి సలహా ఇచ్చారు. అయితే అతడు భవతారిణీ కాళికాదేవి విగ్రహం ముందు నిలబడినప్పుడు నాకు డబ్బు కావాలని కోరడం మరిచిపోయి భక్తిజ్ఞానవైరాగ్యాలు కావాలని కోరాడు. అలా మూడుసార్లు ప్రయత్నించినా మూడు సార్లు కూడా భక్తిజ్ఞానవైరాగ్యాలనే కోరాడు.

లోకమాత ముందు నిలబడి లౌకికమైన వస్తువులను కోరడం అతడికి సాధ్యం కాలేదు. చివరకు, సామాన్యజీవనానికి సరిపడిన డబ్బు నీ కుటుంబానికి సమకూరుతుందిలే అని శ్రీరామకృష్ణులే ఆశీర్వదించారు.

ఇలా జ్ఞానాన్ని కోరి చేసే ప్రార్థనకు అత్యుత్తమమైన ఉదాహరణ: వేదాల నుంచి మనకు వారసత్వంగా లభించిన అద్భుతమైన గాయత్రీ మంత్రం.

**ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యమ్ ।**
**భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ ॥**

"అన్నింటికీ వెలుగునిచ్చేవాణ్ణీ, ప్రకాశమానులలో అగ్రగణ్యుణ్ణీ మనం ధ్యానిద్దాము. ఆయన మన బుద్ధికి దారిచూపు గాక!"

ఈ ప్రార్థనలోని విశ్వజనీనత ఒక అసాధారణమైన విషయం. "నా బుద్ధికి దారి చూపాలి!" అని కాక "మన బుద్ధికి దారి చూపాలి!" అని అందులో ప్రార్థించడం ద్వారా అది కేవలం ఒకరికి సంబంధించినదే కాక సర్వమానవ సంక్షేమాన్ని కోరే ప్రార్థన అయింది.

యజుర్వేదంలో మరొక మనోజ్ఞమైన ప్రార్థన మనకు కనిపిస్తుంది.

**అసతో మా సద్గమయ । తమసో మా జ్యోతిర్గమయ ।**
**మృత్యోర్మా అమృతం గమయ । ఓం శాంతిః శాంతిః శాంతిః ॥**

అసత్యం నుంచి మమ్మల్ని సత్యానికి నడిపించు! చీకటి నుంచి మమ్మల్ని వెలుతురులోనికి నడిపించు! తమస్సులో నుంచి మమ్మల్ని జ్ఞానంలోనికి నడిపించు. మృత్యువు నుంచి మమ్మల్ని అమృతత్వం వైపు నడిపించు! ముల్లోకాలలోనూ శాంతి కలుగుగాక!

### విశ్వజనీన ప్రార్థనలు

విశ్వమానవాళి సంక్షేమాన్ని కోరుతూ చేసే ప్రార్థననే విశ్వజనీన ప్రార్థన అని చెప్పుకోవచ్చును. ఇటువంటి ప్రార్థనను చేయడానికి మనిషి భగవంతుణ్ణి నమ్మేవాడు కానవసరం లేదు కూడా. ఇది

మనిషిలో నిస్వార్థబుద్ధిని మేలుకొలిపి, ఆంతరికంగానూ, బాహ్యంగానూ మనిషి ప్రవర్తనలో సమన్వయాన్ని కలిగించి, మనిషిని బందీగా చేసే అహంకారపు జైలుగోడల్ని కూల్చివేస్తుంది.

హిందూమతానికి సంబంధించిన స్తోత్రాలలోనూ, బౌద్ధ మతానికి చెందిన శాస్త్రాలలోనూ దీనికి అనేక ఉదాహరణలు ఉన్నాయి.

**సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్ దుఃఖభాగ్ భవేత్ ॥**

"అందరూ సంతోషంగా, ఆరోగ్యంగా, భద్రంగా ఉందురు గాక! వారికి సంక్షేమం కలిగించేదేమిటో అందరూ తెలుసుకొందురు గాక! ఎవరూ కూడా దుఃఖంలో, బాధలలో పడకుండా ఉందురు గాక!"

**దుర్జనః సజ్జనో భూయాత్ సజ్జనః శాంతిమాప్నుయాత్ ।**
**శాంతో ముచ్యేత బంధేభ్యో ముక్తశ్చాన్యాన్ విమోచయేత్ ॥**

"దుర్మార్గులు మంచివారగుదురుగాక! మంచివారు శాంతిని పొందెదరు గాక! శాంతిని పొందినవారు తమతమ బంధాల నుంచి ముక్తిని పొందెదరు గాక! ముక్తులయినవారు మిగిలినవారందరికీ ముక్తిని కలిగించెదరు గాక!"

## స్వార్థమైన ప్రార్థనలు - నిస్వార్థమైన ప్రార్థనలు

ప్రార్థన చేసేటప్పుడు మనిషి మనస్సులోని స్వార్థాన్ని బట్టి ప్రార్థనలను రెండు రకాలుగా విభజించవచ్చు: అవి స్వార్థమైనవి, నిస్వార్థమైనవి.

## స్వార్థమైన ప్రార్థనలు

మనుష్యులలో నాలుగు రకాల వారు ఉంటారని అంటారు. వారిలో మొదటిరకం వారిని బొంగరంతోనూ, రెండవరకం వారిని సర్కస్ గుఱ్ఱంతోనూ, మూడవరకం వారిని భూమితోనూ, నాలుగవ రకం వారిని సూర్యునితోనూ పోలుస్తారు.

ప్రాథమిక స్థాయిలో, వ్యక్తిగతస్థాయిలో, స్వార్థపూరితంగా, "ఓ దేవా! నాకు అది కావాలి! నాకు ఇది కావాలి!" అని ప్రార్థన చేస్తారు. ఈ రకమైన ప్రార్థనలో 'నేను' అనే స్వార్థం అన్నిటికన్నా మిన్నగా ఉంటుంది. వీరు బొంగరంలాగా తమ చుట్టూ తాము తిరుగుతూ ఉంటారు. వీరి ఆసక్తి స్వీయసంక్షేమం మీద మాత్రమే.

ఆపై స్థాయిలో మనిషి తన సంతోషం తన కుటుంబసభ్యుల సంతోషం మీద ఆధారపడుతుందని గ్రహిస్తాడు. ఈ స్థాయిలో మనిషి తన కోసమే కాక, తన కుటుంబసభ్యులకోసం కూడా ప్రార్థిస్తాడు. ఈ కోవకు చెందినవారు సర్కసులో రంగస్థలం (ఎరీనా) చుట్టూ పరిగెత్తే గుఱ్ఱంలాంటివారు. వీరి దృక్పథం మరికొంత విశాలమైనది.

ఇంకా పైస్థాయిలో అతడి సంకుచితత్త్వం కొంచెం సడలి, తన గురించి, తన దగ్గరి బంధువుల గురించి మాత్రమే కాక తనకు తెలిసిన వారందరి కోసం ప్రార్థన చేస్తాడు. ఆ విధంగా అతడి మానవసంబంధాల స్థాయి చాలా ఎత్తుకు ఎదిగిందన్నమాట. ఈ

రకమైన మనుష్యులు భూమిలాగా తమచుట్టూ తాము తిరుగుతున్నా అనేకమందికి మేలు చేస్తూ ఉంటారు.

నాలుగవ రకంవారు సూర్యుడిలాగా తమ స్వార్థం ఏమాత్రం చూసుకోకుండా ఇతరులకు మేలు చేస్తూ ఉంటారు. వారిని గురించి మరింత వివరంగా ఇప్పుడు చూద్దాము.

**నిస్వార్థమైన ప్రార్థనలు**

స్వార్థపు కోరికల స్థాయిని దాటీదాటని పరిస్థితులలో ఉన్న మనిషి, భౌతిక ప్రపంచంలో రకరకాల చేదు అనుభవాలను పొందుతాడు. ఆపైన, తాను ఎంత చక్కదిద్దాలని ప్రయత్నించినా 'కుక్కతోక వంకర' అన్నట్టు ఉండే ఈ ప్రపంచ పరిస్థితిలో ఏ మార్పూ రావడంలేదని గమనిస్తాడు. వీటన్నింటివల్ల తనలో ఏదో వెలితి ఉందని మనిషి బాధపడతాడు. ఆపైన, ప్రస్తుతం తాను చిక్కుబడిపోయి ఉన్న అహంకారమమకారాలు, ప్రాపంచికమైన బంధాలే ఈ వెలితికి కారణమనీ, వాటి నుంచి బయటపడాలంటే కేవలం తన శక్తియుక్తులే చాలవనీ గ్రహిస్తాడు.

ఇలా ఒక మెట్టు పైకెక్కిన మనిషి, పరమాత్మ యొక్క సచ్చిదానందమయమైన అనంతచైతన్యంలో లీనమైపోవడమే తన అశాంతికి విరుగుడని భావించి, ప్రార్థిస్తాడు. ఈ స్థాయి వ్యక్తి దృష్టిలో దేవుడు పైనెక్కడో కూర్చున్న 'మేనేజింగ్ డైరక్టర్' కాదు – తనకు నాలుగు చిల్లపెంకులు 'బోనస్'గా పడవేయడానికి! అతడికి

భగవంతుడే ప్రియాతిప్రియమైన వాడు. ఆయన ఎడబాటు అతడికి దుర్భరమైన వేదనగా తయారవుతుంది. అటువంటి మనిషికి భగవంతుడు - భగవంతుడు మాత్రమే - కావాలి. తనకు ఎదురయ్యే కష్టాలూ, కడగండ్లూ మాత్రమే కాక తనకు వచ్చిన పేరుప్రఖ్యాతులూ, ఆస్తిపాస్తులూ అన్నీ భగవంతుడి నుంచే వచ్చాయని అతడు భావిస్తాడు. ఇక మీదట దేవుడికి నివేదించేందుకు అతడి దగ్గర నిందారోపణలు కానీ, కోరికలు కానీ ఏమీ ఉండవు.

ఋషులూ, మునులూ, మహాత్ములూ కూడా ప్రార్థించినా, తమ కోసం కాక సర్వలోక సంక్షేమాన్ని కోరుతూ ప్రార్థిస్తారు. వారికి కూడా కష్టాలు దాపురిస్తాయి కానీ వాటిని లోకసంక్షేమం కోసం భరిస్తారు. వారు మానవాళి పక్షం వహించి, వారి తరఫున పరమాత్మను వేడుకుంటారు. మోసెస్ తనవారి బాధ్యతను తన భుజాల మీదే వేసుకున్నాడు. వారు తమ బాధ్యతను నిర్వర్తించ డంలో విఫలమైనా వారిని అతడు తృణీకరించలేదు. “నీ ప్రజలను రక్షించు!” అని పరమాత్మను వేడుకున్నాడు (Exodus 32:11-14). ఇదే విధంగా, తనను తాను సమస్త జనావళితో ఏకీభవించు కోవడం ఏసుక్రీస్తు చేసిన విశ్వవిఖ్యాతమైన ప్రార్థనలో మనకు కనిపిస్తుంది: “ఓ తండ్రీ! వారిని క్షమించు! వారేమి చేస్తున్నారో వారికే తెలియదు!” అని ఆయన ప్రార్థించాడు (Luke 23:34).

ఇటువంటి పరమప్రేమనే శ్రీరామకృష్ణ పరమహంస దేవుల మాటలలో కూడా చూడవచ్చు: (పారవశ్యస్థితిలో నుంచి మేలుకుని స్పృహలోకి వస్తూ) "అమ్మా! భావశుద్ధిగల భక్తితో ఎవరైతే ఇక్కడకు (అంటే రామకృష్ణుల వద్దకు) వస్తారో, వారికి పరిపూర్ణతను ప్రసాదించు తల్లీ!' అని ప్రార్థించాను!" అని అన్నారు.

**వివేకానంద స్వామి ఇలా చెప్పారు: 'నా సంగతి ముందు చూసుకుంటాను!' అనుకునే స్వార్థమే అన్నిటికంటే పెద్ద పాపం. 'అందరి కంటే ముందు నేను తింటాను! ఇతరులందరి కంటే ఎక్కువ ధనం నాకు ఉండాలి! ప్రతిదీ నా సొంతం కావాలి!' అనుకునేవారు, లేకపోతే 'ఇతరుల కంటే ముందు నేను స్వర్గానికి వెళ్ళాలి! ఇతరుల కంటే ముందు నేను ముక్తిని పొందాలి!' అనుకునేవారు స్వార్థపరులు. "నేను అందరికంటే చిట్టచివర నిలబడతాను. స్వర్గం కోసం వెంపర్లాడను. నా సోదరులకు సహాయం చెయ్యడం కోసం నరకానికి వెళ్ళడానికి సైతం నేను సిద్ధమే!" అని నిస్వార్థపరుడు అంటాడు. ఈ నిస్వార్థమే మతధర్మానికి సిసలైన పరీక్ష.**

# 5. విధివిధానాలు, అపోహలు

## ప్రార్థన చేసే పద్ధతి - వివేకానంద స్వామి వివరణ

మనకందరికీ తెలిసిన ఉదాహరణ ఒకటుంది. సూర్యకిరణాలు చేతి మీద పడితే బాధగా అనిపించదు. కానీ ఒక కుంభాకార కటకంతో వాటిని కేంద్రీకరించి మన చేతి మీద పడేలా చేస్తే చెయ్యి కాలుతుంది. మన ఆలోచనలు కూడా ఇలాగే పనిచేస్తాయి.

సాధారణంగా మన ఆలోచనలన్నీ చెల్లాచెదరై ఉంటాయి. (దీనినే విక్షిప్తస్థితి అంటారు.) వాటిని ఏకాగ్రం చెయ్యాలంటే ఏమి చెయ్యాలి? ధ్యానం చేయడం ఆలోచనలను ఏకాగ్రం చెయ్యడానికి మంచి మార్గం అని మనకు తెలుసు. అయితే ధ్యానం కంటే ప్రాథమికమైన సాధన ప్రార్థన.

ధ్యానాన్ని ప్రార్థనతో ప్రారంభించాలని స్వామీజీ వివరించారు.

**నిటారుగా కూర్చోండి. అన్నిటికన్నా ముందు చేయాల్సిన పని ప్రకృతి అంతటికీ, అన్ని దిక్కులకూ, మన పవిత్రమైన ఆలోచనలను ఒక ప్రవాహంగా పంపడమే. మానసికంగా అన్ని దిక్కులలోని జీవజాలం**

**గురించీ ఆలోచిస్తూ, “జీవులందరూ సంతోషంగా ఉండాలి! జీవులందరూ శాంతంగా ఉండాలి! జీవులందరూ ఆనందంగా ఉండాలి! అని తలచుకోండి. మీరు ఈ విధంగా చేసిన కొద్దీ మీకే మరింత బాగున్న అనుభూతి కలుగుతుంది. దీనినిబట్టి మనకు అర్థమయ్యేదేమిటంటే, మనం ఆరోగ్యంగా ఉండడానికి అన్నిటికన్నా సులభమైన పద్ధతి ఇతరులు ఆరోగ్యంగా ఉండేందుకు సహాయం చెయ్యడమే, మనం సంతోషంగా ఉండడానికి అన్నిటికన్నా సులభమైన పద్ధతి ఇతరులు సంతోషంగా ఉండేందుకు సహాయం చెయ్యడమే. అలా చేసిన తర్వాత, దేవుడి మీద నమ్మకం ఉన్నవారు ప్రార్థన చెయ్యాలి. అది డబ్బు కోసమో, ఆరోగ్యం కోసమో, స్వర్గం కోసమో కాక జ్ఞానం కోసం, వికాసం కోసం ప్రార్థన చెయ్యాలి. మిగిలిన రకాల ప్రార్థనలన్నీ స్వార్థపూరితమైనవే.**

సాధారణంగా, ప్రార్థన చేసేటప్పుడు, ఈ ప్రపంచంలో మనకు సుపరిచితమైన వివిధ విషయాలను గురించిన ఆలోచనలతోనూ, మాటలతోనూ భగవంతుడితో సంభాషిస్తాము, మన మనస్సులోని ఆలోచనలన్నింటినీ, కోరికలన్నింటినీ భగవంతుడికి జోడిస్తాము, ఆయనకే సమర్పిస్తాము. ఇలా చేసినప్పుడు మనస్సు దానంతట అదే ఏకాగ్రమవుతుంది. నిజానికి ఇలా చెయ్యడం మిగిలిన సాధనలకన్నా చాలా సులభం. స్వామీజీ ఇలా కొనసాగించారు:

**ఆ పైన మీ శరీరం గురించి ఆలోచించుకోండి. దానిని బలమైన దానిగా, ఆరోగ్యవంతమైన దానిగా ఊహించుకోండి. జ్ఞానోదయాన్ని పొందడానికి మనకున్న ఒకేఒక పరికరం ఈ శరీరమే కదా! ఒక కొండ రాయిలాగా బలంగా ఉన్నట్టుగా దానిని ఊహించుకోండి. అటువంటి**

**శరీరం సహాయంతోనే మనం ఈ సంసారసాగరాన్ని దాటిపోవాలి. "నాయమాత్మా బలహీనేన లభ్యః - బలహీనులైన వారికి ముక్తి లభించడం కల్ల!" (ఉపనిషద్వాక్యం.) అన్నిరకాల బలహీనతలనూ విసిరి పారవెయ్యండి. 'నువ్వు బలంగా ఉన్నావు!' అని మీ శరీరానికి మాటిమాటికీ చెప్పండి. 'నువ్వు బలంగా ఉన్నావు!' అని మీ మనస్సుకు చెప్పండి. మీమీదే అనంతమైన విశ్వాసాన్నీ, ఆశనూ కలిగి ఉండండి.**

అలా, ప్రార్థన చేసేకొద్దీ మన మనస్సుకు మరింత ఏకాగ్రమయ్యే శక్తి కలుగుతుంది. మన మనస్సు యొక్క శక్తి ఎంత ఏకాగ్రమైతే మన ప్రార్థనలు అంత చక్కగా ఫలిస్తాయి. క్రమంగా ప్రార్థన ద్వారా మనకు ధ్యానం చేసే శక్తి కూడా అలవడుతుంది. శ్రీరామకృష్ణ పరమహంస, 'సంధ్య గాయత్రిలోనూ, గాయత్రి ఓంకారంలోనూ లయమవుతుంది!' అని చెప్పారు. (అంటే సాధకుడు క్రమక్రమంగా సంధ్యాకాలంలో చేసే సంధ్యావందనాన్ని దాటి గాయత్రీమంత్రజపంలో నిమగ్నమవుతాడు. క్రమంగా దాన్ని కూడా దాటి 'ఓంకార' ధ్యానంలో మునిగిపోతాడు.)

## స్తోత్ర ప్రార్థనలు

మతానికి సంబంధించినంతవరకూ ప్రార్థన అతిప్రాచీనమైన సాధన. అనాదిగా ప్రార్థన చేయడాన్నే మతావలంబనగా భావిస్తూ వస్తున్నారు. ప్రపంచంలోని చిన్నాపెద్దా మతాలన్నీ కూడా ప్రార్థన యొక్క అవసరాన్ని నొక్కిచెప్పాయి. సులభమైనవే అయినా,

క్లిష్టమైనవే అయినా, ప్రార్థనల అవసరాన్ని అన్ని మతాలూ గుర్తించాయి. క్రైస్తవమతంలోనూ, యూదుమతంలోనూ అత్యుత్తమమైనవిగా పేర్కొనదగ్గ ప్రార్థనలు బైబిల్‌లోని 'సాల్మ్స్'లో (Psalms) కనిపిస్తాయి. జైనులకు, బౌద్ధులకు సంబంధించిన ప్రార్థనలు కూడా అనేకం ఉన్నాయి. విష్ణు, లలితా సహస్రనామాలే కాక, శివమహిమ్నస్తోత్రం, దేవీమాహాత్మ్యం లాంటి అనేక ప్రార్థనలు హిందూ సంస్కృతిలో కనిపిస్తాయి. చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో, వ్యాకులతతో చదివినప్పుడు అవి సర్వపాపాలనూ హరిస్తాయనీ, కోరిన కోరికలు తీరుతాయనీ ఈ స్తోత్రాలలోనే చివర ఇచ్చే ఫలశ్రుతిలో చెప్పబడింది.

ఈ స్తోత్రాలన్నింటిలోనూ పాపప్రక్షాళనానికీ, ముక్తికీ ఎక్కువ ప్రాముఖ్యత, అశాశ్వతమైన, ప్రాపంచికమైన కోరికలకు తక్కువ ప్రాధాన్యత, ఇవ్వబడింది. ప్రాపంచికమైన కోరికలను – అంటే ఆస్తిపాస్తులు, పేరుప్రఖ్యాతులు, సంతానం మొదలైనవాటి మీద కోరికలను – వద్దన లేదు కానీ ఆధ్యాత్మికమైన, నిష్ప్రాపంచికమైన కోరికలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది.

వేలుతో మీటితే మోగే వీణలాగా మహోన్నతమైన, మనోహరమైన భగవంతుని భావనకు మనిషి యొక్క హృదయవీణ పలుకుతుంది. సముద్రపు ఒడ్డున సూర్యోదయాన్నీ, హిమగిరుల మీద సూర్యాస్తమయాన్నీ చూసినప్పుడు మన హృదయాలు ఆనందంతో

ఎలా ఉప్పొంగి, పాట అందుకుంటాయో అదే విధంగా ఈశ్వరుడి గాంభీర్యాన్నీ, విస్తారతనూ, సౌందర్యాన్నీ, అనంతత్వాన్నీ చూసినప్పుడు భక్తులు స్తోత్రాలనూ, కీర్తనలనూ చేస్తారు.

ఒక మనిషి కేవలం సూర్యాస్తమయాన్నో, ప్రకృతి రమణీయతనో చూసి పాటలు పాడితే అతడిలో ఆంతరికమైన పరిణతి అంత త్వరగా కనపడకపోవచ్చు. కానీ భగవంతుడి గుణగణాలను కీర్తించడం వల్ల కలిగే ఫలితాలు వేరుగా ఉంటాయి. మనస్సును శుద్ధపరచి, దానికి బలాన్ని, ఉన్నతిని, ఆనందాన్ని ఇచ్చి, మనుష్యుల వ్యక్తిత్వాలను సమూలంగా మార్చివేసే శక్తి, భగవంతుడి మహత్త్వాన్ని పొగిడే ఈ స్తోత్రాలకు ఉంది. ప్రపంచమతాలన్నింటిలోనూ స్తోత్రాల ద్వారా, ప్రార్థనల ద్వారా జ్ఞానోదయాన్ని పొంది, పరిపూర్ణతను సాధించిన సాధువుల ఉదాహరణలు పెక్కులు.

ప్రపంచ ఆధ్యాత్మిక స్రవంతిలో వెలుగులీనిన మహనీయులు అనేకులు తాము ప్రార్థన ద్వారా ఔన్నత్యాన్ని సాధించడమే కాక, మనకు ప్రార్థించడం ఎలాగో నేర్పడం కోసం అనేక స్తోత్రాలను రచించి, ఒక గొప్ప వారసత్వ సంపదగా మనకు అందించారు.

## ప్రార్థనను ఎప్పుడు చెయ్యాలి?

ఊటబావిలోని నీరు పైకి ఉబికివచ్చినట్లు మన మనస్సు నిరంతరం ఏదో తెలియని ఒక ఉన్నతశక్తితో సంభాషించి,

దానినుంచి ఆసరా పొందాలని ప్రయత్నిస్తూనే ఉంటుంది. ఆ సంపర్కాన్ని ఎవరూ ఆపలేరు. అయితే దానికి స్పష్టమైన మార్గాన్ని చూపి దాన్ని మన ప్రార్థనగా రూపుదిద్దాలి. అమావాస్యకో పౌర్ణమికో చేసేది ప్రార్థన కాబోదు. ఒక తత్త్వవేత్త, "సూర్యుడి ప్రకాశంతో ప్రకృతి రమణీయంగా ఉన్న రోజున నీకు ప్రార్థించే అలవాటు లేకపోతే, గాలివానతో ప్రకృతి భయానకంగా ఉన్నప్పుడు కూడా ప్రార్థించకు!" అని చెప్పాడు. అంటే కష్టాలలో ఉన్నప్పుడు మాత్రమే కాక నిత్యం ప్రార్థనను ఒక అలవాటుగా మలచుకోవాలి.

చాలామంది, 'అసలు జీవితమే ప్రార్థన కదండీ! ఇంక వేరే ప్రార్థనలు ఎందుకు?' అంటూ ఉంటారు. అది నిజమే! అయితే, మనుష్యులకు ఉండే ఇతర నైపుణ్యాల లాగానే ప్రార్థన కూడా తగినంత అభ్యాసంతో మరింత మెరుగైన ఫలితాలను ఇస్తుంది. ఉదాహరణకు, ఆలోచన మనిషికున్న గొప్ప లక్షణాలలో ఒకటి. అయితే తగినంత క్రమశిక్షణ లేకపోతే అది హద్దూపద్దూ లేని రెక్కలగుర్రంలా ఎగిరిపోతుంది. ఇదే ప్రార్థనకు కూడా వర్తిస్తుంది.

దేవునితో మనం రాత్రింబవళ్ళూ సహనివాసం చెయ్యాలి. మామూలుగా, పన్ను పుచ్చిపోయి నొప్పి పెడుతున్నప్పుడో, బహుశా మన జేబు ఖాళీ అయినప్పుడో ఆయన గుర్తుకు వస్తాడు. భగవంతుడిపట్ల ఆ రకమైన గౌరవం ఉంటే అది మన ఆధ్యాత్మిక

జీవితంలో ఎటువంటి ఫలితాన్నీ ఇవ్వదు. మనలోనే ఉంటూ, ఎన్నటికీ మన చేయివిడువని స్నేహితుడే భగవంతుడు. ఆయన మన మనస్సుల్ని పరిశుద్ధం చేస్తాడు. ప్రార్థన ద్వారా మన జీవితానికి ఉన్న నైతిక బాధ్యత ఏమిటో మనకు తెలుస్తుంది. ఆయన ప్రేమ మనకు ఊతాన్నిస్తుంది.

ప్రార్థనను బాలలకు చిన్ననాటినుంచే అలవాటు చేయాలి. ఒకసారి ప్రార్థనామార్గంలోకి వచ్చిన బాలలు జీవితాంతం ఆ అలవాటును కొనసాగిస్తారు. హిందువులు తమ బిడ్డలకు చేసే అన్నప్రాశన, నామకరణ, అక్షరాభ్యాసం మొదలైన అన్ని సందర్భాలలో దేవుని ప్రసక్తి ఉంటుంది. పెద్దలు తాము దేవుడికి నమస్కరించి, బిడ్డల చేత కూడా నమస్కారం చేయించడం మనం అన్ని ప్రాంతాలలో చూడవచ్చు. శ్రీమద్భాగవతంలో, ప్రహ్లాదుడి మనస్సులో భక్తి బీజాలు నాటడానికి అతడు లీలావతీదేవి గర్భంలో ఉన్నపుడే నారదుడు అతడికి హరిభక్తిని బోధించాడు.

## మన ప్రార్థనలు భగవంతుడికి ఎలా చేరతాయి?

మనం ఎప్పుడూ భగవంతుణ్ణి చూడలేదు. ఆయన అసలు ఉన్నాడో లేదో అని కూడా మాటిమాటికీ అనుమానం కలుగుతూ ఉంటుంది. అటువంటప్పుడు మనం చేసిన ప్రార్థనలు దేవుణ్ణి చేరతాయనీ, అతడు వాటికి సమాధానం ఇస్తాడనీ నమ్మడం ఎలా?

మనం చేసిన ప్రార్థనలు భగవంతుడికి ఎలా చేరతాయో వివరిస్తూ శ్రీరామకృష్ణుల ప్రత్యక్షశిష్యులైన అద్భుతానంద స్వామి ఇలా చెప్పారు. "మీరు ఏదైనా ఉద్యోగానికి దరఖాస్తు చేస్తున్నారనుకోండి. ఏమని వ్రాస్తారు? 'అయ్యా! నాకు ఫలానా, ఫలానా అర్హతలు ఉన్నాయి. నేను ఫలానా, ఫలానా పరీక్షలలో ఉత్తీర్ణుణ్ణి అయ్యాను. ఈ ఉద్యోగానికి నేనే సరైనవాణ్ణి!' అని వ్రాసి దాన్ని కవరులో పెడతారు. దానిమీద ఆ అధికారి విలాసం వ్రాసి తపాలాడబ్బాలో వేస్తారు. మీరు ఎప్పుడైనా ఆ అధికారిని కలిశారా? అతడితో మీకు ఏ విధమైన పరిచయం లేకుండానే అతడికి దరఖాస్తు పంపుతున్నారు కదా! అది అతడికి చేరుతోంది కదా! దాన్ని చూసి అతడు మీకు ఉద్యోగం కూడా ఇస్తాడు. ఇదే పద్ధతిలో మనం చేసిన ప్రార్థనలు భగవంతుడికి చేరతాయి!"

## ప్రార్థనకు విశ్వాసమే పునాది

ఒక కథ చెప్పుకుందాం. ఒకానొక సమయంలో, ఒకానొక ప్రాంతంలో పెద్ద కరవు వచ్చింది. ఏళ్ళ తరబడి వర్షాలు కురవలేదు. ఊరి వారందరూ దూరప్రాంతానికి చెందిన ఒక సాధువు వద్దకు వెళ్ళి, సలహా అడిగారు. ఆయన "మనందరం కలసి ఒక హోమం చేద్దాం. నేను హోమం చేస్తున్న సమయంలో మీరు దేవుణ్ణి మనఃస్ఫూర్తిగా ప్రార్థించాలి. మీరు అలా చేయగలిగితే, వెంటనే వానలు కురుస్తాయి" అని వారికి భరోసా

ఇచ్చాడు. దానికి ఒక ముహూర్తాన్ని కూడా నిర్ణయించాడు. ఆ ముహూర్తం రోజు వేకువనే ఊరివారందరూ హోమస్థలానికి బయలుదేరారు. ఒక ఆరేళ్ళ బాలుడు కూడా వారితో బయలుదేరి, ఒక గొడుగును కూడా చేతపట్టుకుని వారితో నడవసాగాడు. మిగిలినవారందరూ ఆశ్చర్యంతో, "ఆకాశంలో మబ్బు తునకైనా లేదు కదరా! ఇప్పుడు గొడుగుతో ఏం పని?" అని ఆ బాలుణ్ణి ప్రశ్నించారు. "హోమం జరుగుతున్నప్పుడు మనమందరం ప్రార్థనలు చేస్తాం కదా! ఆ ప్రార్థనలు విన్న దేవుడు వెంటనే వాన కురిపిస్తాడు కదా! మరి ఆ జోరున కురిసే వర్షంలో తిరిగిరావడం ఎలా? అందుకోసమే ఈ గొడుగు!" అని ఆ బాలుడు జవాబిచ్చాడు. ఊరివారి ప్రార్థనలు తప్పక ఫలిస్తాయన్న నమ్మకం ఆ బాలుడొక్కడికే ఉంది! ఆ ఊరి పెద్దలలాగా అరకొర విశ్వాసంతో చేసే ప్రార్థనలవల్ల కలిగే ప్రయోజనం శూన్యం!

భగవంతుడి మీద విశ్వాసమే ప్రార్థనకు పునాది. వినయం దానికి తోడునీడగా ఉండాలి. విశ్వాసం అనే ఒక్క నియమంతో మనం చేసే ప్రార్థనలన్నీ సాఫల్యాన్ని సాధించగలుగుతాయి.

మనం ప్రార్థన చేసే శక్తి ఏ రూపంలోనైనా ఉండవచ్చు గాక. ప్రార్థన చేసేది ఆదిమమానవులే కావచ్చు లేదా మహావ్యక్తులే కావచ్చు. ప్రార్థనను నమ్మేవారందరూ ఏదోవొక ఉన్నత శక్తిని నమ్మేవారే. విశ్వాసం లేకపోవడం వల్లనే మనం చేపట్టే పనులన్నీ

అపజయం పాలవుతూ ఉంటాయి. పూర్తి విశ్వాసంతో మనిషి హృదయంలోని అట్టడుగు లోతుల నుంచి ప్రార్థన వెలువడి నప్పుడు, అన్ని రకాల అనుమానాలూ తొలగిపోతాయి. ఆపైన ఇక ఏ తికమకలకూ, అపార్థాలకూ తావుండదు.

## ప్రాపంచికమైన కోరికలు కోరడం తప్పా?

మనలో అందరికీ ఈ ప్రపంచం శాశ్వతమైనదిగా కనిపిస్తుంది. తాము ప్రస్తుతం హాయిగా ఉన్న పరిస్థితి ఎల్లకాలం కొనసాగుతుందని అందరూ అనుకుంటూ ఉంటారు. అందువల్ల, మనందరికీ ఈ ప్రపంచమంటే ఇంకా విసుగుపుట్టి, వైరాగ్యం కలుగలేదు.  మన శరీరాల మీద, మన చుట్టూ ఉన్న ప్రపంచం మీద కూడా మనకు ఎంతో మమకారం, ఎన్నో ఆశలు ఉన్నాయి. మనం పొందుతున్న శారీరిక సుఖాలు, మన కుటుంబం, మన ఆస్తిపాస్తులు, పేరుప్రఖ్యాతులు, ఇవన్నీ కూడా మనకు అత్యంత ముఖ్యమైనవి. అవి ఉంటే ఇంకా కావాలనో, లేకపోతే అసలు లేవనో అసంతృప్తితో రగులుతూ ఉంటాము. కాబట్టే మనిషి వీటన్నింటికోసం దేవుణ్ణి ప్రాధేయపడతాడు. ఆ పైన ఆ సుఖ సంతోషాలను తాను కోరుకున్న దానికంటే ఎక్కువే పొందుతాడు. కానీ అతడికి కలిగే ఆ సంతృప్తి కేవలం తాత్కాలికం! కొంతకాలం గడవగానే, జీవితమంతా మళ్ళీ అసంతృప్తితో నిండిపోయినట్టు కనిపిస్తుంది. ఇదే సృష్టి వైచిత్ర్యం! అనేక జన్మల ద్వారా, పాంచ

భౌతికమైన శరీరాలను మళ్ళీమళ్ళీ ధరిస్తూ పొందే అనుభవాల ద్వారా మన జ్ఞానం పెంపొందుతుంది. కానీ ఇలా జరగడానికి కొన్ని జన్మలు పట్టవచ్చు! చీకటిని చీకటిగానూ, వెలుగును వెలుగుగానూ తెలుసుకునే రోజు త్వరలోనో, ఆలస్యంగానో ఎప్పుడో ఒకప్పుడు తప్పక వస్తుంది.

సాధారణంగా, ఉన్నతమైన స్థితులను పొందినప్పుడు మనిషి అదంతా తన శక్తియుక్తులవల్లనే సాధించాననుకుని పొంగిపోతాడు. కానీ దెబ్బతిని, క్రిందపడ్డ పరిస్థితులలో తనకు సాయంగా రమ్మని భగవంతుణ్ణి వేడుకుంటాడు. అనారోగ్యంతో ఉన్న బిడ్డ తన ప్రక్కనే తన అమ్మ ఉందన్న నమ్మకం వల్ల చాలా ఊరట పొందుతాడు. నిజానికి, మీసాలొచ్చినా 'మనిషి' ఇంకా పిల్లవాడే. బాగా గాలి పూరించిన రబ్బరు బుడగను సూదితో పొడిస్తే క్షణంలో అది ముడుచుకుపోయినట్లు, కష్టకాలం దాపురించిన క్షణంలో మనిషి అహంకారం చతికిలపడుతుంది. కానీ, ప్రేమమయుడు, కరుణాసముద్రుడు అయిన భగవంతునికి మన ఆందోళనలను, ఆవేదనలను అప్పగిస్తే మనస్సుకు ఊరట కలుగుతుంది. దీనిని సాధించే శక్తి ప్రార్థనకు ఉంది.

కాబట్టి, అజ్ఞానంలో ఉన్న ఒక మనిషి ప్రాపంచికమైన కోరికలు కోరుతూ ఉంటే, మనం అతణ్ణి చులకన చేసి చూడనవసరం లేదు. అతడు కూడా భక్తులలో తనకు తగిన స్థానాన్ని పొందు

తాడు. భగవద్గీతలో భక్తులు నాలుగు రకాలుగా విభజించబడ్డారు.

**చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ (గీత 7:16)**

“ఓ అర్జునా! నాలుగు రకాల భక్తులు నన్ను కొలుస్తారు. ఆర్తిలో ఉన్నవారు, జ్ఞానాన్ని కోరేవారు, సుఖసంపదలను పొందాలను కునేవారు, జ్ఞానాన్ని పొందిన జ్ఞానులు.”

ఆది శంకరాచార్యులు తన భాష్యంలో ఈ శ్లోకాన్ని వివరిస్తూ ఇలా చెప్పారు. “మొదటిరకం భక్తులు ఆర్తులు: దొంగలు దోచు కుంటున్న సమయంలోనో, ఆపద సమయంలోనో, రోగంతో మంచానపడ్డ సందర్భంలోనో - ఇలా బాధలలో, కష్టాలలో ఉన్నప్పుడు మాత్రమే భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. రెండవ రకం వారు జిజ్ఞాసులు: ఆత్మజ్ఞానాన్ని లేదా భగవంతుడి గురించిన జ్ఞానాన్ని కోరేవారు. మూడవరకం వారు అర్థార్థులు: ఇహలోకం లోనూ, పరలోకంలోనూ సుఖాలు కావాలని కోరేవారు. నాలుగవ రకం జ్ఞానులు: మాయాజనితమైన ప్రాపంచిక వ్యామోహాలను, కోరికలను పూర్తిగా విడిచిపెట్టినవారు.”

భక్తులలో నాలుగు రకాలవారూ భగవంతుడికి ఇష్టులే. నిజానికి, ఆధ్యాత్మిక పురోగతి అనే నిచ్చెన చాలా చాలా పొడవైనది. ఈ ఆరోహణాక్రమంలోని ప్రతిస్థాయిలోనివారూ, వారి స్థాయికి తగ్గట్టు కోరతారు. వారి స్థాయి పెరిగిన కొద్దీ, వారి ప్రార్థనలో

నిస్వార్థత పెరుగుతూ ఉంటుంది. కాబట్టి, ఈ ప్రపంచాన్ని ఒక వ్యాయామశాలగా, ఒక క్రీడామైదానంగా చూడాలి. ఇక్కడ ప్రతి జీవికీ కావలసిన, కావలసినంత వ్యాయామం ఇవ్వబడుతుంది.

మనం చాలా అరుదుగా అంతర్ముఖులమవుతాము. అంటే మన మనస్సును 'లోనికి', అంటే మన ఆత్మమీదకు, భగవంతుడి మీదకు మరలిస్తాము. కానీ ప్రార్థన చేసే క్షణాలలో మాత్రం మన మనస్సు తప్పనిసరిగా భగవంతుడి మీదకు, మన ఆత్మ మీదకు మరలుతుంది. కొన్ని క్షణాలపాటు మనకూ, భగవంతుడికీ సంబంధం ఏర్పడుతుంది. ఆ క్షణమాత్ర సమయంలో ఆయనతో మనం నేరుగా సంపర్కంలోకి వస్తాము. ఆ విధంగా ఆయన మనల్ని తన దగ్గరకు రానిచ్చి, మనం చెప్పే మాటలు వింటున్నాడంటే, మనమంటే ఆయనకు ఇష్టమేనని అర్థం కదా! గీతలో మరొకచోట శ్రీకృష్ణుడు తన బిడ్డలను దిక్కులేనివారిగా విడిచిపెట్టననీ, తనను ఎవరు ఏ విధంగా అర్చిస్తే వారికి ఆ విధమైన ఫలితాలనిస్తాననీ అభయమిచ్చాడు.

**యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ (గీత 4:11)**
"నన్ను ఎవరెవరు ఏయే ఉద్దేశ్యాలతో అర్చిస్తే వారి కోర్కెలను ఆయావిధాలుగా తీరుస్తాను!"

ఈ శ్లోకానికి భాష్యం చెపుతూ ఆదిశంకరులు, "ఎవరు నన్ను ఏది కోరితే వారు కోరిన పద్ధతిలోనే నేను వారికి దాన్ని ఇస్తాను.

వారందరూ మోక్షాన్నే కోరేవారు కానప్పటికీ, వారు ఏ ఉద్దేశ్యంతో దేన్ని కోరతారో దాన్ని వారికి ఇస్తాను. ఎంతటివారైనా సరే ప్రాపంచిక సుఖాలనూ, మోక్షాన్నీ ఒకేసారి సాధించలేరు. అయితే, అందరూ నా బిడ్డలే కాబట్టి, స్వార్థంతో మనుష్యులు కోరే కోరికలను కూడా నేను తీరుస్తాను. వారు కోరిన ఫలాలను ఇస్తాను. తమ కర్తవ్యాన్ని నిష్ఠతో నెరవేరుస్తూ, నిస్వార్థంగా జీవించే వారికి, ముక్తిని కోరే వారికి నేను జ్ఞానాన్ని ప్రసాదిస్తాను. జ్ఞానులైనవారు, ఈ ప్రపంచం పట్ల వైరాగ్యంతో మోక్షాన్ని కోరితే వారికి మోక్షాన్నిస్తాను. అదే విధంగా, కష్టాలలో, బాధలలో ఆర్తులై ఉన్నవారికి వారి ఆర్తిని తీర్చడం ద్వారా బదులిస్తాను. ఆ విధంగా, నన్ను ప్రార్థించిన వారందరికీ, వారేది కోరితే అది వరంగా ఇస్తాను!" అని భగవంతుడు అభయమిచ్చాడని వివరించారు.

**శ్రీరామకృష్ణ పరమహంస ఈ విషయాన్నే చాలా సులభమైన మాటల్లో మనకు వివరించారు. "తాను ఇచ్చే వరాల వల్ల కలిగే ఫలితాలను మనుష్యులు ఎంత వరకూ తట్టుకోగలరో చూసి దానినిబట్టి వారికి భగవంతుడు వరాల నిస్తాడు. అమ్మ చేపలు వండుతున్నప్పుడు తన బిడ్డలందరికీ చేపల పలావు చేసి వడ్డించదు. బాగా మసాలా దినుసులు వేసిన పలావును అందరూ జీర్ణించు కోలేరు కదా! కాబట్టి, మంచి జీర్ణశక్తి ఉన్నవాడికి అమ్మ చేపల పలావు పెడుతుంది కానీ అంత జీర్ణశక్తి లేనివారికి, బలహీనులకి చేపచారు కాచి తినిపిస్తుంది!"**

## దేవుడు మన ప్రార్థనల్ని, నైవేద్యాలను స్వీకరిస్తాడా?

ఒక కపటభక్తుడు, 'భగవంతుడు అనంతమైనవాడు కదా! అటువంటి భగవంతుడు మీరు పెట్టిన ఈ నైవేద్యాలు ఆరగిస్తాడా?' అని శ్రీరామకృష్ణుల శిష్యులలో ఒకరితో అన్నాడట. ఆయన దానికి సమాధానంగా ఈ కథ చెప్పారు.

**"ఒక జమీందారున్నాడు. ఒకరోజు ఆయన తన స్నేహితులతో మాట్లాడుతూ కచేరి చావడిలో కూర్చున్నాడు. ఆ సమయంలో జమీందారు యొక్క తోట కావలివాడు వచ్చి, ముందు గదిలో నిలబడ్డాడు. అతడి చేతిలో ఏదో ఒక వస్తువు ఉంది. అతడు దాన్ని శ్రద్ధగా గుడ్డతో కప్పి జాగ్రత్తగా పట్టుకొని నిలబడి, 'లోపలున్న యజమాని దగ్గరికి ఎలా వెళ్ళాలా?' అని తటపటాయిస్తున్నాడు. ఆ స్థితిలోవున్న అతణ్ణి జమీందారు గమనించాడు. అతడి వైపు తిరిగి, 'ఏమోయీ! ఏదో పనిమీద వచ్చినట్లు కనిపిస్తున్నావే! చేతిలో ఏదో ఉన్నట్లున్నదే! ఏమిటదీ?' అని ప్రశ్నించాడు. కావలివాడు భయభక్తులతో నెమ్మదిగా దగ్గరకు వెళ్ళి పైన కప్పిన గుడ్డను జాగ్రత్తగా తొలగించి ఒక చక్కని సీతాఫలాన్ని యజమాని ముందు పెట్టాడు. 'ఏలినవారు దీన్ని తినాలని కోరుకుంటున్నాను,' అని విన్నవించాడు. అతడి వినయవిధేయతలకు జమీందారు సంతోషపడి, ఆ పండును చేతిలోకి తీసుకున్నాడు. దాన్ని అటుయిటూ తిప్పి చూచాడు. సంతోషంతో, 'ఎంత చక్కని పండు తెచ్చావోయి! ఎంతో శ్రద్ధతో తెచ్చావే! దీనిని తీసుకురావడానికి ఎంత శ్రమపడ్డావో!' అని మెచ్చుకున్నాడు."**

ఆ పండు తన తోటలోదేనని ఆ యజమానికి తెలుసు. తన తోటలోని పండును తనకే ఇస్తున్నాడేమిటని ఆయన అనుకోడు. తన కావలివాడు చక్కగా తయారైన ఆ పండును చూసినప్పుడు తనను గుర్తుకు తెచ్చుకుని, తనకు ఆ పండు ఇవ్వాలనుకున్నాడన్న విషయానికే ఆ యజమాని ఎక్కువ ప్రాధాన్యతనిస్తాడు. అదే విధంగా భగవంతుడు కూడా భక్తుడు తన సృష్టిలోని పదార్థాలనే తనకు అర్పిస్తున్నాడనుకోకుండా అతడి హృదయంలోని భావనను చూస్తాడు. పై కథను చెప్పిన తర్వాత శ్రీరామకృష్ణులు ఇలా చెప్పారు: "భగవంతుడు అనంత వైభవోపేతుడు అనే మాట నిజమే కానీ, అంతటి ఆ భగవంతుడే తన భక్తులు భక్తిశ్రద్ధలతో ఏది ఇచ్చినా సంతోషంగా స్వీకరిస్తాడు!"

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥(గీత 9:26)**

భక్తితో నివేదింపబడిన దాన్ని నేను తప్పక స్వీకరిస్తాను. అది పూలు, పత్రాలు, నీరు, ఫలాలు - ఇలా ఏ పదార్థాన్నయినా హృదయ పూర్వకంగా సమర్పించేవాడే నాకు ప్రీతిపాత్రుడు.

పురందరదాసు రచించిన 'కెరయ నీరను' అనే గీతంలో, "దేవా! కొలనులో నీటిని కొలనులోనే అర్పించి, నీకు అర్పిస్తున్నామని అనుకుంటున్నాము. నీవు వాటిని స్వీకరించి మమ్మల్ని దీవిస్తున్నావు కదా దేవా! అదే విధంగా నీవు ఇచ్చిన సౌభాగ్యాలను

నీ కోసమే వెచ్చించి, నీ సేవ కోసమే వినియోగిస్తాము. ఆ విధంగా ఈ భూమి మీద మా జీవనాన్ని సాగిస్తాము!" అని చెప్పారు.

దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులు పనిచేస్తున్న దేవాలయంలో దొంగలుపడి అక్కడి రాధాకాంతాలయంలోని నగలను దొంగిలించారు. ఆలయ యజమాని అయిన మథురనాథ్ బిశ్వాస్ శ్రీరామకృష్ణులతో కలసి ఆ దేవాలయాన్ని చూడడానికి వచ్చి, అక్కడి విగ్రహంతో మాట్లాడుతూ, "నీ నగలను కూడా కాపాడుకో లేకపోయావా? నీవేమి దేవుడివయ్యా!" అన్నాడు. అది విని అతడికి చీవాట్లుపెడుతూ శ్రీరామకృష్ణులు, "ఈ నగలూగిగలూ నీకు గొప్ప కానీ, దేవుడికి అవంటే లెక్కలేదు. మహాలక్ష్మినే భార్యగా కలిగిన వాడికి నీవేమి నగానట్రా ఇవ్వగలవయ్యా?" అన్నారు.

భగవంతుడికి సేవచేసి, వస్త్రాభరణాలను బహుమతులుగా ఇచ్చి, నైవేద్యాలను అర్పించేటప్పుడు వినయంతో మెలగాలి. 'ఆయనకు లేనిదాన్ని నేను ఇస్తున్నాను!' అని అనుకోవడం ఎంతమాత్రం తగదు.

మనకు తల్లీతండ్రీ భగవంతుడే. మన తల్లి మనకేది అవసరమో చూసి, మన బాగోగులను దృష్టిలో ఉంచుకుని, మన అవసరాలను తీరుస్తుంది. భగవంతుడు కూడా అదే విధంగా ప్రవర్తిస్తాడు. అయితే, "అడగందే అమ్మయినా పెట్టద"న్న సామెతను గుర్తు పెట్టుకుని మనం స్వప్రయత్నంతో ప్రార్థన చెయ్యాలి.

## ప్రార్థనకు రూపుదిద్దేది హృదయమే

భగవంతుడు మనకు మనస్సునూ, హృదయాన్నీ రెంటినీ ఇచ్చాడు. మన ఇష్టాయిష్టాలు, తెలివితేటలు, మంచిచెడులను తెలియజేసే బుద్ధి - ఇవన్నీ కలగలసి మనస్సుగానూ; ప్రేమ, అనుకంపం, దయ వంటి ఉదాత్తమైన గుణాలు హృదయంగానూ ఏర్పడ్డాయని మనం అనుకోవచ్చు. సాధారణంగా మన జీవితాల లో మనస్సుకు, హృదయానికీ మాటిమాటికీ వైరుధ్యం కలుగుతూ ఉంటుంది.

అయితే మన తెలివితేటలు (మనస్సు) మనల్ని కొంతదూరమే తీసుకుపోగలవు. కానీ జీవితంలో నిజంగా గొప్ప తనాన్ని సాధించదలచినవాడు తన హృదయాన్ని అనుసరించాలి. అందుచేతనే, ఈ రెంటి మధ్య భేదాభిప్రాయం ఏర్పడితే, హృదయాన్నే అనుసరించమని వివేకానంద స్వామి చెప్పారు!

మనం చెప్పదలుచుకున్న భావాలకు చాలాసార్లు మన మాటలే అడ్డంకులుగా తయారై, మన భావాలను బయటకు వ్యక్తీకరించ డానికి అడ్డుపడతాయి. మన హృదయం వెల్లడి చేయాలనుకునే భావాలకు మన మాటలు సరిపోవన్న చిత్రమైన విషయాన్ని మనం అర్థం చేసుకోవాలి. నిజానికి మన హృదయంలో వ్యక్తమయ్యే భావాలను ఆ మాటలే మసక బారుస్తాయి కూడా.

మనస్సు లెక్కలు కడుతూ, కొలతలు వేస్తూ ఉంటుంది కానీ హృదయం తొట్రుపడని విశ్వాసంతో ముందుకు అడుగు వేస్తుంది. కష్టపరిస్థితులలో చాలాసార్లు మన హృదయం స్పందించి మన సమస్యలకు సమాధానాన్ని సూచిస్తుంది.

మనస్సు మూగబోయి నప్పుడు హృదయం పలికి, మన సమస్యలకు సమాధానాన్ని సూచిస్తుంది. హృదయానికి మరింత మెరుగైన భాష తెలుసు. హృదయపూర్వకంగా చేసినప్పుడే ప్రార్థన ప్రార్థన అవుతుంది. హృదయమే లేని మానవజీవితం ఎంత చప్పగా, నిస్సారంగా, ఎండిపోయి ఉంటుందో ఊహించుకోండి!!

## మెలకువతో చేసే ప్రార్థనలే సఫలమవుతాయి

**శ్రీరామకృష్ణ పరమహంస ఇలా చెప్పారు: "ఒక ముసల్మాను ప్రార్థన చేస్తూ, 'ఓ అల్లా! ఓ అల్లా!' అని బిగ్గరగా అరవసాగాడు. దగ్గరలోనే నిలబడి వున్న మరొక ముసల్మాను, 'నీవు అల్లాను సంబోధిస్తున్నావు. చాలా బాగుంది. కానీ అలా అరుస్తావెందుకు? చీమ కాలి అడుగుల సవ్వడిని కూడా ఆయన వినగలడని నీకు తెలియదా?' అని ప్రశ్నించాడు."**

ప్రార్థన హృదయపూర్వకంగా చేయడమే ముఖ్యం అని ఈ బోధన తాత్పర్యం.

ముల్లా నసీరుద్దీన్ కథ ఒకటుంది.

ఒక గ్రామంలో ఒక పాఠశాల ఉపాధ్యాయుడు పిల్లలనందరినీ తనతో వెంటబెట్టుకుని మసీదుకు తీసుకుపోతున్నాడు.

ముల్లా నసీరుద్దీన్ వారికి ఎదురు వస్తూ, “వీళ్ళను ఎక్కడికి తీసుకువెళ్తున్నావు?” అని ఉపాధ్యాయుణ్ణి అడిగాడు.

అతడు, “దేశంలో కరవు వచ్చింది. అమాయకులైన ఈ పిల్లల ప్రార్థనతో దేవదేవుడి మనస్సు కరిగి వర్షాలు కురిపిస్తాడు! అందుకే వీరిని మసీదుకు తీసుకుపోయి, ప్రార్థన చేయించాలనుకుంటు న్నాను!” అని సమాధానం చెప్పాడు.

ముల్లా నసీరుద్దీన్ తల అడ్డంగా ఊపుతూ, “ప్రార్థనలు అమాయకులు చేస్తున్నారా, దుర్మార్గులు చేస్తున్నారా అన్నది ముఖ్యం కాదు. ఎంత జ్ఞానంతో, ఎంత మెలకువతో ప్రార్థన చేశారన్నది ముఖ్యం!” అని ఎదురు చెప్పాడు.

ఇది విని ఆ ఉపాధ్యాయుడు పట్టరాని కోపంతో, “ఈ పిల్లల ఎదుట ఇలాంటి మాటలు మాట్లాడడానికి నీకు ఎంత ధైర్యం? నువ్వు చెప్పినది సరైనదేనని ఇప్పుడు నిరూపిస్తావా లేకపోతే మతవ్యతిరేకిగా నీకు శిక్షవేయించమంటావా?” అని గద్దించాడు.

ముల్లా నసీరుద్దీన్, “నిరూపించాలా? చాలా సులభం! బడిపిల్లలు చేసే ప్రార్థనలు నిజంగా నెరవేరితే ఏ దేశంలోనూ, ఏ బడిపంతులూ, మిగలడు. ఎందుకంటే, బడినీ, బడిపంతులునూ మించి పిల్లలు ద్వేషించేది ఈ ప్రపంచంలో మరొకటి ఉండదు. మరి వాళ్ళు అలా ప్రార్థనలు చేస్తున్నా నువ్వు బ్రతికిబట్టకడుతున్నా వంటే దానికి కారణం మేము. ఎందుకంటే, ఆ పిల్లలకు మంచి

జరగాలంటే ఏమి చెయ్యాలో పెద్దవాళ్ళమైన మాకు తెలుసు కాబట్టే నిన్ను ఉపాధ్యాయుడిగా పెట్టాము!" అని బదులిచ్చాడు.

ఆ విధంగా చూసినప్పుడు హృదయపూర్వకంగా, తెలివిడితో, మెలకువతో చేసే ప్రార్థనలే సఫలమవుతాయని మనకు అర్థమవుతుంది. హృదయాలలో అనుభూతి లేకుండా చేసే ప్రార్థనలు అరుదు కాదు గానీ, వాటిని భగవంతుడు పట్టించుకోవడం మాత్రం అరుదే.

## ప్రార్థన అంటే యాచన కాదు

ప్రార్థన చేయడమంటే బిచ్చగాడిలాగా యాచన చేయడమే అని మరొక విమర్శ. ఒక కొడుకు, కూతురు తమ తల్లిదండ్రులను ఏదైనా కోరడం బిచ్చమెత్తడమెలా అవుతుంది? భగవంతుడు కూడా అంతే. శ్రీరామకృష్ణ పరమహంస ఇదే విషయాన్ని గురించి మాట్లాడుతూ ఇలా చెప్పారు:

**"ఒకసారి కొందరు సిక్కు భక్తులు ఇక్కడకు వచ్చారు. వారు నాతో, 'అయ్యా! దేవుడు దయామయుడు!' అన్నారు. నేను వారితో, 'దేవుడు దయామయుడని మనం ఎందుకు అనాలి? ఆయన మన తండ్రి, సృష్టికర్త. అలాంటివాడు మనపట్ల దయ చూపడంలో ఆశ్చర్యమేముంది? తల్లిదండ్రులు తమ పిల్లల్ని పోషించరా? వాళ్ళు ఆ విధంగా చెయ్యడం వాళ్ళ విధి!' కాబట్టి, మనం మన కోరికలు తీర్చమని భగవంతుణ్ణి బలవంతపెట్టాలి. ఆయనే మన తల్లీ, తండ్రీ కాడా?"**

ఆయన మరొక సందర్భంలో, "వ్యాకులమైన మనస్సుతో జగజ్జననితో మొరపెట్టుకో! ఆమె మన కన్నతల్లి. పెంచిన తల్లి కాదు. కాబట్టి ఆమె దగ్గర హఠంవేసి పని సాధించుకోవచ్చు. ఒక ఉదాహరణ చెపుతా విను!" అని ఇలా చెప్పారు.

**"చిన్నపిల్లవాడు గాలిపటం కొనుక్కుంటాననీ, డబ్బులు కావాలనీ తల్లిని అడుగుతాడు. దానికి తల్లి, 'నేను ఇవ్వను. నాన్న ఇవ్వవద్దని చెప్పారు. ఆ గాలిపటం కొనితెచ్చి ఇప్పుడు లేనిపోని గొడవలు తెచ్చిపెడతావు' అంటుంది. అయినా వినకుండా వాడు ఆమె చీరకొంగు పట్టుకుని లాగుతూ మారాం చేస్తూనే ఉంటాడు. ఆమె పొరుగు స్త్రీలతో మాట్లాడుతూ ఉంటే ఏడుపు లంకించుకుంటాడు. ఎంత మరపించినా మరచిపోడు. ఇంక ఆమె వారితో, 'ఒక నిమిషం ఉండండి! మా అబ్బాయి డబ్బులకోసం అల్లరి చేస్తున్నాడు' అంటూ లోపలికి వెళ్ళి వాడికి కావలసిన పైసలు ఇచ్చి పంపుతుంది. అదే విధంగా మీరు కూడా మొండిపట్టు పట్టి తల్లి దగ్గర మీకు కావలసినది వసూలు చేసుకోవాలి. ...తెలిసిందా? సొంతవారిని కాకపోతే ఇంకెవరిని మనం బలవంతం చేయగలం?"**

ఇంకొక సందర్భంలో రామప్రసాద్ రచించిన ఒక పాట ద్వారా జగజ్జననికి ప్రార్థన ఎలా చెయ్యాలో ఆయన వివరించారు. జగజ్జననితో పోట్లాడి, తాను కోరినది సాధించుకున్నట్టు, హాస్యస్ఫోరకం గానూ, హృదయరంజకం గానూ బెంగాలీ కవి రామ్‌ప్రసాద్ ఈ పాటను రచించారు.

ఎనిమిది నెలలకె పుట్టిన బిడ్డగ
ఎంచినావటే మాతా నను? నీ
ఎరుపు కన్నులిక ఎంత ఉరిమినా
వెరపు గొలుప జాలవులే నన్ను;
శివుడే ఉరమున దాల్చినట్టి నీ
పదపద్మమ్ములె నాకు పెన్నిధులు!

ఎప్పడడిగినా వాటా ఇమ్మని
దాటవేయుదువు, యాపన చేతువు,
నాకడ నున్నది శివుడే స్వయముగ
సంతక మ్మిడిన బహుమతినామా,
నేనిక నీపై వ్యాజ్యము తెచ్చిన
ఒకే వాదనతో వేగమె నెగ్గెద;
వాదులాటలో నీ కొడుకెంతటి
ఘటికుడో నీకు బాగా తెలియును

వదలను నిను నే వేధించక యిక;
పోరు మాని నీ పట్టు సడలగా
బిరబిర నను నీ కరముల నెత్తుచు
ఉరమున హత్తెడు వరకును వదలను!
ఏటి ఆట ఇది ఎన్నడెరుగనని
అచ్చెరువొందెను రామప్రసాదు.

## ప్రార్థన - నమస్కారం

భారతదేశంలో 'నమస్కారం' అంటే తెలియని వారెవరూ ఉండరు. నిజానికి ఆసియా ఖండం అంతటా ఈ నమస్కారం చేసే అలవాటు కనిపిస్తుంది. గుడికి వెళ్ళినప్పుడు, ఎవరైనా ఎదురైనప్పుడు, మనం చేతులు జోడించి నమస్కారం చేస్తాము. ఈ నమస్కరించడ మంటే ఏమిటి? నమః + కరణ అనే రెండు మాటల నుంచి ఈ నమస్కరించడమనే మాట పుట్టింది. 'నమః' అనే మాటలో 'న' అంటే 'కాదు' అనీ, 'మ' అంటే 'నేను' అని అర్థం. ఆ విధంగా, 'నమః' అంటే 'నేను కాదు' అని అర్థం. 'కరణ' అంటే 'చేయడం' అని అర్థం. భగవంతుడి దగ్గరకు వెళ్ళినప్పుడు 'స్వామీ! నేను కాదు, నీవే! నేను చేసేదేమీ లేదు, చేసేదంతా నీవే!' అని చెప్పడమే నమస్కారం యొక్క ఉద్దేశ్యం. దీనిలో స్పష్టంగా స్ఫురించే ఆత్మార్పణ భావం వల్లనే ప్రార్థనలో ఇది అతి ముఖ్యమైన భాగమయింది. పెద్దలకు, స్నేహితులకు కూడా నమస్కారం చేసినప్పుడు వారిలోని దైవాన్ని చూస్తున్నామని చెప్పడమే ఈ నమస్కారంలోని అంతరార్థం. నమస్కారం, దానికున్న అనేక రూపాలు, మనలోని అహంకారాన్ని తగ్గించడానికి, తద్వారా మనల్ని భగవంతుడికి మరింత దగ్గరకు చేర్చడానికి ఉద్దేశించినవే!

## దేవుడి సంకల్పాన్ని అంగీకరించాలి

భగవంతుడు సర్వజ్ఞుడు. ఫలితాలను ఆయన ఇష్టానికే వదిలి మనం ఇలా ప్రార్థించడం నేర్చుకోవాలి. "ఓ ప్రభూ! నేను ఒంటరినైపోయాను. 'నా' అన్నవారెవరూ నాకు లేరు. నేను ఆశ్రయించగలిగిన వాడివి నీవొక్కడివే! ఈ కోరికను తీర్చడంవల్ల నాకు మేలు కలుగుతుందనుకుంటే దాన్ని తీర్చు. అన్నింటినీ నీకే వదిలిపెడుతున్నాను!"

**త్వమేవ మాతా చ పితా త్వమేవ**
**త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।**
**త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ**
**త్వమేవ సర్వం మమ దేవదేవ ॥**

ఓ దేవదేవా! నీవే నా తల్లీతండ్రీ! నా స్నేహితుడూ, బంధువూ నీవే! నా విద్య, నా ధనం అన్నీ నీవే! నీవే నా సర్వస్వం!

ఈ విధంగా ప్రార్థించడం నేర్చుకున్నప్పుడు మనలోని భక్తి ప్రాపంచికతను వదిలిపెట్టి, క్రమంగా ఉన్నతమైనదిగా తయారవుతుంది.

# 6. ప్రార్థనలో అపాయాలు, జాగ్రత్తలు

## ప్రార్థనలలో చేసిన వాగ్దానాలను నిత్యజీవితంలో నిలబెట్టుకోవాలి

ఒక చిన్న హాస్యకథ. ఇద్దరు ప్రాణస్నేహితులుండేవారు. ఇద్దరూ పక్కా తాగుబోతులు. ఒకనాడు వారిద్దరూ ఒక పడవలో సముద్రం లో ప్రయాణిస్తున్నారు. దురదృష్టవశాత్తు వారు త్రోవ తప్పి పోయారు. చాలా రోజులు గడిచిపోయినా తీరం కనిపించలేదు. పడవలో ఉన్న ఆహారం, నీరు ఎప్పుడో ఖర్చయి పోయాయి. వారి అవస్థ వర్ణనాతీతం. వారిలో ఒకడు బిగ్గరగా దేవుణ్ణి ప్రార్థించడం మొదలుపెట్టాడు. తమను క్షేమంగా ఒడ్డుకు చేరిస్తే మంచిగా నడుచుకుంటానని ఒట్టు పెట్టుకున్నాడు. ఇంకా తాను ఏయే విధంగా మంచిగా నడుచుకుంటాడో రకరకాలుగా దేవుడికి వివరిస్తున్నాడు. ప్రక్కనున్న అతడి స్నేహితుడు ఇదంతా చూస్తున్నాడు. ఆశలన్నీ అడుగంటిన ఆ విపత్కరస్థితిలో ఇక తాగుడు మానతాననడం ఒక్కటే మిగిలింది! ఇక, మొదటివాడు తాగుడు మానేస్తానని అనబోతున్న క్షణంలో స్నేహితుడికి దూరాన తీరం కనిపించింది. వెంటనే అతడు గొంతెత్తి సంతోషంగా, “ఒరేయ్! అంత మాట అనకురా! అదిగో తీరం కనిపిస్తోంది!” అన్నాడు. తమ కోరిక తీరిన ఉత్తరక్షణంలో వారి మనస్సులు మారిపోయాయి.

ప్రార్థన అంటే కేవలం నోటిమాట కాదు. అవి చేతలలో కూడా కనపడాలి. పశ్చాత్తాపంతోనో, లేక కృతజ్ఞతలు తెలుపుతూనో దేవుడికి ఇచ్చినమాటను మనం నిలబెట్టుకోవాలి. ఏదో గడ్డుకాలం దాపురించినపుడు, చేసిన తప్పులు మళ్ళీ చేయకుండా ఉంటామని దేవుడికి మాట ఇస్తాము. కానీ ఆ పరిస్థితి నుంచి గట్టెక్కగానే అన్నీ మరచిపోతాము. అలా చేస్తే భగవంతుడితో అబద్ధమాడినట్టే కదా! అసత్యం అంతులేని కష్టాలను తెచ్చిపెడుతుందని మరువకూడదు. ఆ విధంగా చూసినప్పుడు, మనం చేసే ప్రార్థనలు ఏమిటో మనమే గుర్తు పెట్టుకుంటే మేలు. ఎందుకంటే ఆచరణలో మనమే వాటిని తల్లక్రిందులు చేయకుండా ఉండాలి కదా!

**శ్రీరామకృష్ణ పరమహంస, "ఎప్పుడూ తాను చేసిన పొరపాట్ల గురించే ఆలోచిస్తూ కూర్చునే నికృష్టుడు నాశనమవుతాడు. 'స్వామీ! నేను తప్పు చేశాను, నిజమే! మళ్ళీ ఆ తప్పు చేయను!' అని దేవుడికి ప్రార్థన చేయండి. దేవుడికి ఇచ్చిన మాటను నిలబెట్టుకోండి!" అని బోధించారు.**

దేవుడు సర్వాంతర్యామి. ఆయన మన మనస్సు లోతులలోని విషయాలను ఇట్టే కనిపెట్టేస్తాడు. ప్రార్థన అంటే భగవంతుడితో చేసే సంభాషణలు, ఆయనకు నివేదించే కోరికలే కదా. కాబట్టి ప్రార్థనలో సత్యాన్నే పలకాలి తప్ప అసత్యాన్ని పలుకకూడదు.

చాలాసార్లు మనం చేస్తున్నది తప్పు అని మన అంతరాత్మ చెపుతున్నా మనం చెవినిపెట్టం. ప్రార్థనలో కూడా ఇదే ధోరణిని

కొనసాగిస్తాం. మార్క్ ట్వేయిన్ ప్రార్థన చెయ్యడం గురించి చెపుతూ, "నా హృదయపులోతులలో అది అబద్ధమని నాకు తెలుసు. భగవంతుడు దాన్ని కనిపెట్టేశాడు. అబద్ధాలతో ప్రార్థన చేయడం సాధ్యం కాదు అని నాకు స్పష్టమయింది!" అని మనందరి మనస్సులలోని మాటనే తన మాటగా విప్పిచెప్పాడు.

## ఎంతసేపు ప్రార్థించామన్నది ముఖ్యం కాదు

శ్రీరామకృష్ణులు "నారద గర్వభంగం" అనే కథ చెప్పారు.

**ఒకసారి నారదుడిలో తనకంటే గొప్ప భక్తులు ఈ ప్రపంచంలో మరెవ్వరూ లేరన్న గర్వం జనించింది. అతడి మనస్సు తెలుసుకున్న విష్ణుమూర్తి, "నారదా! ఫలానా ఊరికి వెళ్ళు! అక్కడ నా భక్తుడొక డున్నాడు. అతడితో పరిచయం చేసుకో! అతడు నా నిజమైన భక్తుడు సుమా!" అని చెప్పాడు. నారదుడు అక్కడికి వెళ్ళి, అతణ్ణి చూశాడు. అతడు ఒక వ్యవసాయదారుడు. ఉదయాన్నే లేచి ఒక్కసారి హరినామస్మరణ చేసి రోజంతా పొలం పనులు చేసుకుంటాడు. రాత్రి నిద్రపోయేముందు మరొకసారి హరినామస్మరణ చేస్తాడు. ఇదంతా చూసి నారదుడు, తనలో తాను, "ఈ పల్లెటూరి రైతు భగవద్భక్తుడు ఎలా అవుతాడు? ఇతనెప్పుడూ పొలం పనులలోనూ, కుటుంబం పనులలోనూ మునిగి ఉంటున్నాడు. భక్తుల లక్షణాలు ఇతనిలో ఏమాత్రం కనిపించడం లేదే!" అనుకున్నాడు. నారదుడు విష్ణుమూర్తి దగ్గరకు తిరిగి వెళ్ళి ఈ విషయాన్ని చెప్పాడు.**

**అప్పుడు విష్ణుమూర్తి నారదుడితో, "సరే, ఆ రైతు సంగతి ప్రస్తుతానికి ప్రక్కనపెట్టు! ఈ నూనె గిన్నె తీసుకొని వైకుంఠాన్ని చుట్టిరా! ఒక్క బొట్టు**

**కూడా నేలమీద పడకూడదు సుమా!" అన్నాడు. నారదుడు ఆయన చెప్పినట్టే చేశాడు. అతడు తిరిగి వచ్చిన తరువాత విష్ణుమూర్తి, 'నారదా! వైకుంఠం చుట్టి వచ్చేటప్పుడు నా నామాన్ని ఎన్నిసార్లు తలుచుకున్నావు! అని ప్రశ్నించాడు. నారదుడు, "ఒక్కసారి కూడా తలుచుకోలేదు స్వామీ! అయినా నిండుగా ఉన్న ఆ నూనె గిన్నెలో నుండి నూనె ఎక్కడ కారుతుందోనన్న ఆలోచన తప్ప నాకు వేరే ఆలోచనే కలగలేదు. అటువంటప్పుడు మీ నామస్మరణ ఎలా చేయగలుగుతాను?" అన్నాడు. విష్ణుమూర్తి, "కేవలం ఈ నూనె గిన్నె వల్ల నన్నే మరిచిపోయావు కదా? కానీ ఆ రైతును చూడు! తన కుటుంబం బరువుబాధ్యతలన్నీ మోస్తూ కూడా రోజుకు కనీసం రెండుసార్లయినా హృదయపూర్వకంగా నన్ను తలుచుకుంటున్నాడు. కాబట్టి వాడే గొప్ప భక్తుడు" అన్నాడు. నారదుడి కళ్ళు తెరుచుకున్నాయి. గర్వం భక్తిని కృశింపజేస్తుందని తెలుసుకున్నాడు.**

అయితే, మనం హృదయపూర్వకంగా భగవంతుణ్ణి స్మరించడం, ప్రార్థించడం చాలా అరుదు కాబట్టి ఒకసారి తలుచుకోగానే, "ఒకసారి చేసేశాంగా! ఇవాల్టికి చాలు!" అనుకోకూడదు. ప్రార్థనను నిరంతరమైన సాధనలాగా రోజంతా చేస్తూ ఉండాలి. అప్పుడే భగవంతుడి మీద ప్రేమ ఇనుమడించి, ఆధ్యాత్మిక పురోగతి సాధ్యపడుతుంది.

## ప్రార్థన వల్ల ఆధ్యాత్మిక పురోగతి కలగాలి

ప్రార్థన మన వ్యక్తిత్వంలో మార్పు తీసుకురావాలి. రోజూ చేస్తున్న ప్రార్థన మన వ్యక్తిత్వంలోనూ, మన నడవడికలోనూ, తోటి

మనుష్యులతో మన సంబంధ బాంధవ్యాలలోనూ మార్పు తీసుకు రావాలి. తోటివారి కష్టాలను మన కష్టాలుగా భావించగలగాలి. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం అనే ఆరు దుర్గుణాలు తగ్గిపోవాలి. భయం పోయి, నిర్భయత్వం కలగాలి.

ఏసుక్రీస్తు చేసిన బోధలలో అత్యంత ముఖ్యమైనదిగా భావించే ఈ బోధనను చూడండి. "నీవు కనుక గుడికి వచ్చి అక్కడ నైవేద్యాన్ని అర్పించబోతున్నపుడు, ఎవరితోనైనా నీకు వైరం ఉందనీ, వారి మీద నీకు కోపం ఉందనీ గుర్తుకు వస్తే, ఆ నైవేద్యాన్ని అక్కడ పెట్టి, ముందు వెళ్ళి అతడితో సఖ్యత కుదుర్చుకుని రా! అప్పుడు వచ్చి ఆ నైవేద్యాన్ని అర్పించు!" అని ఆ దైవపుత్రుడు చెప్పాడు (మాథ్యూ 5:23-24). నిజంగా భగవంతుడి మీద భక్తి ఉన్నవాడు తోటి మానవులతో చక్కటి సంబంధాలను కలిగివుండి, సమస్త జీవజాలం పట్ల కరుణ చూపాలని ఈ బోధనకు అర్థం. నిజమైన భక్తుడికి ప్రపంచంలో ఎవరితోనూ వైరం ఉండకూడదు. ప్రార్థన ద్వారా మనలో అటువంటి పరివర్తన రావాలి. సత్ప్రవర్తన, ప్రార్థన - మన జీవితంలో ఈ రెండూ చేదోడువాదోడుగా సాగాలి!

పైన చెప్పిన విషయాన్ని ఆచరణలో పెట్టడం ఎందుకు కష్టంగా తోస్తుంది? ఎందుకంటే, గిట్టనివాడితో సఖ్యత కుదుర్చుకోవడానికి మన అహంకారాన్ని చంపుకోవాలి. చిత్తశుద్ధితో ప్రార్థన

చేసేవాడిలోనే అటువంటి పరివర్తన సాధ్యమవుతుంది. ప్రార్థనలో భగవంతుడు సర్వాంతర్యామి అని చెప్పే మనం, బయట గిట్టని మనిషి కనిపించినప్పుడు కోపంతోనూ, ద్వేషంతోనూ రగిలి పోతాము. అతడిలో కూడా భగవంతుడున్నట్లు మనం ప్రవర్తించ గలిగినప్పుడే మన ప్రార్థనకు నిజమైన సార్థకత. అందుచేతనే ఆంగ్లంలో, "ఎవరైతే చక్కగా జీవిస్తారో వారే చక్కగా ప్రార్థించగలరు" అని ఒక సామెత ఉంది.

## స్తోత్రాలను తప్పుగా పలికితే ఏమవుతుంది?

ఆరాధన, ప్రార్థన అనేవి వాక్చాతుర్యంతో చేసే పనులు కావు. ప్రార్థన అనేది హృదయంలో నుంచి పుట్టాలి. ప్రార్థనకు అసలు మాటలతో పనిలేదు. నోరు, చెవులు లాంటి ఇంద్రియాల సహాయం దానికి అక్కరలేదు. స్తోత్రాలు, సంకీర్తనలు చేసే సమయంలో చిత్తశుద్ధితో మన హృదయాన్ని దేవుని ముందు ఉంచడమే మనం చేయవలసింది.

**శ్రీరామకృష్ణులు ప్రార్థన చేయడంలో ముఖ్యమైనదేమిటో వివరిస్తూ, "నాకు భగవంతుణ్ణి తెలుసుకోవడమొక్కటే చాలు! నాకు సంస్కృతం వస్తే ఏమిటి, రాకపోతే ఏమిటి?" అన్నారు.**

**ఆయన తన ఉద్దేశ్యాన్ని ఒక ఉదాహరణతో వివరించారు. "భగవంతుడి కృప తన పిల్లలందరి మీదా సమానంగా ఉంటుంది. వాళ్ళు చదువుకున్న వాళ్ళైనా కావచ్చు, నిరక్షరకుక్షులైనా కావచ్చు - తండ్రి తన పిల్లలందరిమీదా ఒకే రకంగా ప్రేమను చూపుతాడు. ఉదాహరణకు ఒక**

**తండ్రికి ముగ్గురు పిల్లలున్నారనుకోండి. పెద్దవాడు, రెండవవాడు 'బాబా' అని స్పష్టంగా పిలుస్తారు. మూడవవాడు 'బా', 'పా' అంటాడు. వారిలో తండ్రికి ఎవరిమీద ప్రేమ ఉంటుంది? బాబా అని స్పష్టంగా పిలిచినవాణ్ణి, సరిగా పలకలేని వాడి కంటే ఎక్కువ ప్రేమిస్తాడా? ఆ చిన్నపిల్లవాడు సరిగా పలకలేడని తండ్రికి తెలియదా? తండ్రి వారందరినీ సమానంగా ప్రేమిస్తాడని మనం తెలుసుకోవాలి!" అని శ్రీరామకృష్ణులు చెప్పారు. భగవంతుడు మన మాటలలోని తప్పుల్ని చూడకుండా మన మనస్సు ఎలా వుందో చూస్తాడు. మన మనస్సు నిష్కల్మషంగా ఉన్నప్పుడు, నిస్వార్థంతో నిండివున్నప్పుడు, మనం నోటితో పలికే పదాలు తడబడినా తప్పు లేదు. మరొకవైపు, నోటితో పలికేది ఎంత పాండిత్యంతో పలుకుతున్నా, మనస్సు అక్కడ లేకపోతే దానివల్ల ఏమీ ప్రయోజనం లేదు.**

సాధారణంగా, సంస్కృత స్తోత్రాలను తప్పుగా చదివితే అశుభాలు కలుగుతాయని చెపుతూ మతబోధకులు ప్రజల్ని భయభ్రాంతుల్ని చేస్తుంటారు. ఆ సమస్యకు శ్రీరామకృష్ణులు చెప్పిన పై కథ చక్కని పరిష్కారం.

అయితే దీనినిబట్టి సంస్కృతాన్ని చక్కగా చదవవలసిన అవసరం లేదని అనుకోకూడదు. అది అవసరమే. కానీ ఏదో పొరపాటు జరిగినందువల్ల ఇక మనకు వేరే మార్గమే లేదని భయ పడకూడదు. తప్పు చదువుతామేమోనన్న భయంతో చదవడమే మానివేయడం అసలు మంచిది కాదు. ఎందుకంటే భగవంతుడి గురించిన చింతనే మానవజీవితపు పరమావధి. తల్లిదండ్రులైనా

మనల్ని ద్వేషించవచ్చునేమో కానీ భగవంతుడు మనల్ని ఎప్పటికీ ద్వేషించడు. భక్తిలో భయానికి ఎంతమాత్రం తావు లేదు!

మరొక మాట. వేదవిద్యనూ, సంస్కృతాభ్యాసాన్నీ పరమావధిగా చేపట్టిన వారికి వర్తించే నియమాలు మామూలు మనుష్యులకు వర్తించవు. అటువంటి వారు గురువుల మార్గదర్శకత్వంలో నేర్చుకుంటూ ఏ స్వరమూ తప్పు లేకుండా పలకాలి.

యూదు మతానికి చెందిన ఒక కథ ఉంది. ఒకరోజు సాయంత్రం ఒక పేదరైతు బండిలో కూరగాయలు తీసుకెళ్ళి సంతలో అమ్మిన తర్వాత తిరిగి ఇంటికి వెడుతున్నాడు. రోజూ ఆ సమయానికి అతడు ప్రార్థన చేస్తాడు. కానీ ఆ రోజు ప్రార్థన పుస్తకం తెచ్చుకోవడం మరిచిపోయాడు. ఇక దారి మధ్యలో అడవిమార్గంలో వస్తూ ఉండగా బండి చక్రం ఊడిపోయి, దారిలో ఆగవలసి వచ్చింది. దానికితోడు, ప్రార్థన పుస్తకం కూడా తన దగ్గర లేదు. దీనితో ఆ యూదు చాలా బాధపడి, ఇలా ప్రార్థన చేశాడు: "ఓ దేవా! ఇవాళ నేను చాలా తెలివితక్కువ పని చేశాను. ఈ రోజు ఉదయం ఇంటి దగ్గర నుంచి బయలుదేరినప్పుడు నా ప్రార్థన పుస్తకాన్ని మర్చిపోయాను. నా జ్ఞాపకశక్తి ఎంత గొప్పదో నీకు తెలియనిది కాదు. ఆ పుస్తకం లేకుండా నేను ఒక్క ప్రార్థన కూడా చేయలేను. ఓ దేవా! ఒక పని చేస్తాను. నేను అక్షరమాల మొత్తాన్ని అయిదుసార్లు అప్పచెపుతాను. నీకు ఆ ప్రార్థనలన్నీ

తెలుసు కాబట్టి నేను అప్పజెప్పిన అక్షరాలను ఆ ప్రార్థనల క్రమంలో నీవే అమర్చుకుని అర్థం చేసుకో!" భగవంతుడు ఈ ప్రార్థనను విని తన పరిచారకులతో ఇలా అన్నాడు: "నేను ఈ రోజు విన్న ప్రార్థనలన్నింటిలోకీ ఇదే అత్యుత్తమమైనది. ఎందుకంటే ఈ ప్రార్థన ఒక సరళమైన, చిత్తశుద్ధిగల హృదయంలో నుంచి వెలువడింది కనుక!"

ఆపైన, మరి కొన్ని విషయాలను గమనించండి. మనం ఒక కోరిక కోరడానికీ, ఒక ప్రార్థన చెయ్యడానికీ మన మనస్సు లోతులలో దాగివున్న నిజమైన ప్రోద్బలాలు ఏవో మనకు తెలియకపోవచ్చు. అవి మన మనస్సు యొక్క చైతన్యస్థితిలో ఉన్న భాగానికి తెలియకపోవచ్చు. స్వార్థమైన పరిమితులతో సంకుచిత మైపోయిన మన దృష్టి, విషయాలను ఉన్నదున్నట్టుగా చూపకుండా మసకబారేలా చేయవచ్చు. మన కోరికలు ఎంతో అమాయకమైనవిగా మనకు తోచవచ్చు. కానీ పరబ్రహ్మానికి తెలియనిదేమీ ఉండదు. మన భూత, వర్తమాన, భవిష్యత్తులన్నీ ఆ పరబ్రహ్మానికి స్పష్టంగా తెలుసు. ఒక చిన్న నీటిబుడగ, అది ఎంత వేరుగా కనిపించినా, మహాసముద్రంలో ఒక భాగమే కదా! కాబట్టి, మనం ప్రార్థన చేసినప్పుడు భగవంతుడు దాన్ని విని, దానిలోని అంతరార్థాన్ని, అది చేసేటప్పుడు మనకున్న మానసిక స్థితిని గ్రహించి, దానివల్ల మనకు కలిగే మంచిచెడులను ఆయనే

అంచనావేసి, ఆపైన మనకు శ్రేయస్సు కలిగే దానినే ప్రసాదిస్తాడు.

మరొక అపోహ కూడా ఉంది. కొన్ని రకాల స్తోత్రాలను అందరూ చదువకూడదని కూడా కొందరు చెపుతూ ఉంటారు. అయితే దేన్నయినా చదవాలో వద్దో నిర్ణయించడం ఎలా? ఏ కోరికా లేకుండా, నిస్వార్థంగానూ, ప్రపంచానికి మేలు కలగాలనీ మనస్సులో భావిస్తూ ఏ స్తోత్రాన్ని చదివినా దాని వల్ల ఏ ప్రమాదమూ ఉండదు.

## ప్రార్థనలో అపాయాలు

పంచతంత్రంలో కనిపించే ఒక కథ చెప్పుకుందాం. ఒక చిన్న కొలను ఉంది. అందులో చాలా కప్పలు ఉంటున్నాయి. అవన్నీ కలసి ఒక రోజు సమావేశమై, "ఎన్నో తరాలుగా మనం ఇక్కడ ఉంటూ, ఇంతమందిమి తయారయ్యాము. ఎప్పుడూ నాలుగు పురుగులు తినడం, గట్టు మీద నుంచి నీటిలోకి, నీటిలో నుంచి గట్టు మీదకు దూకడంతో మన బ్రతుకు గడచిపోతోంది. మనకు ఒక రాజుగారు ఉంటే బాగుంటుంది! అప్పుడు, రాజదర్బారు, ఫిర్యాదుల పరిష్కారం, పరిపాలన – ఇలా అన్నీ జరుగుతూ ఉంటే, మనకు చాలా వినోదంగా కూడా ఉంటుంది. మనందరం కలసి భగవంతుడికి ప్రార్థన చేసి ఒక రాజును ఇమ్మని అడుగుదాం! అయితే అతడు మన జాతివాడే కాకపోతే మేలు! ఎందుకంటే మన జాతివాడే అయితే మనకు లోకువ

అయిపోతాడు!" అని తీర్మానించాయి.

అనుకున్నదే తడవుగా ప్రార్థన మొదలు పెట్టాయి. ఆ కప్పల బెకబెకల ప్రార్థనలతో దేవుడికి చెవులు హోరెత్తి, ఉన్న పళంగా పరుగెత్తుకుని వాటి దగ్గరకు వచ్చి, 'ఓ భేక భక్తవరులారా! చేసిన ప్రార్థన చాలు! ఏమి మీ కోరిక?' అని అడిగాడు. ఆ కప్పలు వాటి గోడు వెళ్ళబోసుకున్నాయి. అయితే దేవుడు, 'మీరిప్పుడు బాగానే ఉన్నారు కదా! ఎందుకు మీకీ కొత్త గోల?' అన్నాడు. కానీ ఆ కప్పలు వాటి పట్టు వీడలేదు. 'సరే! మీకొక రాజును ఇస్తాను! ఇదుగోండి మీ రాజు!" అంటూ ఒక పెద్ద దుంగను ఆ కొలనులో పడవేసి మాయమైపోయాడు. పెద్ద దుంగ నీటిలో పడడంతో నీళ్ళు ఉవ్వెత్తున ఎగిసిపడి, గొప్ప కలకలం రేగింది. ఇదంతా చూసి, కప్పలు ఎంతో సంతోషించాయి. దాన్ని చూసి ముందు కొంత భయపడినా, క్రమంగా భయం తగ్గి ఆ 'దుంగ-రాజు'గారి చుట్టూ చేరాయి. రాజుగారితో రకరకాల కబుర్లు, చాడీలు అన్నీ చెప్పుకుని ఆనందించాయి. ఆ దుంగ-రాజు కూడా వారు చెప్పినదంతా విసుక్కోకుండా విన్నాడు! ఇక కాసేపటికి, కొన్ని పిల్ల కప్పలు రాజుగారి మీదకు ఎక్కి కూర్చున్నాయి కూడా!

అయితే, నాలుగు రోజులు గడిచేసరికి ఈ దుంగ-రాజు మరీ నిస్తేజంగా, నిజానికి నిర్జీవంగా, వాటికి కనిపించాడు. మళ్ళీ ప్రార్థనలు మొదలుపెట్టాయి. ఈసారి దేవుడు మరింత త్వరగా

ప్రత్యక్షమవ్వడం, కప్పలు ఆ దుంగ–రాజు నచ్చలేదని పెదవి విరచడం జరిగిపోయాయి. దేవుడు వాటికి హితవు పలుకుతూ, 'మీకు ఈ రాజే మేలు! వీడితో సంతోషంగా ఉండండి!' అన్నాడు. అయితే కప్పలు ఆయన మాట వినకుండా, "అయ్యా! ఏదో అడిగాము కదా అని చులకనగా మీరు ఈ దుంగను మా మొహాన పడేసినట్టుంది! రాజుగారంటే పరిపాలన చెయ్యాలి కదా! 'మంచి పరిపాలన' చేసే చురుకైన రాజును ఇవ్వండి!' అని వేడుకున్నాయి. 'అయితే మీ ఖర్మ!' అని దేవుడు వెళ్ళిపోతూ ఒక కొంగను వాటికి రాజుగా ఇచ్చాడు. ఇక ఆ కొంగ వాటిలో ఒక్కొక్కదాన్నే తీరుబాటుగా పట్టుకుతింటూ ఉంటే గానీ ఆ భేక మేధావులకు తామేమి తప్పు చేశామో తెలియలేదు.

రామాయణంలో కుంభకర్ణుడి తపస్సు గురించిన కథ మీకు తెలుసా? కుంభకర్ణుడు మహాబలవంతుడు. ఎదురుగా వచ్చిన వారు ఎవరైనా సరే, వారిని విరుచుకు తినగలిగినంతటి బలాన్నీ, ఆకలినీ కలిగివుండేవాడు. ఒకసారి అతడు తపస్సు చేశాడట. శత్రువుల పట్ల దయ తలచని స్వభావం కావాలన్న కోరికతో 'నిర్దయ, నిర్దయ' అంటూ తపస్సు చేయసాగాడు. కానీ నిర్దయ అనే మాటను సరిగా పలకకుండా 'నిద్ర, నిద్ర' అని పలుకుతూ తపస్సు చేయసాగాడు. ఏది కోరితే అది సిద్ధిస్తుంది కదా! బ్రహ్మ ప్రత్యక్షమై, 'నీవు నిద్ర కావాలన్నావు కాబట్టి, నీకు నిద్ర ఇచ్చాను

పో!’ అన్నాడట. దానితో కుంభకర్ణుడు నిద్రలో మునిగిపోయాడు. ఈ కథలో మనం నేర్చుకోవాల్సిన ముఖ్యమైన విషయం ఒకటి ఉంది. ఇతరుల మీద పరాక్రమించాలన్న కోరికతో, ద్వేషంతో చేసే ప్రార్థనలు విపరీతమైన పరిణామాలకు దారితీస్తాయి. ప్రేమతో చేసే ప్రార్థనలు, అందరికీ శుభమూ, సుఖమూ కలగాలని చేసే ప్రార్థనలు మనకు గొప్ప శక్తిని ఇస్తాయి. మానవాళి మేలుకోసం చేసే ప్రార్థనలు ఉత్తమమైనవి కదా!

స్టీఫెన్ క్రాఫ్ట్, “ప్రార్థనలు మనం దేవుడికి పెట్టుకునే దరఖాస్తులే. అయితే, మన ప్రార్థనల మీద భగవంతుడికి పూర్తి సంపాదక హక్కులు ఉన్నాయి. ఆయన మన ప్రార్థనల్ని తగ్గిస్తాడు, సరిచేస్తాడు, తన సంకల్పానికి తగినట్టుగా వాటిలో మార్పులుచేసి, మన చేతికిచ్చి మళ్ళీ దరఖాస్తు చెయ్యమంటాడు” అని చెప్పాడు. అలా కాకపోతే గొంతెమ్మ కోరికలతో మన వినాశనాన్ని మనమే కొనితెచ్చుకుంటామేమో!

మనం రోజంతా చేసే ఆలోచనలే మన ప్రార్థనల రూపంలో బయటికి వస్తాయి. కాబట్టి మన ప్రవర్తన ఎలా ఉంటుందన్న విషయంలో నిరంతరం జాగ్రత్తగా ఉండాలి. మన ప్రవర్తన సరిగా లేనప్పుడు మనం చేసే ప్రార్థనలు కూడా దానివల్ల ప్రభావిత మవుతాయి. అలాంటి ప్రార్థనల వల్ల ఎటువంటి ఫలితాలు వస్తాయో తెలియదు కదా! ఇక, మన ప్రార్థనలన్నీ ఫలవంత

మవుతాయా అని అడిగితే కావనే చెప్పాలి. మన ప్రార్థనలలో అధిక శాతం, నిజానికి మన హృదయంలో రేకెత్తే కోరికలలో అధిక శాతం అర్థంపర్థం లేనివిగానూ, సంకుచితంగానూ, వినాశకరం గానూ, అతిస్వార్థంతో కూడుకున్నవిగానూ ఉంటాయి. ద్వేషంతో మనస్సులో చేసే ఆలోచనలు కూడా మన ప్రార్థనల్ని ప్రభావితం చేస్తాయి. అసలు మన ప్రార్థనలన్నీ నిజమైతే ఏమవుతుందో ఒక్కసారి ఆలోచించారా? అలా జరిగితే మన జీవితాలే కాక ప్రపంచ వ్యవహారాలన్నీ కూడా తల్లక్రిందులైపోతాయి.

## అన్ని ప్రార్థనలూ నిజమైతే!

పంచతంత్రంలో ఒక సాలెవాడి కథ ఉంది. ఆ సాలెవాడు మగ్గం నేస్తూ పొట్టపోసుకునే వాడు. రోజూ మగ్గం నేసేటప్పుడు, 'నాకు వెనుకవైపు మరొక రెండు చేతులు, రెండు కాళ్ళు ఉంటే బాగుండును కదా! ఒకేసారి రెండు మగ్గాలచేత పని చేయిస్తూ, ఇంకా ఎక్కువ బట్టలు నేయవచ్చు, ఇంకా ఎక్కువ సంపాదించవచ్చు!' అనుకునేవాడు. ఒకరోజు దాని కోసమే అడవిలోకి వెళ్ళి తీవ్రంగా తపస్సు చేశాడు. భగవంతుడు వచ్చి, 'ఏమి కావాలో కోరుకో!' అన్నాడు. 'స్వామీ! నాకు వెనుకవైపు కూడా రెండు చేతులు, రెండు కాళ్ళు ఇవ్వు! నా సమస్యలన్నీ తీరిపోతాయి!' అని కోరాడు. భగవంతుడు సరేనని వెళ్ళిపోయాడు. ఆ సాలెవాడికి నిజంగానే అదనంగా రెండు కాళ్ళు, రెండు చేతులు

వచ్చాయి. అయితే వాడు ఊరిలోకి తిరిగివెళ్ళినప్పుడు, ఊరివారు వాణ్ణి చూసి, 'వీడేదో దయ్యంగా మారిపోయాడు!' అని భయపడి వాణ్ణి కొట్టి చంపేశారు. ఈ కథ మనకు భయంకరంగా తోచవచ్చు కానీ ఇందులో ఉన్న నిజాన్ని తెలుసుకోవడం ఎంతైనా అవసరం! ప్రకృతి నియమాలకు విరుద్ధంగా, విపరీతమైన కోరికలను కోరడం వల్ల ఇలా జరుగుతుంది.

**ఇంకొక కథ చూడండి. శ్రీరామకృష్ణ పరమహంస ఈ కథను చెప్పారు. ఒక సన్న్యాసి సముద్రతీరంలో నడచిపోతున్నాడు. అతడు చాలా తపశ్శక్తి సంపాదించాడు. అక్కడ తుఫాను మొదలై అతణ్ణి చాలా ఇబ్బంది పెట్ట సాగింది. అతడు దేవుడికి ప్రార్థన చేస్తూ, 'స్వామీ! ఈ తుఫానును ఆపెయ్యి!' అని కోరాడు. దేవుడు నిజంగానే ఆ తుఫానును ఆపివేశాడు. ఒక్కసారిగా ఆ గాలి ఆగిపోయింది. అయితే ఇదే సమయంలో అక్కడకు సమీపంలోనే సముద్రంలో ఒక నావ ఆ తుఫాను గాలికి వేగంగా ప్రయాణిస్తోంది. దాని నిండా ప్రయాణీకులుండడంతో నావికుడు అతి జాగ్రత్తగా దానిని నడుపు తున్నాడు. అయితే హఠాత్తుగా గాలి ఆగిపోయే సరికి ఆ నావ ఒక్కసారిగా తల్లక్రిందులై దానిలోని ప్రయాణీకులందరూ సముద్రం పాలయ్యారు. ఆ పాపమంతా ఈ సన్న్యాసికి చుట్టుకుని అతడి తపశ్శక్తి అంతా పోయి, అతడు నాశనమై పోయాడు. అందుచేత పరిస్థితుల్నే మార్చమని ప్రార్థించ కుండా, వాటిని తట్టుకునే శక్తిని ఇమ్మని మనం ప్రార్థించాలి.**

నిజానికి, చాలాసార్లు మనం భగవంతుడితో మొరపెట్టు కునేటప్పుడు ఆయన సంకల్పం నెరవేరాలని కాక మన సంకల్పం

నెరవేరాలనే కోరతాము. అది మంచిది కాదు. ఆపైన, మన ప్రార్థనలన్నింటికీ భగవంతుడు తప్పక సమాధానం చెపుతాడు. అయితే 'కుదరదు' అన్నదే కొన్నిసార్లు ఆయన ఇచ్చే సమాధానం.

శ్రీరామకృష్ణ మిషన్‌కు మొదటి అధ్యక్షులైన బ్రహ్మానంద స్వామి ప్రార్థన చేసే విధానాన్ని ఇలా వివరించారు:

**"నిరంతరం పవిత్రమైన, నిజాయితీ గల హృదయంతో ప్రార్థించండి. 'ఓ దేవా! నాకేది మేలు చేస్తుందో, ఏది కీడు చేస్తుందో నాకే తెలియదు కాబట్టి పూర్తిగా నీ మీదే ఆధారపడివున్నాను. జీవితంలో నాకు కావలసినవన్నీ నువ్వే ఇవ్వాలి. నాకు అత్యుత్తమమైన మార్గమేదో నువ్వే చూపించు. నిరంతరం నిన్ను స్మృతిలో ఉంచుకునేందుకు, నీ మీద ధ్యానం చేసేందుకు కావలసిన శక్తిని నీవే నాకు ఇవ్వు!' అని ప్రార్థించండి!"**

## దురభిమానంతో చేసే ప్రార్థనలు

మనం చేసేవన్నీ గొప్పవే కానీ ప్రక్కవారు చేసేవేవీ గొప్పవి కావు. ఈ రకమైన ధోరణిని దురభిమానం అనీ, ఫానటిసిజమ్ అనీ అంటారు. దురభిమానంతో చేసే ప్రార్థనలు ఫలించవు.

**"దురభిమానం గల మనిషి తెలివితక్కువతనంతోనూ, దయాదాక్షిణ్యాలు లేకుండానూ ఉంటాడు. అతడు ఈ ప్రపంచానికి మేలు చెయ్యడాన్ని పక్కనపెడితే, కనీసం తనకు తాను కూడా మేలు చేసుకోలేడు!" అని వివేకానంద స్వామి చెప్పారు.**

సాధారణంగా, అత్యుత్తమమైన ప్రార్థనల నుంచి క్షణంలో అతి పేలవమైన ప్రార్థనలకు మనం దిగజారిపోతూ ఉంటాము. క్రీడలు

జరిగేటప్పుడు అభిమానులు వాళ్ళవాళ్ళ జట్లు గెలవాలని ప్రార్థనలు చేస్తుంటారు కదా! ఇరాన్–ఇరాక్ యుద్ధంలో పాల్గొన్నవి రెండూ ముస్లిం దేశాలే అయినా, ఆ రెండు దేశాల ప్రజలూ తమ శత్రువులు నాశనం కావాలనీ, తమకే విజయం దక్కాలనీ అల్లాకు ప్రార్థనలు చేశారట! వారికి తోడుగా, పాకిస్తాన్‌లోని మతపెద్దలు ఇరాన్ దేశపు నియంత అయిన మతాధికారి గెలవాలని సర్వశక్తిమంతుడైన భగవంతునికి అర్జీలు పెట్టుకున్నారట!

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఒక స్త్రీ మాట్లాడుతూ, “మేము అంతు లేకుండా ప్రార్థనలు చేశాము. అందుచేతనే దేవుడు మామీద దయ తలిచాడు. శత్రువులు వేసిన బాంబులు మా ఇళ్ళవైపు పడకుండా నగరంలో అవతలివైపు పడ్డాయి!” అని చెప్పింది. మరి అక్కడి మనుష్యుల మాటేమిటి? వాళ్ళు కూడా ఆ దేశంలోని వారే కదా!

## తెలివితక్కువ ప్రార్థనలు

ఒక కథ చెప్పుకుందాం. ఇద్దరు భార్యాభర్తలు ఉన్నారు. వారికి జీవితంలో అన్నీ సమకూరాయి గానీ, వారికున్న ముక్కులు అందంగా ఉండేవి కావు. ఊరివారి హేళనను భరించలేక, తమ ముక్కులు అందంగా ఉంటే ఎంత బాగుండును అని రోజూ అనుకునేవారు. అదే వారికి ప్రార్థనగా మారింది. ఇక ఒక రోజు నిజంగానే దేవుడు ప్రత్యక్షమై, “బిడ్డలారా! మీకేమి కావాలి? మీకు

మూడు వరాలిస్తాను! కోరుకోండి!” అన్నాడు. వారిద్దరూ చెవులు కొరుక్కొని, “స్వామీ! ముందు ఒక వరం కోరుకుంటాము! తర్వాత ఆలోచించి మిగిలిన రెండు వరాలూ అడుగుతాము. మొదటి వరంగా మాకు అందమైన ముక్కులు ఇవ్వండి!” అని కోరారు. దేవుడు సరే అని వెళ్ళిపోయాడు. వారికి అందమైన ముక్కులు వచ్చాయి. అయితే అవి ఇద్దరికీ చెరొకటి కాకుండా ఇద్దరికీ ఒంటి నిండా ముక్కులు మొలిచాయి! ఆ ముక్కులు అందంగా ఉన్నాయి కానీ అవే ఒంటి నిండా ఉంటే ఎంత వికారంగా ఉంటుందో ఊహించారా? దీనితో వారిద్దరికీ మతిపోయింది. ఊళ్ళో వాళ్ళు వీళ్ళని చూసి, ఇదేదో ప్రళయానికి సూచన అనుకుని, వీళ్ళిద్దరినీ ఊళ్ళోంచి తరిమేశారు. ఇక వీరిద్దరూ చేసేది లేక మళ్ళీ దేవుణ్ణి పిలిస్తే, ఆయన వచ్చి, “ఏమి కావాలి?” అని అడిగాడు. “స్వామీ! అందమైన ముక్కులు కావాలంటే ఒళ్ళంతా ముక్కులు పెట్టావేంటి స్వామీ! ఈ ముక్కుల్ని తీసెయ్యి!” అని ప్రార్థించారు. దేవుడు, “సరే! ఇది రెండవ వరం! మీ ముక్కుల్ని తీసేస్తున్నాను!” అని మాయమైపోయాడు. ఈసారి, దేవుడిచ్చిన ముక్కులతోపాటు వారికి ఉండాల్సిన ముక్కులు కూడా మాయమైపోయి, మళ్ళీ వికృతంగా తయారయ్యారు. వారి దుఃఖానికి, తికమకకు, గోలకు అంతులేదు. మళ్ళీ ప్రార్థన చేసి దేవుణ్ణి పిలిచి, “అయ్యా! నీకొక దండం! నీ ముక్కులకు వెయ్యి దండాలు! మాకు ముందున్న

ముక్కులే మేలులాగా ఉంది! మా ముక్కులే మాకు కావాలి! అవే మళ్ళీ ఇచ్చెయ్యి!” అని ప్రార్థించారు. మూడో వరంగా దేవుడు వారి ముక్కుల్ని ఎప్పటిలాగే చేసేసి వెళ్ళిపోయాడు.

కాబట్టి మనం చేసే ప్రార్థనల వల్ల ఎలాంటి ఫలితాలు వస్తాయో మనకు తెలియాలి. తెలియకపోతే, మనకేది మంచిదో దాన్నే ఇమ్మని ప్రార్థించాలి. లేకపోతే నిస్వార్థమైన ప్రార్థనలు చెయ్యాలి. వాటివల్ల అంతా మంచే జరుగుతుంది. భగవంతుడికి తోచే సమాధానాలు మనకు తోచే సమాధానాలకంటే ఎల్లప్పుడూ తెలివిగలవిగా ఉంటాయి కాబట్టి ఆయనకు మనం కృతజ్ఞులై, విధేయతతో ఉండడం అవసరం.

## దుర్మార్గుల ప్రార్థనలు

పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాలలో భారతదేశంలో కనిపించిన ‘థగ్గులు’ అనే బందిపోట్ల గురించి చాలామందికి తెలుసు. వీళ్ళు నరహంతకులు. బాటసారుల్ని నమ్మించి, అవకాశం చిక్కినప్పుడు చేతిగుడ్డతో వారి గొంతుల్ని నులిమి, చంపి, వారి దగ్గర డబ్బు కాజేసి, వారి శవాలను పూడ్చిపెట్టేవారు. ఇదంతా కాళీమాతకు వారు చేసే పూజలో ఒక భాగం.

మన దేశంలో చాలాచోట్ల బందిపోట్లు అమ్మవారికి పూజలు, ప్రార్థనలు చేసిన తర్వాతే దోపిడీలకు, హత్యలకూ తెగబడతారు. అవినీతిపరులు, లంచగొండులు, కూడా తాము చేసే దుర్మార్గా

లకు ముందుగా తమకు రక్షణ కల్పించమని, తమకు తోడుగా ఉండమనీ, భగవంతుడికి ప్రార్థనలు చేస్తారు. ఈ ఘోరమైన సత్యాలన్నీ మనకు ఆదిమజాతి మానవులను గుర్తుకు తెస్తాయి. రక్తదాహులైన తమ కులదేవతలు ఒకరిమీద మరొకరు ఆధిపత్యం కోసం పోరాడుతున్నట్టు, వారే తమను కూడా యుద్ధానికి ప్రేరేపిస్తున్నట్టు భావించి, తమ కులదేవతల్ని మెప్పించడం కోసం ఆ తొలిమానవులు పోరాటానికి దిగేవారు. ఈ ఆధునికకాలంలో మనం కూడా ఆ ఆదిమజాతుల ప్రవర్తనలో కనిపించే జంతు స్వభావాన్ని దాటి రాలేదేమో అనిపిస్తుంది! మనకున్న నాగరికత ముసుగులో ఆదిమజాతుల లక్షణాలు ఇప్పటికీ పొంచివున్నాయి. దానికితోడు మనం ఎలావుంటే దేవుడి గురించి మనకున్న అవగాహన, అభిప్రాయం అదే విధంగా ఉంటాయి. మనలో నీచమైన ద్వేషం, అసూయ, లోభం మొదలైన దుర్మార్గపు లక్షణాలు ఉంటే, వాటికి తాన అంటే తందాన అంటూ, మన శత్రువుల్ని నాశనం చేయడానికి ఆకాశంలో కూర్చున్న ఒక రౌడీ పెద్దన్నలాగా భగవంతుడు మనకు కనిపిస్తాడు. మన నీచమైన ప్రేరేపణలను సర్వాంతర్యామి అయిన పరమాత్మ మీదకు ఆపాదించి, మన గొంతెమ్మ కోరికలన్నింటికీ ఆ పరమాత్మ వత్తాసు పలకాలని మన ఉద్దేశ్యం. మృగాలు కూడా సిగ్గుపడే మన కోరికలు తీరకపోతే ఆపైన నాస్తికులుగా తయారవుతాము!

## లోభగుణం కలవారి ప్రార్థనలు

వ్యాపారపు ప్రార్థనలు ఎలా ఉంటాయో చెప్పే ఒక కథను వినండి. ఒక దురాశాపరుడైన లోభి దేవుడికి ప్రార్థన చేస్తూ, “ఓ దేవా! నీవు నాకు ఏభైవేల రూపాయలు గనుక ఇచ్చేట్టయితే, అందులో పదివేలు నేను దానధర్మాలకు ఖర్చు పెడతాను!” అన్నాడు. ఇలా అన్న తర్వాత ఆ బుద్ధిమంతుడు ఒక్క క్షణం ఆగి, “ఓ కరుణామయా! నీకే కనుక నా మీద నమ్మకం లేకపోతే ఆ పదివేలు ముందే తగ్గించుకుని మిగిలినది ఇవ్వవలసిందిగా కోరుతున్నాను!” అని ప్రార్థించాడు.

మనలో చాలామంది భగవంతుడు మహాభాగ్యవంతుడనీ, మనకు కావలసిన ప్రాపంచికమైన వస్తువులన్నింటినీ సరఫరా చేయడానికే అక్కడ కూర్చున్నాడనీ అనుకుంటూ ఉంటారు. ఆ ధోరణితో ప్రార్థన అనేది చాలాసార్లు మనం దేవుడితో చేసే లావాదేవీగా (అంటే ఇచ్చి పుచ్చుకోవడంగా) మారుతుంది. ‘ఓ దేవుడా! నాకిది ఇవ్వు! బదులుగా నేను అది నీకిస్తాను! నీకు మేళతాళాలతో, కొలుపులు చేయిస్తాను. ఉపవాసాలు చేస్తాను, తీర్థయాత్రలు చేస్తాను!’ అంటూ దేవుడితో బేరసారాలు సాగిస్తాము. పొలం కొంటే వెయ్యి కొబ్బరికాయలు కొడతామనీ, ‘మంత్రి పదవి వస్తే పూసకూర్పుతో జోడు ప్రభలు కట్టిస్తామ’నీ

మొక్కుకుంటాము. ఇటువంటి ప్రార్థనలు తప్పు కాదు కానీ, వాటి తోనే ఆగిపోక, మరింత ముందుకు పోవాల్సిన అవసరం ఉంది.

**వివేకానంద స్వామి ఇలా చెప్పారు: "ఎవరైతే జ్ఞానలోకాలకు చేరాలనుకుంటాడో వాడు ఈ ఇచ్చిపుచ్చుకోవడాలు, అమ్మకాలు, కొనుగోళ్ళు మానుకోవాలి. ఈ లావాదేవీల మతాన్ని వదిలిపెట్టాలి. ఆ తర్వాతే ఉన్నతమైన జ్ఞానలోకాల ద్వారాలలోకి ప్రవేశించడానికి ప్రయత్నించాలి. దీనినిబట్టి, మీరు ప్రార్థించినవి మీకు దక్కవని అనుకోనక్కరలేదు. నిజానికి, మీరు ప్రార్థనలో కోరినవన్నీ మీకు తప్పక లభిస్తాయి. కానీ అలా కోరడమనేది బిచ్చగాళ్ళ మతమే తప్ప మరొకటి కాదు."**

మనం చేసే అర్థింపులలో జ్ఞానానికి, మంచితనానికి, నిస్వార్థతకు బదులు లోభం, అసూయ, దుర్మార్గమే ఎక్కువగా కనిపిస్తాయి. తనకు అన్నిటికన్నా ముఖ్యమైన జ్ఞానాన్ని కోరడానికి బదులు మనిషి సృష్టిలోని సమస్తవిషయాలనూ కోరతాడు. ఆ విధంగా అత్యున్నత ఆదర్శాలకు ఆలవాలమైన ప్రార్థనను అతి నీచమైన స్థితికి దిగజార్చివేస్తాడు.

## ప్రార్థనలో మానసిక బలహీనత పనికిరాదు

"బలమే జీవనం, బలహీనతే మరణం!" అని స్వామీజీ చెప్పిన మాట మనం ఎల్లప్పుడూ గుర్తుకు తెచ్చుకోవాలి. బలహీనతే మన కష్టాలన్నింటికీ, మనం ఇతరులకు లొంగిపోవడానికీ కారణం. (బలమైన మనిషి తన కాళ్ళమీదే తాను ఆధారపడాలనీ, ఇతరుల నుంచి ఏ విధంగానూ, ఏమీ ఆశించకూడదనీ అనుకుంటాడు.)

ఆధ్యాత్మికతలోనే కాక సాధారణ జీవితంలో కూడా ఇతరులకు లొంగడమనేది పనికిరాదు. ఇతరులను లొంగదీసుకోవడం కూడా పనికిరాదు.

**వివేకానంద స్వామి, "ఈ ప్రపంచం మూఢనమ్మకాల సంకెళ్ళలో చిక్కుకుని ఉంది. అణగదొక్కబడినవారు - స్త్రీలైనా, పురుషులైనా - వారంటే నాకు ఎంతో జాలి. అణగదొక్కేవారిని చూస్తే మరింత జాలి" అని చెప్పారు.**

మరొకవైపు బలహీనమైన మనస్సు ఉన్నవాడే ప్రక్కవారిని లొంగదీసుకుందామనీ, వారిని తన గుప్పెట్లో ఉంచుకుందామనీ, వారివల్ల తన స్వలాభాలను నెరవేర్చుకుందామనీ అనుకుంటాడు. ఆధ్యాత్మికమార్గంలో మనం ప్రయాణించాలనుకున్నప్పుడు, ఇటువంటి వారు అనేకమంది మనకు ఎదురై మనల్ని తప్పు దోవ పట్టిస్తారు. తాము చెప్పేదాన్ని గుడ్డిగా నమ్మమని ప్రేరేపిస్తారు. ఇలా చేయడం గొప్ప ప్రమాదంతో కూడుకొని ఉంది. కాబట్టి మనం మన మనస్సును అన్నివిధాలుగా బలవత్తరంగా చేసుకోవాలి. అటువంటి మనస్సుతో ప్రార్థన చెయ్యాలి. బలహీన మనస్కులకు ప్రార్థనలో ఎదురయ్యే అపాయాలను వివేకానంద స్వామి ఇలా వివరించారు.

**మీ మనస్సులనూ, మీ శరీరాలనూ మీ అదుపులోనే ఉంచుకోండి. మీ శరీరం రోగాన్ని తెచ్చుకునే స్థితిని పొందనంతవరకూ, బయటినుంచి ఏ శక్తీ మిమ్మల్ని ప్రభావితం చెయ్యలేదు. (ఏ విషయాన్నైనా) గుడ్డిగా**

నమ్మమని చెప్పేవాడెవడైనా సరే, వాడెంత గొప్పవాడయినా కావచ్చు గాక, అటువంటివాణ్ణి దూరంగా పెట్టండి.

అనాది నుంచీ, ప్రపంచమంతటా, అన్ని మతాలలోనూ, నాట్యాలు చేస్తూ, గంతులు వేస్తూ, అరిచి బొబ్బలు పెడుతూ, ప్రార్థనలు చేసే తెగలు ఉన్నాయి. ఆడుతూ, పాడుతూ మతబోధనలు చెయ్యడం మొదలు పెట్టి నప్పుడు ఆయా తెగలు ఒక అంటువ్యాధిలాగా వేగంగా వ్యాపిస్తాయి. ఇటు వంటి వర్గాలను నడిపేవాళ్ళు కూడా ఒక రకంగా కృత్రిమనిద్ర కలిగించే వారే (హిప్నోసిస్ చేసేవారే). సులభంగా మనోవికారాలకు లోబడిపోయే బలహీనుల మీద వీరు పూర్తి నియంత్రణను సాధించి, వారిని తమ గుప్పెట్లో పెట్టుకుంటారు. అది తాత్కాలికమే అయినప్పటికీ దాని పర్యవసానాలు ఘోరంగా ఉంటాయి. హా! తరచుగా, కాలగమనంలో, జాతులకు జాతులే పతనం కావడానికి ఈ మతవర్గాలు కారణమవుతాయి.

ఒక మనిషి కానీ, ఒక జాతిగానీ, ఇలాంటి రోగకారకమైన బాహ్యనియంత్రణల ద్వారా కృత్రిమమైన మంచితనంతో కనబడే కంటే చెడుగా ఉండడమే మేలు. ఇలాంటి మతవర్గాలను నడిపేవారి ఉద్దేశ్యం మంచిదే కావచ్చు. కానీ బాధ్యతారహితంగా, దురభిమానంతో ప్రవర్తించే ఈ మతబోధకులు మానవాళికి చేసే హానిని తెలుసుకుంటే ఎవరికైనా గుండె చెరువవకమానదు. సంగీతం ద్వారా, ప్రార్థనల ద్వారా వారు ఇచ్చే సూచనల వల్ల వినేవారి మనస్సులలో హఠాత్తుగా, ఉన్నట్టుండి ఒక్కసారిగా భావావేశరూపంలో ఆధ్యాత్మిక చైతన్యం ఉప్పొంగుతుంది. (సరిపడినంత ఆధ్యాత్మిక సాధనలు పునాదిగా లేనివారికి ఇలా

**హఠాత్తుగా ఆధ్యాత్మిక చైతన్యం మేలుకొన్నప్పుడు అది ఎంతోసేపు అలా నిలువక, ఒక్కసారిగా కుప్పకూలుతుంది. అలా కుప్పకూలడం చాలా అపాయకరం.) అయితే, ఆ స్థితి నుంచి ఆ ఆధ్యాత్మికచైతన్యం హఠాత్తుగా పతనమైనప్పుడు, వారు చురుకుదనాన్ని కోల్పోయి, ఉదాసీనులుగా, రోగగ్రస్తులుగా, శక్తిహీనులుగా మారిపోతారు. నైతికంగా దిగజారి పోతారు. ఇటువంటి వారు బయటి ప్రపంచంలోనుంచి ఎదురయ్యే ప్రభావాలకు ఇట్టే లొంగిపోతారు - అవి చెడ్డవైనా సరే.**

ఈ బోధనను గమనించినప్పుడు మానసిక బలహీనత అనేది ప్రార్థనకు బద్ధశత్రువు అని మనకు అర్థమవుతుంది. బలహీనత మనలోనే పుట్టవచ్చు లేదా ఇంకెవరైనా దాన్ని మనలో కలిగించ వచ్చు. ఏది ఏమైనా అది ప్రమాదకరమే. అన్ని విషయాలలోనూ మనం మన కాళ్ళమీదనే ఆధారపడాలి. 'మంచి రానీ, చెడు రానీ, నా స్వప్రయత్నంతో నేను సాధిస్తాను!' అని అనుకోవాలి. ఇలా స్వప్రయత్నం వల్ల కలిగిన ఫలితాలే మనవిగా నిలుస్తాయి. శ్రీరామకృష్ణులు, స్వామీజీ ఇలా స్వప్రయత్నంతో సాధన చెయ్యడాన్ని, ప్రార్థన చేయడాన్ని నేర్పించారు.

దేవుణ్ణి పూజించే సమయంలో కూడా మన బలహీనతను బయటపెట్టే కొన్ని విషయాలను గమనించవచ్చు. పూజ పూర్తి అయిన తర్వాత అపరాధాలను మన్నించమని వేడుకుంటూ, 'విధిహీనం, క్రియాహీనం, మంత్రహీనం యదర్చితం, మయా

నివేదితం భక్త్యా, పరిపూర్ణం తదస్తు మే' అన్న శ్లోకాన్ని చదువుతారు. అయితే దీనికి పాఠాంతరంగా 'మంత్రహీనం' అన్న మాటకు బదులుగా 'భక్తిహీనం' అని చదివే అలవాటు కూడా ఉంది. అయితే రామకృష్ణమఠానికి చెందిన ఒక సన్న్యాసి అలా చేయవద్దని వారిస్తూ, "భక్తిహీనం అని చదివితే ఇంక మీరు పూజ చేసినందువల్ల ప్రయోజనం ఏముంది? పూజ చేసే పద్ధతిలోనూ, క్రియలలోనూ, మంత్రాల ఉచ్చారణలోనూ తప్పులను క్షమించమని కోరండి కానీ, భక్తి కూడా లేదని చెపితే ఇక పూజ చేయనట్టే కదా?" అని ప్రశ్నించారు. ఇదే విధంగా "పాపోఽహం, పాపకర్మాహం, పాపాత్మా, పాపసంభవః, త్రాహి మాం కురు మే దేవ రక్షరక్ష మహేశ్వర" అంటూ, "నేను పాపిని, నేను పాపంలో పుట్టాను, పాపపు పనులే చేస్తాను... నన్ను క్షమించు!" అంటూ ప్రార్థన చేస్తారు. ఈ విషయం గురించి మాట్లాడుతూ, "మాటిమాటికీ నేను పాపిని అనడం వల్ల మనం నిజంగానే పాపులమవుతాము! దానికి బదులు 'పుణ్యోఽహం, పుణ్య కర్మాహం, పుణ్యాత్మా, పుణ్యసంభవః' అని చదవండి. దానివల్ల మీకు నిజంగా మేలు కలుగుతుంది" అని సలహా ఇచ్చారు.

# 7. ప్రార్థనకు సహాయకాలు

## ప్రార్థన - పూజ - మానస పూజ

భగవంతుణ్ణి మన అత్యంత సన్నిహితుడిగా, సొంత మనిషిగా భావించి, మన ఇంటికి ఆహ్వానించి, ఒక అతిథికి మర్యాదలు చేసినట్టుగా ఆయనకు సంతోషాన్ని కలిగించే పనులను చేయడమే పూజ. శరీరాన్ని శుభ్రం చేసుకుని, పూజామందిరాన్ని శుభ్రం చేసి, పుష్పాలతో అలంకరించి, అగరువత్తులతో సువాసనలు వ్యాపించేలా చేసినప్పుడు మనస్సుకు ఏకాగ్రత కలిగే పరిస్థితులు ఏర్పడతాయి.

ఈ పూజలో భాగంగా, మొదటగా భగవంతుడికి ఎందుకు పూజ చేస్తున్నామో సంకల్పిస్తాము. ఆ తర్వాత భగవంతుణ్ణి పిలిచి కూర్చోబెట్టినట్టుగా ఆయనను ఒక విగ్రహంలోనికి గానీ, ఒక లింగంలోనికి గానీ ఆవాహనం చేస్తాము. ఆపైన ఆయనకు కాళ్ళు చేతులు కడుక్కోవడానికి నీళ్ళు, తాగడానికి నీళ్ళు ఇచ్చి, పూలతో పాటు, తులసి, బిల్వ మొదలైన సువాసన భరితమైన ఆకులను, గంధము, చందనము అద్ది, ఆయనకు అర్పించి పూజిస్తాము. ఆయనకున్న అనేక నామాలను చదువుతూ, వాటితో పాటు ఒక్కొక్క పుష్పాన్నే అర్పిస్తూ ఆయనను సంతోష పెడతాము.

ఆయనకు గొడుగు పట్టడం, వింజామర వీయడం మొదలైన సేవలతో విశ్రాంతినీ; పాటలతోనూ, నాట్యంతోనూ వినోదాన్నీ కలిగిస్తాము. చివరకు రకరకాల పానీయాలనూ, వండిన ఆహారపదార్థాలనూ, పండ్లనూ ఆయనకు అర్పిస్తాము. చివరిగా పుష్పాంజలిని, ఆపైన మన ఆత్మనే ఆయనకు అర్పిస్తాము.

ఇలా పూజ చేయడంలోని ఆంతర్యం ఏమిటో తెలుసుకుందాం. భగవంతుణ్ణి గురించి మనస్సులో ఆలోచించడమనేది చాలా కష్టమైన పని. దానిని సమాజంలో అధికభాగం చేయలేరు. మరి వారికి ఏకాగ్రతను నేర్చుకునేందుకు ఏదైనా మార్గం కావాలి కదా! అదే పూజ. దీనిలో మనం చేసేవన్నీ చాలా స్థూలంగా, పామరజనుల మానసికస్థాయిలో ఉంటాయి. దేవుణ్ణి మనకు అత్యంత సన్నిహితుడైన మరొక మనిషిగా ఊహించడం ప్రతి ఒక్కరికీ సులభం. ఇందులో మనుష్యులు తమకేది ఇష్టమో దానినే భగవంతుడికి సమర్పిస్తారు కూడా. ఆ పైన భగవంతుడికి సమర్పించిన పత్రపుష్పాలనూ, ఆహారాన్నీ ప్రసాదంగా స్వీకరిస్తారు. భగవంతుణ్ణి గురించే ఆలోచిస్తూ పూజ చేసినందు వల్ల ఆయనకు నైవేద్యం చేసిన ఆహారాన్ని చాలా పవిత్రమైనదిగా భావిస్తారు.

తంత్రశాస్త్రంలో మానసపూజ అనే పూజావిధానం వివరించ బడింది. భగవంతుడికి అర్పించడానికి మన శరీరంలోని

భాగాలతోపాటు, పంచభూతాలనే నివేదనలుగా ఊహిస్తూ మనస్సులో చేసేదే మానసిక పూజ.

రమణీయమైన ప్రకృతిసౌందర్యంతో, పక్షుల కిలకిలా రావాలతో, నిండివున్న ఒక దీవిని మనస్సులో ఊహించుకోవాలి. అక్కడ అందమైన వృక్షాలు, పూపొదలు, సుందరమైన పర్వతాలు, మనోహరమైన సెలయేళ్ళు ఉన్నాయి. ఆ దీవి మధ్యలో కల్పవృక్షం ఉంది. ఆ వృక్షం క్రింద ఉన్న రత్నఖచిత సింహాసనంలో ఆసీనుడై ఉన్న మన ఇష్టదేవత ముందు నిలబడి ఉన్నట్లు మనల్ని మనం ఊహించుకోవాలి. మానసపూజలో భాగంగా, ఆ దైవానికి మన హృదయాన్నే ఆసనంగా సమర్పించాలి. మనస్సును అర్ఘ్యంగా (పూలు, ఆకులు, గంధంతో చేసిన గుచ్ఛం) సమర్పించాలి. ఒక అతిథిని ఇంటిలోనికి ఆహ్వానిస్తూ కాళ్ళు కడుక్కోవడానికి నీరు ఇచ్చినట్లు, ఆ దేవతకు స్వాగతం పలుకుతూ పాద్యం (కాళ్ళు కడుక్కునే నీరు) ఇవ్వాలి. వేయిరేకులున్న ఒక సహస్రదళపద్మం నుంచి మకరందం ఉబికి వస్తున్నట్లు భావిస్తూ, ఆ మకరందాన్ని ఆచమనీయంగా (త్రాగడానికి), స్నానీయంగా (స్నానం చేయడానికి) సమర్పించాలి. స్నానం తరువాత, ఆకాశాన్నే అంబరంగానూ (వస్త్రం), మనకు ఆధారభూతంగా ఉన్న భూమినే సుగంధాలు వెదజల్లే అగరువత్తిగానూ చేసుకోమని ప్రార్థించాలి. ఆ తరువాత చిత్తాన్ని పుష్పంగానూ, ప్రాణాలను ధూపంగానూ,

తేజస్సును దీపంగానూ, మనస్సు అనే అమృత కలశాన్ని నైవేద్యంగానూ భావించి అర్పణ చేయాలి. ప్రకృతిలో సహజసిద్ధంగా ఎల్లప్పుడూ మ్రోగుతూవుండే అనాహత ధ్వనిని ఘంటాశబ్దంగానూ, మన శరీరంలోని వాయుతత్వాన్ని వింజామరగానూ, అక్కడ వినవచ్చే శబ్దాలను సంకీర్తనలుగానూ, మన ఇంద్రియాలు ఆచరించే కర్మలను, మన మనస్సు యొక్క చంచలత్వాన్ని నృత్యంగానూ, పర్వతపంక్తులను పద్మాలమాలగా, మన శిరస్సులో ఉండే సహస్రారం అనే పద్మాన్ని ఛత్రంగానూ భావించమని వేడుకోవాలి. చివరిగా మనల్ని మనం సంపూర్ణంగా సమర్పించుకోవడంతో మానసపూజ పూర్తి అవుతుంది.

పై విధమైన పూజ, క్రమక్రమంగా పూజ చేసేవారి మనస్సుకు ఉన్నత స్థితిగతులను కల్పించి, ప్రార్థనకు, జపానికి, ధ్యానానికి వారి మనస్సును ఆయత్తం చేస్తుంది.

## ప్రార్థన - నామమహిమ

భగవంతుడికి చేసే ప్రార్థనలో ప్రముఖంగా కనిపించేది ఆయన నామమే! అంతేకాక, భగవంతుడి కంటే ఆయన నామమే మహత్తరమైనదని మనం విని ఉంటాము. శ్రీరాముడు సముద్రాన్ని దాటడానికి వంతెన కట్టవలసి వచ్చింది కానీ హనుమంతుడు రామనామాన్నే జపించి ఒక్క దుముకులో సముద్రాన్ని దాటేశాడు.

స్వామీజీ నామమహిమను గురించి ఇలా వివరించారు.

పూజాపురస్కారాలన్నింటిలోనూ ప్రముఖంగా కనిపించేది - భగవంతుని పుణ్యనామానికి చేసే ఆరాధన. ఈ నామ ఆరాధన అనేది అన్ని మతాలలోనూ కనిపిస్తుందని మీలో వాటిని గురించి చదివిన వారికి తెలుసు. వారందరూ నామం అనేది అత్యంత పవిత్రమైనదని చెపుతారు. బైబిల్ గ్రంథంలో భగవంతుని పవిత్రనామం అనుపమానమైనదనీ, దాన్ని దేనితోనూ పోల్చలేమనీ చెప్పబడింది. భగవన్నామం అన్ని పేర్లలోకీ అత్యంత పవిత్రమైనది. అసలు ఆ నామమే భగవంతుడని చెప్పబడింది. ఇది ఎంతైనా నిజం. నామరూపాలు కాకుండా ఈ ప్రపంచంలో ఉన్నదేమిటి? వాక్కుకు అతీతంగా అంటే మాటలు లేకుండా ఆలోచించడం సాధ్యమా? మాటల్ని, ఆలోచనల్ని మనం ఏ విధంగానూ విడదీయలేము. కావాలంటే మీలో ఎవరైనా వాటిని విడదీయడానికి ప్రయత్నించి చూడండి! మీరు ఏది ఆలోచించినా, పదాలను, రూపాలను ఆధారంగా చేసుకుని మాత్రమే ఆలోచించగలుగుతున్నారు. ఒకటి మరొక దాన్ని తీసుకువస్తుంది - ఆలోచన మాటను తీసుకువస్తుంది, మాట ఆలోచనను తీసుకువస్తుంది. ఈ విశ్వమనేదే భగవంతుడి యొక్క మహత్తరరూపం - దాని వెనుకనున్నది ఆయన యొక్క మహత్తర నామం. ప్రతి ప్రత్యేకమైన వస్తువుకూ ఒక రూపం ఉంది, దాని వెనుక దానికొక ప్రత్యేకమైన నామం ఉంది. మీరు ఫలానా స్నేహితుణ్ణి తలచుకో గానే అతడి రూపం గుర్తుకు వస్తుంది. అతడి రూపం గుర్తుకు రాగానే అతడి పేరు గుర్తుకు వస్తుంది. ఇదే మనిషి యొక్క స్వభావం. అంటే - మనోవైజ్ఞానిక దృష్టితో చూసినప్పుడు - మనిషి యొక్క మనస్సు అనే పదార్థంలో నామరూపాలు విడదీయలేని విధంగా పెనవేసుకుపోయి

**ఉన్నాయి. నామం లేకుండా రూపం లేదు, రూపం లేకుండా నామం లేదు. అవి ఒకే అల యొక్క బాహ్య, అంతర రూపాల లాంటివి. దీనివల్లనే ప్రపంచమంతటా నామానికి ఉన్నతమైన స్థానాన్ని కల్పించి, దానినే ఆరాధిస్తున్నారు. ఈ విధంగా, తెలిసో తెలియకో, నామం యొక్క మహిమ మనిషి అనుభవానికి వచ్చింది.**

## ప్రార్థన - విగ్రహారాధన

నామం రూపం చేదోడువాదోడుగా సాగుతాయని పై అధ్యాయంలో చదివాము. దాని ద్వారా ప్రార్థనకు రూపంతో కూడా విడదీయలేని సంబంధం ఉందని మనకు అర్థమవుతుంది. మనస్సులో ఒక రూపాన్ని గురించి ఆలోచించినప్పుడు మనకు ప్రార్థన చేయడం సులభమవుతుంది.

**ప్రథమా ప్రతిమా పూజా జపస్తోత్రాది మధ్యమా ।**
**ఉత్తమా మానసీ పూజా సోఽహం పూజోత్తమోత్తమా ॥ (తంత్రసార)**

విగ్రహపూజ మొదటి మెట్టు. భగవంతుని నామాన్ని స్మరించడం, ఆయన గుణగణాలను కీర్తించడం అంతకంటే మెరుగు. ధ్యానం అంటే భగవంతుని పట్ల ఎడతెరిపిలేని ఆలోచన. అది ఇంకా మెరుగు. 'సోహం' అంటూ తానే భగవంతుడన్న అవగాహన అత్యున్నతస్థాయికి చెందిన ఆరాధన.

కాబట్టి, విగ్రహాలు మన ప్రార్థనలను సులభతరం చేస్తాయి. 'భగవంతుడు మట్టిబొమ్మలో లేడు కదా!' అని శిష్యులలో ఒకరు వ్యాఖ్యానించినప్పుడు, శ్రీరామకృష్ణులు, 'కానీ దాన్ని మట్టి అనడం

ఎందుకు? అది చైతన్యంతో అలరారే శక్తికి ప్రతిరూపం! అది మృణ్మయమూర్తి కాదు, చిన్మయమూర్తి!' అని చెప్పారు. ఆయన ఇంకా వివరిస్తూ, 'భగవంతుడు ఎన్నో పనులు చేశాడు. అన్ని చేయగలవాడు, తనను ఏ విధంగా ఆరాధించాలో ఆయన తన భక్తులకు నేర్పలేడా? దాన్ని నేర్చుకోవలసిన అవసరం ఉంటే ఆయనే గురువై వారికి నేర్పుతాడు. ఒకవేళ, ఆ మట్టిబొమ్మను పూజించడంలో మనిషి ఏదైనా తప్పు చేస్తున్నాడనుకోండి! భగవంతుడికి తెలియదా? ఆ మట్టిబొమ్మ ద్వారా మనిషి తననే ఆరాధిస్తున్నాడని భగవంతుడు అర్థం చేసుకోలేడా? అటువంటి పూజతో కూడా ఆయన సంతృప్తి చెందుతాడు!"

విగ్రహారాధనను చాలామంది తప్పుగా, పాపంగా చిత్రీకరిస్తూ ఉంటారు. అలా చేయడం తప్పని చెపుతూ, విగ్రహారాధనను ఎలా అర్థం చేసుకోవాలో వివేకానంద స్వామి వివరించారు.

**భగవంతుని భక్తుడైన వాడు, సాకారరూపంలోని భగవంతుణ్ణే ఆరాధిస్తూ, దానిలోని ఆనందమే కావాలనీ, చివరకు ముక్తి, నిర్వాణం కూడా తనకు అక్కర్లేదనీ అనడం తెలివితక్కువతనంతోనే అని మీరనుకుంటున్నారా?" ఒక చెట్టు ఎటువంటిదో దాని ఫలాలను బట్టి తెలుస్తుంది. విగ్రహారాధకులుగా ముద్రవేయబడిన కొందరిలో, ఈ ప్రపంచంలో మరెక్కడా కనిపించనంత నైతికతను, ఆధ్యాత్మికతను, ప్రేమను, నేను చూశాను. అలా చూసినప్పుడు నన్ను నేను ఏమని ప్రశ్నించుకున్నానంటే - 'పాపంలో నుంచి పవిత్రత పుట్టగలదా?'**

విగ్రహారాధన వద్దని బోధించడంవల్ల ఎటువంటి ప్రయోజనం లేదు. అసలు విగ్రహాలకి వ్యతిరేకంగా ఎందుకు బోధించాలి? మనిషి విగ్రహాలను ఎందుకు ఉపయోగించకూడదో చెప్పే కారణమేదీ లేదు. వాటి వెనుకనున్న భావాలను సూచించడానికే విగ్రహాలను, మత చిహ్నాలను, ప్రతీకలను ఉపయోగిస్తారు. ఈ విశ్వమే ఒక చిహ్నం. ఈ విశ్వం తన వెనుక, తనకు అతీతంగా ఉన్న ఏ విషయాన్ని సూచిస్తున్నదో, దాన్ని అర్థం చేసుకోవడానికి ఈ విశ్వంలో నుంచి, ఈ విశ్వం ద్వారా మనం ప్రయత్నిస్తున్నాం. మన గమ్యం ఆత్మ కానీ పదార్థం కాదు. దేవీదేవతల రూపాలు, విగ్రహాలు, గంటలు, మైనపువత్తులు, గ్రంథాలు, చర్చిలు, దేవాలయాలు, మిగిలిన అన్ని పవిత్ర మతచిహ్నాలు - అన్నీ మంచివే. ఆధ్యాత్మికత అనే మొక్క ఎదగడానికి అవి ఎంతైనా అవసరం.

సోదరులారా! మానసికంగా ఏదోవొక రూపాన్ని ఊహించుకోకుండా మనం ఆలోచించలేము. మనకు శ్వాస ఎంత ముఖ్యమో ఇది కూడా అంతే! సంబంధన్యాయం ద్వారా వాస్తవికమైన రూపం మానసికమైన భావనను స్ఫురింపజేస్తుంది. అదే విధంగా భావన రూపాన్ని స్ఫురింపజేస్తుంది. అందుచేతనే హిందువు బాహ్యమైన ప్రతిమలను పూజిస్తాడు. దాని ద్వారా తాను ప్రార్థిస్తున్న భగవంతుడి మీద మరింత చక్కగా తన మనస్సును ఏకాగ్రం చేయగలుగుతున్నానని అతడు మీకు చెపుతాడు. ఆ విగ్రహమే భగవంతుడు కాదనీ, భగవంతుడు సర్వాంతర్యామి అనీ, అతడికి స్పష్టంగా తెలుసు.

## ప్రార్థనలు - దేవాలయాలు

గుడులకు వెళ్ళి ప్రార్థించడం ఎందుకు? ఎందుకంటే గుడిలో

మనం చేసే ప్రార్థనలు మరింత శక్తిమంతంగా పనిచేస్తాయి. ఆవు శరీరంలో రకరకాల భాగాలున్నా దాని పొదుగునుంచి మాత్రమే మనకు పాలు లభిస్తాయి. అదే విధంగా భగవంతుడు అంతటా ఉన్నాడన్నది నిజమే అయినా దేవాలయాలలో ఆయన శక్తి మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఎందుకంటే దేవాలయాలలో మంత్రోచ్చారణతో భగవంతుడి ప్రాణప్రతిష్ఠ చేస్తారు. అనేక మంది భక్తులు అక్కడ చేరి ప్రార్థనలు చేస్తారు. వీటివలన దేవాలయాలలో దైవశక్తితో నిండిన వాతావరణం నెలకొంటుంది. ఆపైన అనేకమంది సత్పురుషులు ఈ దేవాలయాలను, తీర్థ యాత్రాస్థలాలను దర్శిస్తూ ఉంటారు. వారి సందర్శనాల వల్ల ఆ క్షేత్రాలు గొప్ప ఆధ్యాత్మిక వాతావరణాన్ని సంతరించుకుంటాయి.

**శ్రీరామకృష్ణులు ఇలా చెప్పారు: "నరేంద్రుడు నన్ను, 'గుడిలో నమస్కారం చేస్తే ఏమిటి ప్రయోజనం?' అని అడిగాడు. నేను అతడితో, 'దేవాలయాన్ని చూడగానే నాకు దేవుడు గుర్తుకు వస్తాడు. ఎక్కడ మనుష్యులు భగవంతుణ్ణి స్మరించి, ఆయన మహత్తులను కీర్తిస్తారో అక్కడ ఆయన ఉంటాడు. కోటి తీర్థాలూ అక్కడే ఉంటాయి,' అని చెప్పాను" అని వివరించారు.**

## ప్రార్థన - సంగీతం

దేవునికి మొరపెట్టుకునే సమయంలో, ప్రతి భక్తుడు తన స్థాయికితగినట్టు, చక్కని సంగీతంతో భగవంతుణ్ణి వేడుకుంటాడు.

దానికి కవిత్వం, నాటకం, నృత్యం, శిల్పం, చిత్రకళ మొదలైన కళలు కూడా తోడు కావచ్చు. అన్ని లలితకళలకూ భగవంతుణ్ణి చేర్చే సామర్థ్యం ఉంది. అన్నిటికన్నా మిన్నగా సంగీతానికి ప్రార్థనతో అవినాభావ సంబంధం ఉంది.

త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, పురందరదాసు, అన్నమయ్య, మీరాబాయి, తుకారాం మొదలైన భక్తులు సంగీతంతో తమ ఆధ్యాత్మిక జీవనాన్ని పరిపుష్టం చేసుకున్నారు. పోతన లాంటి కవులు కవిత్వంతో దైవసాన్నిధ్యాన్ని పొందారు. కీర్తనలలోని సాహిత్యానికి తగిన రాగం, తాళం మేళవించబడినప్పుడు, సాధారణమైన మాటల ద్వారా చేసే ప్రార్థన కన్నా ప్రార్థించేవాడి మనస్సులోని భావాన్ని మరింత శక్తిమంతంగా ఆ సంగీతం నివేదించగలుగుతుంది. వివేకానంద స్వామి తానుగా అనేక స్తోత్రాలను రచించారు. ఆయన అనేక భక్తి గీతాలను అద్భుతంగా గానం చేసేవారు కూడా. ప్రార్థనలో, ఆధ్యాత్మిక సాధనలో సంగీతం యొక్క ప్రాముఖ్యతను ఆయన చక్కగా వివరించారు.

**భగవంతుణ్ణి నిరంతరాయంగా మనస్సులో ఉంచుకోవడానికి బహుశా అన్నిటికన్నా మేలైన మార్గం - సంగీతం! మహావిష్ణువు పరమ భక్తుడైన నారదుడితో, "నేను స్వర్గంలో ఉండను. యోగుల హృదయాలలో కూడా ఉండను. ఎక్కడైతే నా భక్తులు నా కీర్తనలను పాడుతుంటారో అక్కడ నేనుంటాను!" అని చెప్పాడు. సంగీతానికి మానవుల మనస్సు**

మీద బ్రహ్మాండమైన ప్రభావాన్ని చూపే శక్తి కలిగివుంది. అది మనిషి మనస్సుకు క్షణంలో ఏకాగ్రత చేకూర్చిపెట్టగలదు. ఈ ప్రపంచంలో మనకు కనిపించే మందబుద్ధులు, మూర్ఖులు, జంతువులలాంటి మనుష్యులు, ఒక్క నిముషం కూడా తమ మనస్సులను ఏకాగ్రం చెయ్యలేనివారు కూడా, చక్కని సంగీతాన్ని వినగానే పారవశ్యాన్ని పొంది, ఏకాగ్రతను సాధించడం కనిపిస్తుంది. చివరకు కుక్కలు, సింహాలు, పిల్లులు, పాములు, మొదలైన జంతువుల మనస్సులు కూడా సంగీతాన్ని వినగానే పారవశ్యాన్ని పొందడం మనకు కనిపిస్తుంది.

భారతదేశంలో నాటకకళను అతి పవిత్రమైనదానిగా భావిస్తారు. నాట్యం, నాటకం, సంగీతం - వీటినే ఏకంగా మతమని చెప్పేవారు కూడా ఉన్నారు. ఒక పాటలో - అది ఏదైనా కావచ్చు - ఒక ప్రేమగీతమైనా కావచ్చు, మరేదైనా కావచ్చు - మనిషి సంపూర్ణమైన హృదయంతో, (ఆత్మతో) పాడగలిగితే అతడికి ఆ క్షణమే ముక్తి లభిస్తుంది. అంతకంటే మరేమీ చేయనవసరం లేదు. ధ్యానం ఏ గమ్యానికి చేరుస్తుందో, అదే గమ్యానికి సంగీతం కూడా చేర్చగలదు.

సంగీతం అత్యున్నతమైన కళ. దానిని అర్థం చేసుకోగలిగిన వారికి అదే అత్యున్నతమైన ఆరాధన. దానిని వివరించే గ్రంథం మనలోనే ఉంది! ఓరి వెర్రివాడా! నీకు వినపడడం లేదా? నీ హృదయంలోనే రాత్రింబవళ్ళూ అనంతమైన ఆ సంగీతం వినిపిస్తోంది. "సచ్చిదానంద, సచ్చిదానంద", "సోఽహం, సోఽహం", అని అనంతంగా గానం చేస్తోంది. "సత్యం, జ్ఞానం, ఆనందం, పరబ్రహ్మం, సోఽహం, సోఽహం!" (సోఽహం అనే మాటకు అర్థం: అదే నేను! అంటే ఆ బ్రహ్మపదార్థమే నేను!)

# 8. ప్రార్థన సఫలమవ్వాలంటే!

## ప్రార్థన - స్వయంసూచన

మన మనస్సుకు ఏదైనా ఒక ఆలోచనను అందించడమే 'స్వయంసూచన.' దీనినే ఆంగ్లంలో ఆటో–సజెషన్ అంటారు. మనస్సు మాటిమాటికీ అందించే ఆలోచనలకు లొంగిపోయి, వాటికి తగ్గట్టుగా రూపొందుతుంది.

**"మీరేది ఆలోచిస్తే అలా తయారవుతారు. మిమ్మల్ని మీరు బలహీనులమనుకుంటే బలహీనులుగా తయారవుతారు, మిమ్మల్ని మీరు బలవంతుల మనుకుంటే బలవంతులవుతారు" అని స్వామీజీ చెప్పారు.**

కాబట్టి మనం రోజంతా బలాన్నిచ్చే, మంచితనాన్ని పెంచే ఆలోచనలతో మనస్సును నింపివెయ్యాలి. ఇలా స్వయంసూచన ద్వారా బలాన్ని, మంచితనాన్ని పెంపొందించుకున్న మనస్సు మరింత చక్కగా ప్రార్థించగలుగుతుంది.

## నిస్వార్థమైన ప్రార్థనల కుండే శక్తి

ప్రార్థన మన లోలోతులలో ఉన్న శక్తిని బయటకు తీస్తుంది. దాని ద్వారా మనలో నిద్రాణంగా దాగి ఉన్న శక్తులు మేలుకుంటాయి. చాలా సందర్భాలలో మనం సొంత విషయాల గురించి మాత్రమే ప్రార్థన చేస్తాము కానీ కొన్నిసార్లు ఇతరుల కోసం కూడా ప్రార్థన చేస్తాము. ఆ కొద్దిపాటి నిస్వార్థం కూడా మన మనస్సులను శుద్ధి చేస్తుంది. మనలోని 'నేను, నాది' అనే

అహంకారమమకారాలు ఎంతగా తగ్గిపోతే, మనకు అంత శాంతి, సంతోషం కలుగుతాయి. ఇతరుల కోసం ప్రార్థించడమంటే, మన సొంత కష్టాలను, దిగుళ్ళను మరచిపోయి, తోటి వారి సంక్షేమం కోసం పాటుపడడమే కదా! సాధారణంగా మనల్ని మనం మరచిపోవడమనేది చాలాచాలా అరుదుగా జరుగుతుంది. అందుచేతనే మనం ఎదుర్కొనే మానసిక ఒత్తిడి, ఆందోళనలు, మనల్ని విడిచిపెట్టిపోవు. వాటిని ఎంత గుర్తుచేసుకుంటే అవి అంత ఎక్కువైపోయి, అంత గట్టిగా మనల్ని పట్టుకుంటాయి.

**స్వామీజీ, "మీరు ఇతరుల కోసం చేసే పని ఎంత చిన్నదయినా అది మీకు అనంతమైన శక్తిని తెచ్చిపెడుతుంది!" అని చెప్పారు.**

మనం ఇతరుల కోసం చేసే సేవలతోపాటు, ప్రార్థనలు కూడా వారికి మేలు చెయ్యడమే కాక మనకు కూడా గొప్ప శక్తినిస్తాయి.

## దేనికోసం ప్రార్థిస్తే అన్నీ సిద్ధిస్తాయి?

మనం ప్రాపంచికమైన కోరికలు కోరకుండా భగవంతుణ్ణే కావాలని కోరితే, మిగిలినవన్నీ వాటంతటవే సిద్ధిస్తాయి. శ్రీరామకృష్ణులు, కేవలం భగవంతుణ్ణే కోరాలనీ, అలా కోరిన వారికి మిగిలినవన్నీ వాటంతట అవే సమకూరతాయనీ చెప్పారు. ఆయన ఇదే విషయాన్ని వివరించడానికి ఒక ఉదాహరణను కూడా చెప్పారు. ఒక జమీందారును అతడివద్ద నమ్మకంగా పనిచేసే చిన్న ఉద్యోగి తన ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. అటువంటి

చిరుద్యోగి ఇంటిలో జమీందారు స్థాయికి తగ్గ వసతులు ఉండవు కదా. అందుచేత ఆ జమీందారు తానే కొన్ని సోఫాలను, ఇతర వస్తువులను ముందుగా అతడి ఇంటికి పంపుతాడు. ఆ తర్వాత తాను అక్కడికి వెళ్తే, ఆ ఉద్యోగి జమీందారు స్థాయికి తగ్గట్టు మర్యాదలు చేయగలుగుతాడు. తద్వారా ఆ జమీందారుకు చిన్నతనంగా ఉండకుండా ఉండడమే కాక, ఆ ఉద్యోగి కూడా తన పరువు నిలుపుకుంటాడు. అదే విధంగా భగవంతుడు తన భక్తుణ్ణి కరుణించి, అతడికి సాక్షాత్కరించాలనుకున్నప్పుడు, ఆ భక్తుడికి కావలసినవన్నీ తానే సమకూరుస్తాడు. భగవంతుడే మనకు లభిస్తే మిగిలినవన్నీ వాటంతట అవే మనకు లభిస్తాయి.

రాత్రింబవళ్ళూ, "ఓ దేవా! బాధలనూ, కష్టాలనూ తొలగించ మని కోరను. బాధలూ, కష్టాలూ ఎన్ని వచ్చినా ఫర్వాలేదు. మరణం రానీ, దురదృష్టాలు రానీ, ఏమి వచ్చినా ఫర్వాలేదు కానీ ఓ దేవా! నా మనస్సు నీ చరణారవిందాల మీద నుంచి తొలగి పోకుండా చూడు. ఇదే నేను చేసే ప్రార్థన. నువ్వు నన్ను ఏ పరిస్థితి లో ఉంచినా సరే ఫర్వాలేదు. మా మనస్సు మాత్రం నిరంతరం నీ ప్రేమతో నిండివుండేలా ఆశీర్వదించు!" అని ప్రార్థించాలి.

శ్రీరామకృష్ణులు తమ అవసానదశలో గొంతు కాన్సరు వ్యాధితో బాధపడ్డారు. దాని నొప్పి భరించలేనంతగా ఉన్నప్పుడు, "ఈ శరీరం దాని రోగం, వాటి సంగతి అవి చూసుకోనీ! ఓ

మనసా! నీవు మాత్రం భగవంతుని మీదే నిలిచివుండు!” అని పాడుతూ ప్రార్థన చేసేవారు. ఇలా రెండుమూడుసార్లు పాడగానే ఆయనకు పారవశ్యం కలిగి నొప్పిని మరచిపోయేవారు.

కాబట్టి ఈ ప్రపంచంలోని కష్టాలను తట్టుకోవాలంటే, నాకు అదీ ఇదీ ఇమ్మని కానీ, అదీ ఇదీ వద్దని కానీ ప్రార్థించడం వల్ల ప్రయోజనం లేదు. అన్ని పరిస్థితులలోనూ మనస్సు భగవంతుని మీద లగ్నమై ఉన్నప్పుడే మన కష్టాలు ఈడేరతాయి.

## భగవంతుడి మనస్సును అర్థం చేసుకోవాలి!

భగవంతుడికి ఏది నచ్చుతుందో వివరించే శ్లోకాలు భగవద్గీత పన్నెండవ అధ్యాయంలో కనిపిస్తాయి. సర్వదా సంతోషంగా ఉండే వాడు, సంయమనం, దృఢనిశ్చయం, భగవదర్పితమైన మనస్సు కలవాడు భగవంతుడికి నచ్చుతాడు. ఇతర ప్రాణులకు ఉద్వేగాన్ని కలిగించకుండా, వాటివల్ల తాను ఉద్వేగం చెందకుండా, సుఖదుఃఖాలకు, భయాందోళనలకూ అతీతంగా ఉండేవాడు, ఏదీ కావాలని కోరనివాడు, పక్షపాతం లేనివాడు, వెతలను, శుభాశుభాలను పట్టించుకోనివాడు తనకు ఇష్టుడని శ్రీకృష్ణుడు పేర్కొన్నాడు. ఇటువంటి లక్షణాలను పెంపొందించుకున్నప్పుడు మన ప్రార్థనలు ఇట్టే సఫలమవుతాయి.

మనలో అహంకారమనే వంచకుడు ఉన్నంత కాలం భగవంతుని సన్నిధిలోనికి మనకు అనుజ్ఞ ఉండదు. “కాముడున్న

చోట రాముడుండడు, రాముడున్న చోట కాముడుండడు!" అని తులసీదాస్ చెప్పారు! రాత్రీ పగలూ ఒకేసారి ఎలా మనలేవో, అదే విధంగా భగవంతుడూ, కోరికలూ ఒకేచోట మనలేవు.

"ఓ దేవా! రెండు రెళ్ళు నాలుగు కాకూడదు!" – సాధారణంగా మన ప్రార్థనలన్నీ ఇలాగే వుంటాయి. మంకుపట్టుపట్టే చిన్నపిల్లవాడి ధోరణి ప్రార్థనకు పనికిరాదు.

తరచూ మన కోరికలు కామక్రోధాలతోనూ, ఈర్ష్యాసూయల తోనూ, ద్వేషప్రతీకారాలతోనూ నిండివుంటాయి. ఇటువంటి కోరికలనూ, ప్రార్థనలనూ భగవంతుడు హర్షిస్తాడా? ప్రేమ, దయ, స్నేహం, సత్యం, వినయం మొదలైన సుగుణాలకు నిలయమైన పరమాత్మున్ణి మనం ప్రార్థిస్తాము. మన దుర్గుణాల వల్ల మన మనస్సులలో రేకెత్తిన ఆలోచనలను నెరవేర్చమని దేవుణ్ణి కోరడం సరికాదు కదా! కాబట్టి, మన హృదయాలను ముక్కలు చేస్తున్న విషయాలను బాగు చెయ్యమని కోరడం కన్నా, భగవంతుడి హృదయాన్ని ముక్కలు చేసే విషయాలను కోరకుండా ఉండడాన్ని మనం ముందుగా నేర్చుకోవాలి.

## అంతటా భగవంతుణ్ణి చూడడమే అసలు పార్థన

మానవత్వంతో పరిణతి సాధించిన మనిషి ఎలా ఉంటాడో తెలుసుకోవడానికి శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణభగవానుని బోధలు గుర్తుచేసుకోవడం ఎంతైనా సమంజసం.

**"నేను జీవులందరిలోనూ వారి అంతరాత్మగా వసిస్తున్నాను. అలావున్న నన్ను పట్టించుకోకుండా మనుష్యులు నన్ను విగ్రహాలలో పూజించాలని ప్రయత్నిస్తున్నారు. సర్వభూతాలలోనూ వాటి అంతరాత్మగా, నాథుడిగా వున్న నన్ను పట్టించుకోక అజ్ఞానంతో విగ్రహాలకు మాత్రమే పూజ చేస్తే అది బూడిదలో పోసిన పన్నీరులాగా నిష్ప్రయోజనమవుతుంది. ఎవరైతే గర్వంతో, పొగరుతో, తోటి మనుష్యులలో నివసిస్తున్న నన్ను లెక్కచేయకుండా, భగవంతుడు ఎక్కడో స్వర్గంలో ఉన్నాడని భావిస్తారో, వారికి ఎప్పటికీ మనశ్శాంతి కలుగదు. ఎవరైనా తన తోటివారిని అగౌరవపరుస్తూ, హింసిస్తూ, నన్ను మాత్రం విగ్రహాలతో పూజిస్తూ, అట్టహాసంగా పూజాపురస్కారాలు చేస్తూ, నైవేద్యాలు పెడుతూ, ఉన్నట్టయితే అటువంటి వారి పూజలకు నేను ఏమాత్రం సంతోషించను. అయితే, ఒక మనిషి తన కర్తవ్యాలను నిష్ఠతో నిర్వర్తిస్తూ, అన్ని జీవులనూ ప్రేమిస్తూ, ఆపైన నన్ను విగ్రహాలలో కొలుస్తూ ఉండవచ్చు. అతడు అలా చేయడం వల్ల క్రమంగా, నేను తన హృదయంలోనే ఉన్నాననీ, సర్వచరాచరసృష్టిలోనూ ఉన్నాననీ తెలుసుకుంటాడు."**

మన పనులవల్ల లోకానికి శ్రేయస్సు కలగాలి. అదే నిజమైన ఆరాధన. అన్యాయంగా సంపాదించిన సొమ్ముతో గుడిలో విగ్రహానికి బంగారు కిరీటం చేయించి ఇస్తే భగవంతుడు సంతోషించడు. ఒక మనిషి చేసే అవినీతివల్ల అసంఖ్యాకులైన తన బిడ్డలు కష్టాలపాలవుతూ ఉంటే భగవంతుడు మెచ్చుతాడా?

## దేనికోసం ప్రార్థించకూడదు?

మనం బిచ్చగాళ్ళలాగా ప్రవర్తించడం మానివెయ్యాలి. ఒక రాజాధిరాజు సమక్షానికి ఒక బిచ్చగాణ్ణి ఎప్పటికీ అనుమతించరు. గంగానది ఒడ్డున ఉండి కూడా మురికిగుంటలో నీరు తాగాలనుకున్నట్టు, వజ్రాలగనిని పక్కనబెట్టుకుని రంగురాళ్ళు ఏరుకున్నట్టు, ప్రవర్తించకూడదు. మనలో 'నేను' అనే వంచకుడు (అహంకారం) మాటిమాటికీ తిరుగుబాటు చేస్తూ ఉంటాడు. అందువల్లనే మనం అదీయిదీ కావాలనీ, ఇతరుల కన్నా నేను ఉన్నతస్థితికి వెళ్ళాలనీ, అందరికన్నా నాకే ఎక్కువ కావాలనీ కోరుతూ, ఆ కోరికలు తీరీ, తీరకా నానాబాధలూ పడుతూ ఉంటాము. దీనినిబట్టి అర్థమయ్యేదేమిటంటే, ఆ అహంకారం వలనే మనం ఇలా బిచ్చమెత్తుకునే స్థితికి దిగజారుతూ ఉంటాము. మనలోని ఆత్మను తెలుసుకుని, మన దైవస్వభావాన్ని నిరంతరం తలచుకోవడమే దీనికి విరుగుడు. ఎన్ని గడ్డు పరిస్థితులు ఎదురైనా, మన మీద, దైవం మీద, విశ్వాసాన్ని కోల్పోకూడదు. ఈ విశ్వాసాన్ని కలిగివుండడమనే మార్గం చాలా కష్టాలతో కూడుకుని ఉన్నది. దాన్ని 'అసిధారావ్రతం' అంటే 'కత్తి మీద సాము'తో పోల్చవచ్చు. అయితే, ప్రయత్నలోపం లేకుండా పని చేసిన వాడికే అంతోయింతో ఫలితం దక్కుతుందన్న విషయాన్ని మనం ఎప్పటికీ మరచిపోకూడదు.

ప్రాపంచికమైన విషయాలను కోరుతూ ప్రార్థించాలనే ఆలోచన కలిగిన మరుక్షణం ఆ స్వభావాన్ని తుంచివేయాలి. “నీ సంకల్పమే నెరవేరుతుంది ప్రభూ!” అని మనస్సులో బలంగా అనుకోవాలి! “ఓ దేవా! నువ్వు నాకు ఇదీ అదీ ఇస్తే, నీవు నిజంగా కరుణామయుడివని నేననుకుంటాను!” అనవద్దు. మనం కనుక అలా మాట్లాడితే ఆయన శక్తిని చిన్నబుచ్చినట్లే కదా! వ్యాపారం ఎన్నటికీ మతం కాబోదు. ఒక ప్రేమికుడు ఎన్నటికీ ఆ భాషలో మాట్లాడలేడు. యూదుల పవిత్ర దేవాలయ ప్రాంగణంలో నుంచి వ్యాపారులందరినీ ఏసుక్రీస్తు తరిమేశారు. ఎందుకంటే దేవాలయం వ్యాపారం చేసుకునే చోటు కాదు. ఆయన వారితో, “దేవుడికి చెందిన ఈ పవిత్రస్థలాన్ని మీరు దొంగలకూ, దోపిడీ దారులకూ నిలయంగా చేసేశారే!” అన్నారు (మాథ్యూ 21:21).

సర్వశక్తిమంతుడైన భగవంతుడికి మన అవసరాలేమిటో, మనకేది మంచిదో తెలియదా? మనకేది శ్రేయస్కరమో ఆయనకు తెలియదా? పరమాత్మ సంకల్పంతో, మన సంకల్పాన్ని ఏకం చేయగలిగినప్పుడు, అన్ని రకాల కలతలూ తొలిగిపోయి, ఎడతెగని మనశ్శాంతి కలుగుతుంది.

చాలాసార్లు మహాత్ములైనవారు అంతటి మనశ్శాంతితో ఎలా జీవించేవారోనని మనకు ఆశ్చర్యం కలుగుతుంది. ఆ మహాత్ములు చేదు అనుభవాలను ఎదుర్కోవలసి వస్తుందేమోనని ఎప్పుడూ

దిగులుపడలేదు. ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి మనిషీ ఎంతో కొంత చేదు తినక తప్పదు. కానీ మహాత్ములైన వారు ఆ పనిని సంతోషంగా చేశారు. ఎందుకంటే వారికి భగవంతుడి సంకల్పం పైన పరిపూర్ణమైన విశ్వాసం ఉంది కాబట్టి.

డబ్బు కావాలని మనం ఎందుకు కోరాలి? జీవితంలో డబ్బే సర్వస్వమా? డబ్బు ఈ రోజు ఉంటుంది, రేపు పోతుంది. ఏసుక్రీస్తును గురించి, మోసెస్ గురించి, బుద్ధుణ్ణి గురించి ఆలోచించినప్పుడు వాళ్ళ దగ్గర ఆంద్రూ కార్నెగీ లాగానో, రాక్‌ఫెల్లర్ లాగానో డబ్బు ఉండడాన్ని మనం ఊహించగలమా? అలా వారు డబ్బు పోగుచేసి ఉంటే మహాత్ములయ్యేవారా?

అదే విధంగా ఆరోగ్యం కూడా. ఆరోగ్యం కావాలని మనం ఎందుకు ప్రార్థించాలి? ఆరోగ్యం ఎల్లకాలం ఉండదు. మానవ జన్మ కావాలని కోరుకుంటే, దానితోపాటు వచ్చిపడే వాటన్నింటినీ అంగీకరించి తీరవలసిందే! మీ తలనొప్పి తగ్గాలని దేవుడికి ప్రార్థన చెయ్యడం ఎందుకు? మీకు ఎంతకాలం తల ఉంటుందో, అంత కాలం తలనొప్పులు తప్పవు, ఎంతకాలం పళ్ళు ఉంటాయో, అంతకాలం పిప్పిపళ్ళూ, పంటినొప్పులూ తప్పవు!

## కష్టాలకు వెరువని ప్రార్థన

**విపదః సంతు నః శశ్వత్ తత్తత్ జగద్గురో ।**
**భవతో దర్శనం యత్ స్యాదపునర్భవ దర్శనమ్ ॥**

పాండవుల తల్లి కుంతీదేవి ఇలా ప్రార్థించింది: "జగద్గురువైన ఓ శ్రీకృష్ణా! మేము ఎల్లప్పుడూ ఆపదలలో ఉండేటట్లు చూడు! అప్పుడే నిత్యం నిన్ను గుర్తు చేసుకుంటూ ప్రార్థిస్తాము. అందువలన నీ దర్శనభాగ్యం మాకు కలుగుతుంది. నీ దర్శనం పునర్జన్మ లేకుండా చేస్తుంది కదా!"

కుంతీదేవి తనను ఎల్లప్పుడూ కష్టాలలోనే ఉంచమని శ్రీకృష్ణుణ్ణి వేడుకుంది. ఇలా కష్టాల కోసం ప్రార్థన చెయ్యడం మనకు వింతగా కనిపించవచ్చు కానీ, ఆమె చేసిన ప్రార్థనలో ఒక నిగూఢమైన అర్థం ఉంది. దానివల్ల తాను ఎప్పటికీ భగవంతుణ్ణి మరచిపోకుండా ఉంటుందని ఆమె భావం. నిజానికి ఆమె ఉద్దేశ్యం భగవంతుణ్ణి నిరంతరమూ మననం చెయ్యడమే. పైగా మానవులకు దుఃఖాలు, బలహీనతలు అనివార్యమన్న సత్యాన్ని కుంతీదేవి తన ప్రార్థనలో అంగీకరిస్తోంది.

**శ్రీరామకృష్ణసంఘ అధ్యక్షులలో ఒకరైన విరజానంద స్వామి ఎలా ప్రార్థన చెయ్యాలో వివరించారు: "మన హృదయంలో కలిగే తీవ్రమైన ఆవేదనను, వ్యాకులతను ఏదైనా ఉదాత్తమైన ఆలోచన ద్వారా, మాటలద్వారానైనా, మౌనంగానైనా పరమాత్మకు, పరమేశ్వరునికీ తెలియజేసి, దానిని తొలగించడానికై చేసే వేడుకోలునే ప్రార్థన అంటారు. కామరహితమైన ప్రార్థన ఎలా ఉంటుందో చూడండి: 'ఓ ప్రభూ! నా భుజాలమీద నీవు కోరినంత బరువును మోపు! నీకు ఇష్టమైనన్ని దుః ఖాలను నాకు ఇవ్వు! నన్ను ప్రమాదంలోకి నెట్టివెయ్యి! ఇవేవీ నన్ను ఇబ్బంది**

**పెట్టలేవు. కానీ ఓ ప్రభూ! నాకు తగినంత బలాన్నీ, స్థైర్యాన్నీ ప్రసాదించు! వాటి ద్వారా నేను దేనికీ చలించిపోకుండా, నిన్ను మరచిపోకుండా, నిరంతరం నీ పాదపద్మాల పట్ల శుద్ధభక్తిని కలిగివుండేలా ఆశీర్వదించు! ఆ భక్తే అన్ని భయాలనూ పారద్రోలుతుంది కదా!' ఆకలితో అలమటిస్తున్న వాడు అన్నం కోసం తహతహలాడుతున్నట్లు - భగవంతుడు కావాలనే ఆకలితో - ఉండండి. ఆయన ప్రేమరూపాన్ని చూపమని హృదయ పూర్వకంగా విలపించండి. ఆయన లేని జీవితం దుర్భరమన్నట్టు, ఆయన కోసం పిచ్చిగా విలపించండి. తన భక్తుడి బాధను అర్థం చేసుకునే వాడు భగవంతుడి కన్నా ఎవడున్నాడు? భగవంతుడి కన్నా మనకు సొంతమైన వాడు ఎవడున్నాడు? నూరు పాపాలు చేసినవాణ్ణైనా ఆయన క్షమించి తన ఒడిలోకి తీసుకుని ప్రేమగా ఆలింగనం చేసుకుంటాడు. ఆయన ప్రేమను అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. ఆయనను ఏదీ బంధించలేదు. ఆయన అనంతామృతానంద సాగరుడు. ఆ సాగరంలోకి దూకితే మీరు కూడా అమృతత్వాన్ని పొందుతారు. పంచదార పాకంలో తేలుతున్న రసగుల్లాల్లాగా మీరు కూడా ఆ ఆనందసాగరంలో ఈదుతారు."**

## నిజంగా పనిచేసే ప్రార్థనలు ఏవి?

ఒక ప్రత్యేకమైన ఫలితాన్ని కోరకుండా చేసే ప్రార్థనలు, ఏదో ఫలితాన్ని కోరే ప్రార్థనల కంటే ప్రభావకరంగా పనిచేస్తాయి. ఎందుకంటే, ఏది తనకు మంచి చేస్తుందో మనిషికి తెలియదు. ప్రత్యేకంగా ఫలానా ఫలితం కావాలని కోరే ప్రార్థన దాని ప్రభావాన్ని పరిమితం చేస్తుంది.

ఈ విషయాన్ని వివరిస్తూ సోక్రటీస్, "మనం అందరి మేలుకోరి ప్రార్థన చెయ్యాలి. ఎందుకంటే మనకేది మేలు చేస్తుందో భగవంతుడికి తెలుసు కదా!" అని చెప్పాడు.

మనిషి మంచి కోసం ఎలా ప్రార్థన చేస్తాడో, చెడు కోసం కూడా అలాగే ప్రార్థన చేస్తాడు. ఎందుకంటే మనిషికి తొందరపాటు ఎక్కువ. ఇందుచేతనే, మన ప్రార్థనలలో చాలా భాగం నిష్ఫల మవుతూ ఉంటాయి. అత్యుత్తమమైన పద్ధతి ఏమిటంటే, "ఓ ప్రభూ! నీ సంకల్పమే నెరవేరుతుంది కానీ నాది కాదు!" అనడమే.

## అమ్మకు చేసే ప్రార్థనలు

భగవంతుణ్ణి మన తల్లిగా భావించి చేసే ప్రార్థన తండ్రి రూపంగా భావించి చేసే ప్రార్థన కన్నా ఎక్కువ ప్రభావకరం. ఎందుకంటే, అమ్మ దగ్గర మనకు చనువు ఎక్కువ. తండ్రి అంటే సాధారణంగా కొంత భయం ఉంటుంది. తల్లి దగ్గర మనం అనుకున్నది చెప్పి, అవసరమైతే మారాము చేసి మరీ అడిగినది సాధించుకుంటాము. ఇదే పద్ధతి దేవుడి విషయంలో కూడా వర్తిస్తుంది. భగవంతుణ్ణి అమ్మ రూపంలో కోరడం ద్వారా మనం కోరినవి త్వరగా సిద్ధిస్తాయని శ్రీరామకృష్ణులు చెప్పారు.

# 9. ప్రార్థన ద్వారా పరివర్తన

## ప్రార్థన - సంకల్పశక్తి

ప్రార్థన సంకల్పశక్తిని మేలుకొలిపే సాధనంగా పనిచేస్తుంది. సంకల్పశక్తి లేకుండా మనిషి జీవితంలో ఏమీ సాధించలేడు. సంకల్పశక్తి వల్లనే మనం జీవితంలో ఎదురయ్యే విషాదాలను తగ్గించుకుని, వాటినుంచి కొంతవరకైనా తప్పించుకోగలుగుతున్నాము. మరి ఈ సంకల్పశక్తి అంటే ఏమిటి, దాన్ని పెంపొందించుకోవడానికి మార్గం ఏమిటి?

మనస్సు, ఆత్మల సమ్మేళనమే సంకల్పశక్తి. ఆత్మ అనే మాటకు ప్రత్యామ్నాయాలుగా దైవం, పరమాత్మ అని కూడా చెప్పుకోవచ్చు. ఆత్మ యొక్క ఊతాన్ని కలిగిన ఈ సంకల్పశక్తి మనం చెయ్యవలసిన పనిని పట్టుదలతో సాధించేందుకూ, చెయ్యకూడని పనిని దృఢనిశ్చయంతో మానివేసేందుకూ, తోడ్పడుతుంది.

స్వతహాగా, మనస్సు విషయాల వెంట పరుగులు తీస్తుంది. అయితే దాన్ని సంకల్పశక్తితో అదుపుచేసి, ఏ పని చెయ్యాలో అది చేసేలాగా, చెయ్యకూడని పనిని మానివేసేలాగా మనం మనస్సుకు అభ్యాసాన్ని ఇవ్వాలి. అంటే మనలోని ఆత్మశక్తిని మాటిమాటికీ స్మరించడం ద్వారా మనలోని సంకల్పశక్తిని మరింత బలవత్తరం

చేసుకోవచ్చు. అంటే ఆత్మను, దానికే మరో రూపమైన భగవంతుణ్ణి, నిరంతరం గుర్తుకు తెచ్చుకోవడంతోపాటు దానికున్న అనంతశక్తిని గురించి ఆలోచించడం ద్వారా, మరొక మాటలో చెప్పాలంటే దానిని ప్రార్థించడం ద్వారా, మన సంకల్పశక్తి పెరుగుతుంది!

ఆ విధంగా ప్రార్థనకూ, సంకల్పశక్తికీ గొప్ప అవినాభావ సంబంధం ఉంది. దేవుడికి ప్రార్థన చేసే కొద్దీ మన సంకల్పశక్తి పెరుగుతుంది. మన ప్రవర్తన మారుతుంది. తద్వారా మనం చేసే పనులన్నీ విజయవంతమవుతాయి.

## ప్రార్థన - స్వప్రయత్నం

ఒకడు తనకు లాటరీ తగిలేలా చెయ్యమని దేవుణ్ణి వేడుకున్నాడు. "స్వామీ! ఈ ఆదివారమే డ్రా తీస్తారు! ఒక్క వారం నాకు తగిలితే చాలు! మళ్ళీ నిన్ను వేధించను!" అంటూ మొరపెట్టుకున్నాడు. రోజులు యుగాలలాగా వేచిచూసిన ఆదివారం వచ్చింది, పోయింది, కానీ లాటరీ తగలలేదు. మళ్ళీ సోమవారం నుంచీ ప్రార్థన మొదలు పెట్టాడు. మళ్ళీ ఆదివారం వచ్చింది, పోయింది – లాటరీ మాత్రం తగలలేదు. ఈసారి నిట్టూర్పులతో, వెక్కిళ్ళతో, ఆక్రందనలతో నిండిన ప్రార్థనలు కొనసాగాయి. ఇంకో ఆదివారం వచ్చిపోయింది, లాటరీ మాత్రం తగలలేదు. ఇక సోమవారం ఏడుపు మొదలుపెట్టగానే ఏకంగా

దేవుడే ప్రత్యక్షమయ్యాడు. "ఒరేయ్ మూర్ఖుడా! ఈసారైనా ఒక లాటరీ టికెట్టు కొని పుణ్యం కట్టుకో!" అన్నాడు.

**"నిజంగా, చిత్తశుద్ధితో ప్రయత్నం మొదలుపెడితే సహాయం దానంతట అదే వస్తుంది. అలా ఉద్యమించనంత వరకూ దేవుడు కూడా మనకు సహాయపడడు" అని శ్రీరామకృష్ణులు ఉద్బోధించారు.**

ఈ సత్యం ఆధ్యాత్మిక విషయాలలోనే కాక ప్రాపంచిక జీవితంలో కూడా చక్కగా పనిచేస్తుందని గమనించాలి. పైగా, మనమే చేసుకోగలిగిన పనులకు వేరేవారి మీద ఆధారపడడం, అది దేవుడైనా సరే, ఎంతవరకూ సబబు?

సెయింట్ ఆగస్టీన్ ప్రార్థనను గురించి చెపుతూ, "అంతా దేవుడి మీద ఆధారపడిందన్న భావనతో ప్రార్థన చెయ్యండి. అంతా మీమీదే ఆధారపడిందన్న భావనతో పనిచెయ్యండి!" అని చెప్పారు. స్వప్రయత్నం చెయ్యడానికి సిద్ధపడని వాడి ప్రార్థనలను దేవుడు పట్టించుకోడు. ప్రార్థనలో స్వప్రయత్నం ఒక భాగం.

**స్వామీజీ ఇలా చెప్పారు: "ప్రార్థనను అనేక విధాలుగా చేయవచ్చు. పెదవులతో చేసే ప్రార్థన కన్నా చేతులతో చేసే ప్రార్థనే మరింత ఉన్నతమైనది. దానికే మనల్ని మరింతగా ఉద్ధరించగలిగే శక్తి ఉంది." మన స్వశక్తి మీద ఆధారపడి పనిచేయడమే మరింత ఉన్నతమైన ప్రార్థన కాగలదని స్వామీజీ బోధ.**

ఫ్రెడెరిక్ డగ్లస్ అనే బానిస చెరనుంచి పారిపోయాడు. అలా పారిపోయి స్వతంత్రుడైన తర్వాత ఇలా చెప్పాడు. "నేను నోటితో

ఇరవై ఏళ్ళు ప్రార్థన చేసినా ఫలితం దక్కలేదు. నా కాళ్ళతో ప్రార్థన చేయడం మొదలుపెట్టినపుడు నాకు సమాధానం లభించింది!" అంటే నోటితో ఎంత వేడుకున్నా స్వాతంత్ర్యం రాలేదు కానీ, స్వప్రయత్నంతో కాళ్ళకు బుద్ధి చెప్పి పారిపోయినప్పుడు స్వాతంత్ర్యం వచ్చిందని అతడి ఉద్దేశ్యం.

## ప్రార్థన - నడవడిక

ప్రార్థన మంచితనాన్ని పెంచుతుంది. మనల్ని నిజమైన ఆధ్యాత్మిక వ్యక్తులుగా మలుస్తుంది. ప్రార్థన భగవంతుడి మనస్సును మార్చదు కానీ ప్రార్థించేవాడి మనస్సును మారుస్తుంది!

ఇది కావాలనో, అది కావాలనో మనం భగవంతుడి దగ్గరకు వెళతాం. ఇలా కష్టాలు కలిగినప్పుడు మాత్రమే భగవంతుడి దగ్గరకు పరుగెత్తే వారు నిజమైన భక్తులు కారు. నిజమైన భక్తి లేనివారిని శ్రీరామకృష్ణులు ఈగలతో పోలుస్తూ, ఇలా అన్నారు: "ఈగ కొన్నిసార్లు పిండివంటల మీద వాలితే, కొన్నిసార్లు పెంట కుప్పల మీద వాలుతుంది. నిజమైన భక్తులు తేనెటీగలలాంటి వారు. తేనెటీగ ఎప్పుడూ పూలలో నుంచే మకరందాన్ని గ్రోలుతుంది తప్ప పూలను విడిచి వేరే చోటికి వెళ్ళదు."

అదే విధంగా నిజమైన భక్తుడు తన సుఖశాంతుల కోసం భగవంతుణ్ణే ఆశ్రయిస్తాడు. ప్రాపంచికులైన మనుష్యులు వేటికి విలువ ఇస్తారో వాటినన్నింటినీ నిజమైన భక్తుడు లెక్కచేయడు.

వేదాంతం మనిషికి నాలుగు ఆదర్శాలు - చతుర్విధ పురుషార్థాలు - ఉన్నాయని బోధిస్తుంది. అవి ధర్మం, అర్థం, కామం, మోక్షం. దీనిని బట్టి చూస్తే అర్థం (డబ్బు), కామం (కోరికలు) కూడా మనిషికి పొందదగిన ఆదర్శాలే. అయితే అవి ధర్మానికి లోబడి ఉండాలని చెప్పబడింది. అంటే డబ్బు కోసం, కోరికలు తీర్చుకోవడం కోసం మనం చేసే ప్రయత్నాలు ధర్మబద్ధంగా ఉండాలి. "సొంత లాభము కొంత మానుకు, పొరుగువారికి తోడు పడవోయ్" అన్నట్టు ప్రవర్తించాలి. **"మంచిగా ఉండడం, మంచిని చెయ్యడం - ఇదే మతంలోని సారాంశం!"** అని స్వామీజీ చెప్పారు. మనం చేసే ప్రార్థనలలో మన మంచితనం వ్యక్తమవ్వాలి. అంటే మనం బయటకు వినిపించేలా ప్రార్థన చెయ్యాలని కాదు, మనం ప్రార్థన చేసేటప్పుడు మన మనస్సు పవిత్రతతో నిండివుండాలి.

మనం ఏ కొద్దిపాటి ప్రయత్నం చేసినా, ఏ కొద్దిపాటి సంయమనాన్ని పాటించడానికి ప్రయత్నించినా, ఏ కొద్దిపాటి ప్రార్థనను సాధన చేసినా, భగవంతుడి కోసం ఎంత కొద్దిగా అన్వేషణ చేసినా, దానికి ప్రతిగా మనకు గొప్ప శక్తిని ఇవ్వడానికి భగవంతుడు ఎంతో ఆతురతతో ఎదురుచూస్తూ ఉంటాడు. జీవితంలో ఆయన మనకు నిర్దేశించిన లక్ష్యాల మీద మనం శ్రద్ధ చూపిస్తే భగవంతుడు మనల్ని శక్తితో నింపివేస్తాడు.

నిజానికి మనలో చాలామంది చాలా మంచి ఉద్దేశ్యంతో ప్రార్థన చేస్తాము. కానీ ప్రవర్తనలో, రోజువారీ జీవితంలో దాన్ని ఆచరణలో పెట్టలేక పోతాము. ఒక్కొక్కసారి మనం దురుసుగా ప్రవర్తించి, ఇతరులతో మన సంబంధబాంధవ్యాలను పాడు చేసుకుంటాము. తరువాత తప్పుచేశామని, పశ్చాత్తాపంతో మన గోడును దేవుడి ముందు వెళ్ళబోసుకుంటాము. కానీ మన ప్రవర్తనలో మార్పు తీసుకురావడానికి అహం అడ్డువస్తుంది. ఒక్కసారి ఆలోచించండి – మనం చేసే అటువంటి ప్రార్థనలను, మన ప్రవర్తన వలన బాధ పడినవారు వినగలిగితే భగవంతుడి మీద భారం చాలావరకూ తగ్గిపోతుంది కదా!

ప్రార్థనల ద్వారా మనిషి అంతకుముందు తానెన్నడూ కలవని ఒక సత్పురుషుణ్ణి పరిచయం చేసుకుంటాడు. అది ఎవరో ఆకాశంలో కూర్చున్న దేవుడు కాడు – తానే!

## ప్రార్థన - గ్రహదోషాలు, ప్రారబ్ధం

**గ్రహదోషంబులు దుర్నిమిత్తములు నీ కళ్యాణనామంబు ప్ర**
**త్యహమున్ బేర్కొను నుత్తమోత్తముల బాధంబెట్టగా నోపునే!**
**దహనుంగప్పఁజాలునే శలభసంతానంబు? నీ సేవచే**
**సి హతక్లేశులుగారు గాక మనుజుల్ శ్రీకాళహస్తీశ్వరా!**

**(కాళహస్తీశ్వర శతకం)**

ఓ కాళహస్తీశ్వరా! రాత్రింబవళ్ళూ కళ్యాణప్రదమైన నీ నామాన్ని తలచుకునేవారిని గ్రహదోషాలు, దుర్ముహూర్తాలు బాధ పెట్టగలుగుతాయా?

మిడతలు ఎన్ని వచ్చి పడినా కార్చిచ్చు ఆరిపోతుందా? నీ సేవ చేసిన వారు క్లేశాలలో ఎంతమాత్రం పడరు.

మనలో చాలామందికి ఆ దేవదేవుడి కంటే శని, రాహువు, కేతువు లాంటి చిల్లరదేవుళ్ళ మీదే ఎక్కువ గురి ఉంటుందేమో! అయితే, గ్రహనక్షత్రాలనన్నింటినీ అదుపు చేసేవాడు భగవంతుడే కదా? విశ్వం మొత్తానికీ అధినాయకుడైన సర్వేశ్వరుణ్ణి నమ్మిన వారికి కష్టాలెలా వస్తాయి? కాబట్టి, భగవంతుడికి చేసే ప్రార్థన మన గ్రహగతులను మార్చివేయగలదని మనం తెలుసుకోవాలి.

**వివేకానంద స్వామి ఇలా బోధించారు: "మనం గ్రహబలాల అదుపులో ఉండవచ్చు గాక. కానీ మనం దాన్ని పట్టించుకోనవసరం లేదు. ఎన్ని గ్రహాలు లేదా నక్షత్రాలు మన మీదకు వస్తాయో అన్నింటినీ రానివ్వండి. ఎందుకంటే, ఒక నక్షత్రం వల్లనే మన జీవితం తల్లక్రిందులయ్యేటట్లు ఉంటే, అటువంటి జీవితం ఉన్నా ఒకటే, పోయినా ఒకటే. ... గ్రహదోషాల గురించి ఆలోచించడం బలహీనమైన మనస్సు గలవారు చేసే పని. అటువంటి ఆలోచనలు కనుక మన మనస్సులలో ఎక్కువవుతుంటే వైద్య సలహాతో పాటు మంచి ఆహారం, విశ్రాంతి తీసుకోవడం మేలు."**

పావనజనని శ్రీశారదాదేవిని, "అమ్మా! జపం వల్ల ప్రయోజన మేమిటి?' అని అడిగారు. దానికి సమాధానంగా, "నాయనా! జపం వల్ల కర్మప్రభావం తగ్గిపోతుంది. నీకు బహుశా నాగలి గుచ్చుకున్నంత దెబ్బ తగలాలని రాసిపెట్టి ఉంటే, జపశక్తి వల్ల

అది ఒక సూది గుచ్చుకున్నంత దెబ్బతో సరిపుచ్చుకుంటుంది" అని చెప్పారు. జరగబోయే దానినే తీసెయ్యలేము కానీ జపం, ప్రార్థనల ద్వారా దాని ఫలితాన్ని చాలావరకూ తగ్గించి వెయ్యవచ్చు.

## ప్రార్థన - వివాహం, సంతానం

భారతీయ సంస్కృతి అనాదిగా ఎన్నో ఒడుదొడుకులకు తట్టుకుని, అనంతమైన జీవనదిలా సాగిపోతోంది. భారతీయులు జీవితంలో అన్ని పనులనూ భగవంతుడి అర్చనగా భావించి చేస్తారు. భారతీయవివాహంలో ప్రార్థన ప్రాముఖ్యతను గురించి వివేకానంద స్వామి ఇలా చెప్పారు.

**హిందూ భావజాలంలో స్త్రీ సాధించే మహత్కార్యం తల్లి కావడమే. మా తల్లిదండ్రులు నేను పుట్టాలని సంవత్సరాల తరబడి ఉపవాసాలు, ప్రార్థనలు చేశారు. హిందువులు ప్రతి శిశువు కోసం ఇలాగే ప్రార్థనలు చేస్తారు. మన స్మృతికర్త అయిన మనువు, "ఎవడైతే ప్రార్థన ద్వారా పుడతాడో వాడే ఆర్యుడు!" అన్న నిర్వచనాన్ని ఇచ్చాడు. మనువు చెప్పిన దాని ప్రకారం ప్రార్థన ద్వారా జన్మించని ప్రతిబిడ్డ యొక్క పుట్టుక అక్రమమైనదే. ప్రపంచానికి మేలుచేసే సుగుణవంతులైన పిల్లల కోసం ప్రార్థన చెయ్యాలి! అజాగ్రత్తగా ఉన్న క్షణంలో, అలా జరగకుండా ఆపలేకపోవడం వల్ల తయారై, నానా శాపాలూ తింటూ, ఈ ప్రపంచంలోకి జారివచ్చే సంతానం నుంచి మీరు ఏమి ఆశించగలరు?**

మన ఇతిహాసాలలోని ప్రహ్లాదుడు, అష్టావక్రుడు, అభిమన్యుడు

మొదలైనవారు తల్లి గర్భంలో ఉండగానే విద్యను అభ్యసించారు. తల్లి చేసే ఆలోచనలు, వినే శబ్దాలు, మాటల నుంచి శిశువు నేర్చుకుంటుందని హిందువులు భావిస్తారు. ఈ విషయాన్ని గురించి వివేకానంద స్వామి ఇలా చెప్పారు.

**బిడ్డ పుట్టుకకు మునుపు గర్భంలో ఉండగానే అతడు నేర్చుకోవడం మొదలుపెడతాడనీ, అప్పటినుంచే తన చుట్టూవున్న పరిస్థితులవల్ల ప్రభావితుడవుతాడనీ భారతదేశంలో అనాదిగా నమ్ముతున్నారు. ఈనాటి ఆధునికవిజ్ఞానం కూడా దాన్ని ధ్రువీకరిస్తోంది.** ***(గత నూరేళ్ళలో ఈ విషయాన్ని ధ్రువీకరించే మరిన్ని శాస్త్రీయ పరిశోధనలు జరిగాయి.)*** **అందువల్ల ఆధునిక విజ్ఞానశాస్త్రం, మతం - ఈ రెండూ కూడా 'మిమ్మల్ని మీరు పవిత్రంగా ఉంచుకోండి!' అని చెపుతున్నాయి. ఈ భావన భారతీయులలో ఎంతగా పాతుకుపోయిందంటే, ప్రార్థన ద్వారా ఏకం కాని వివాహం కూడా అక్రమమేనని చెపుతారు. అందువల్ల నేను, నిజానికి అందరు హిందువులూ, తమ తల్లి అతి పవిత్రురాలని భావిస్తారు. ఈ జాతి గొప్పతనపు రహస్యం - సత్ శీలమే.**

**మనం మన జాతిని ఆర్యజాతి అని పిలుస్తాము. ఆర్యుడంటే ఎవరు? ఎవరు ప్రార్థన ద్వారా జన్మిస్తాడో అతడే ఆర్యుడు. ఈ విషయం మీకు విచిత్రంగా తోచవచ్చు కానీ, ..ఒక మనిషి తప్పనిసరిగా ప్రార్థన ద్వారా జన్మించాలి. నేను పుట్టక మునుపు, మా అమ్మ నా కోసం అంతులేని ప్రార్థనలు, వ్రతాలు చేసింది. నేనయితే వాటిని ఐదు నిమిషాలు కూడా చేయలేను. (ఎందుకంటే అవి ఎంత కష్టమైనవి!) అయితే ఆమె ఆ వ్రతాలను రెండు సంవత్సరాల పాటు విడువకుండా చేసింది. అందువల్లనే**

**నాకు ఈనాడు అబ్బిన ఆధ్యాత్మికత అంతా మా అమ్మ నుంచి వచ్చినదే అని నేను రూఢిగా చెప్పగలను. మా అమ్మ నా గురించి ఎన్నో ప్రార్థనలు చేసి, తనకు ఫలానా సద్గుణాలు ఉన్న కొడుకు కావాలని కోరుతూ, మెలకువతో, ఉద్దేశ్యపూర్వకంగా నన్ను ఈ ప్రపంచంలోకి తీసుకువచ్చింది. నాలో ఏమైనా మంచి ఉంటే అది మా అమ్మ నాకు ఇచ్చినదే - ఆమె సచేతనంగా అలా చేసిందే కానీ చేతనారహితంగా కాదు సుమా!**

## ప్రార్థనా ఫలాలు ఎలా ఉంటాయి?

పదమూడవ శతాబ్దానికి చెందిన మెథిల్డ్ ఆఫ్ మాగ్డెబర్గ్ (Mechthild of Magdeburg) అనే జర్మన్ యోగి ఇలా చెప్పాడు. "మనిషి తన శక్తినంతా ఉపయోగించి చేసే ప్రార్థనకు గొప్ప శక్తి ఉంటుంది. చేదుతనంతో నిండిన హృదయాన్ని అది మధురంగా మార్చగలదు. దుఃఖభరితమైన హృదయాన్ని సంతోషంతో నింపగలదు. పేద హృదయాన్ని సౌభాగ్యవంతం గానూ, అజ్ఞానపు హృదయాన్ని జ్ఞానభరితంగానూ, పిరికి హృదయాన్ని సాహసోపేతంగానూ, రోగగ్రస్థమైన హృదయాన్ని ఆరోగ్యవంతం గానూ చెయ్యగలదు. అది దేవుణ్ణి మన చిన్న హృదయంలోనికి దిగివచ్చేలా చేసి, వ్యాకులతతో ఆకలిగొన్న జీవాత్మను భగవంతుని యొక్క పరిపూర్ణతలోకి ఎగబ్రాకేలా చేస్తుంది. ఆ విధంగా పరమాత్మ, జీవాత్మ అనే ఇరువురు ప్రేమికుల్ని ఒకటి చేసి, ఆ అద్భుత యోగంలో వారిరువురూ ప్రేమభాషలు మాట్లాడుకునేలా చేస్తుంది."

శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్షశిష్యులైన శ్రీ తురీయానంద స్వామి ఈ కథను చెప్పారు. "ఒకసారి జబల్‌పూర్‌నుంచి ఒక పెద్దమనిషి గురుదేవులను చూడడానికి వచ్చాడు. ఆయన పండితుడు, ఎమ్.ఏ. చదివాడు. చాలా నిక్కచ్చిగా మాట్లాడే స్వభావం కలవాడు. కానీ అతడికి దేవుడి మీద నమ్మకం లేదు. గురుదేవులతో చాలాసేపు చర్చించాడు. అతడి మనస్సులో ఎంతో కలత ఉన్నప్పటికీ, అతడు దేవుడికి ప్రార్థన చెయ్యడానికి సిద్ధంగా లేడు. ఎందుకంటే అతడి ఉద్దేశ్యంలో దేవుడున్నాడన్న దానికి ఏ ఋజువూ లేదు. శ్రీరామకృష్ణులు అతడితో, "సరే! నేను చెప్పినట్టు చెయ్యవచ్చు కదా! 'ఓ భగవంతుడా! నువ్వు నిజంగా ఉంటే కనుక, నా ప్రార్థన విను!' అంటూ ప్రార్థన చెయ్యడానికి నీకు అభ్యంతరం ఉండదనుకుంటాను" అన్నారు. ఆ పెద్దమనిషి ఒక నిముషం ఆలోచించి, అలా ప్రార్థన చెయ్యడానికి తనకు అభ్యంతరం లేదని చెప్పాడు. అలా ప్రార్థన చేసి తనకు ఎలాంటి ఫలితం కలిగిందో చెప్పమని గురుదేవులు అతణ్ణి కోరారు. మలిసారి ఆ పెద్దమనిషి, ఒక మారిన మనిషిగా తిరిగివచ్చాడు. గురుదేవుల పాదాలను తాకి నమస్కరించి, "స్వామీ మీరు నన్ను రక్షించారు!" అన్నాడు.

మరొక సందర్భంలో ఒక భక్తుడు, "అయ్యా! నాకు భగవంతుడి నామస్మరణ మీద ఇష్టం కలగడం లేదు! మరి నేనేమి చెయ్యాలి?" అని శ్రీరామకృష్ణ పరమహంసను అడిగాడు. ఆయన ఆ భక్తుడికి,

“భగవంతుడి నామాన్ని జపించడంలో ఇష్టం కలగాలని వ్యాకులతతో ప్రార్థన చెయ్యి! ఆయన తప్పక నీ కోరికను నెరవేరుస్తాడు!” అని చెప్పారు.

కామక్రోధాలతో నిండిన మనిషి హృదయాన్ని పరిశుద్ధం చేయగల శక్తి ప్రార్థనకు ఉందని చెప్పడంలో ఎటువంటి సందేహమూ లేదు. కానీ ఆ ప్రార్థనకు ఏమాత్రం కృత్రిమత్వంలేని వినయం తోడవ్వాలి. మనలోని అంతర్యామి అయిన సర్వసాక్షిని మనం మోసం చెయ్యలేము కదా! ఆయనకు మన సంగతంతా తెలుసు. ప్రార్థనకు అవసరమైనవి చిత్తశుద్ధి, నిజాయితీ అని శ్రీరామకృష్ణులు చెప్పారు.

శ్రీరామకృష్ణులు కలకత్తాలోని దక్షిణేశ్వరంలో ఉండేవారు. ఒకసారి ఆయన ప్రత్యక్షశిష్యుడైన యోగానంద స్వామి, “మనస్సులో నుంచి కామాన్ని పారద్రోలడం ఎలా?” అని ప్రశ్నించాడు. ఆయన, “ప్రార్థన ద్వారా మనస్సులోని కామాన్ని సులభంగా పారద్రోలవచ్చు!” అని జవాబిచ్చారు. అయితే, అంత కష్టమైన పనికి, ఇంత సులభమైన పద్ధతి ఎలా పనిచేస్తుందన్న చులకన భావంతో యోగానందస్వామికి ఆ సలహా నచ్చలేదు. “ఎంతోమంది ప్రార్థన చేస్తూనే ఉంటారు కదా! మరి వారి జీవితాలలో ఏ మార్పూ కనిపించడం లేదే!” అనుకున్నాడు. “ఈయన నాకేదో కష్టమైన యోగసాధన నేర్పుతారనుకుంటే,

ఈయన ప్రార్థన చేయమంటున్నారేమిటి?" అని నిరాశ పడ్డాడు. "ఈయనకు ఇంతకన్నా వేరే మార్గం తెలియదు కాబోలు. అందుకనే ఇలాంటి పద్ధతిని నాకు చెపుతున్నారు!" అనుకున్నాడు. అదే సమయంలో ఒక హఠయోగి వచ్చి ఉన్నాడు. అతడి దగ్గర యోగసాధనలు నేర్చుకుంటే కామాన్ని జయించడం సాధ్యమవుతుందని యోగానంద స్వామి అతడి దగ్గరకు వెళ్ళాడు. అయితే శ్రీరామకృష్ణులు ఇది గమనించి, అతణ్ణి పిలిచి, "ముందు నేను చెప్పినది చెయ్యి! నీవనుకున్న ఫలితం రాకపోతే అప్పుడు వేరే మార్గానికి వెళ్ళు!" అని మందలించారు. శ్రీరామకృష్ణులు చెప్పిన పద్ధతిలో సులభమైన ప్రార్థనామార్గాన్ని అనుసరించి, హరినామ స్మరణ చేసి, తాననుకున్నది సాధించారు. తర్వాత కాలంలో, "హరినామస్మరణ వలన దివ్యమైన ఫలితాలు వస్తాయి!" అని యోగానంద స్వామి స్వయంగా చెప్పారు.

వివేకానంద స్వామి జీవితంలో జరిగిన సంఘటన ఇది. ఉపనిషత్తులలోని మంత్రాలకున్న మహత్తరశక్తిని ఇది తెలియజేస్తుంది. స్వామీజీ స్నేహితులలో ఒకరికి తీవ్రంగా జబ్బు చేసింది. అదేమిటో వైద్యులకు కూడా అంతుపట్టలేదు. దీనితో సహజంగానే అతడికి బ్రతుకుమీద ఆశ చచ్చిపోయి, వైరాగ్యంతో భగవంతుణ్ణి ప్రార్థించసాగాడు. తన స్నేహితుడైన వివేకానంద స్వామి సన్న్యాసి కనుక, ఆయన తన దగ్గరకు వస్తే మంచిదని

భావించి, కనీసం ఒక్కసారైనా తన దగ్గరకు రమ్మని కబురు పెట్టాడు. స్వామీజీ వచ్చి ఆ రోగి ప్రక్కన కూర్చోగానే ఆయనకు బృహదారణ్య కోపనిషత్తులోని ఒక మంత్రం గుర్తుకు వచ్చింది. ఆయన దాన్ని చదివి వినిపించారు. “తాను బ్రాహ్మణుడి కంటే వేరనుకునేవాడు బ్రాహ్మణుడి చేత జయించబడతాడు. తాను క్షత్రియుడి కంటే వేరనుకునేవాడు క్షత్రియుడి చేత జయించబడతాడు. తాను ఈ విశ్వానికంటే వేరనుకునేవాడిని ఈ విశ్వం జయిస్తుంది!” అని దాని తాత్పర్యం. ఆసక్తికరంగా, ఈ మంత్రం ఆ రోగిమీద గొప్ప ప్రభావాన్ని చూపింది. ఆ మంత్రం లోని అర్థాన్ని అతడు గ్రహించి దాన్ని గురించి ఆలోచించడం ద్వారా కొత్త శక్తిని పొంది, త్వరలోనే కోలుకున్నాడు. తాను ఈ విశ్వంతో ఒకటని మనిషి భావించినపుడు, తాను ఆత్మస్వరూపుణ్ణని తెలుసుకున్నప్పుడు, అతడికి చావుపుట్టుకల మీద భయం పోతుంది. నిర్భయత్వమే (అంటే భయం లేకపోవడమే) అన్నిటికన్నా మంచి మందు కదా!

ప్రార్థన ప్రకృతిశక్తులను కూడా కదిలించగలుగుతుంది. శ్రీశారదాదేవి జీవితంలోని ఒక సంఘటన ఈ విషయాన్ని చక్కగా నిరూపిస్తుంది. శ్రీమాత పుట్టిన ఊరయిన జయరాంబాటిలోనూ, పరిసర గ్రామాలలోనూ కరవు నెలకొంది. పంటలు ఎండి పోతున్నాయి. నిస్సహాయులైన రైతులు అమ్మ వద్దకు వచ్చినప్పుడు

పంటలు ఎండిపోతున్నాయని చెప్పి వాపోయారు. "ఈ సంవత్సరం కూడా చేలు పండకపోతే ఇక మా పిల్లలు ఆకలితో చావవలసి వస్తుంది!" అని వారు మొరపెట్టుకున్నారు. అమ్మ వారితో కలసి పొలాలను చూడడానికి వెళ్ళారు. ఎండిన పొలాలను చూసి అమ్మ బాధతో, "అయ్యో! గురుదేవా! మీరు ఎంత పని చేశారు? ఇలా అందరూ ఆకలితో చావవలసిందేనా!" అని ఎలుగెత్తి ప్రార్థించారు. ఆ రోజు రాత్రి కుండపోతగా వర్షం కురిసి కరవు తీరిపోయింది. చాలా సంవత్సరాలుగా అంత మంచి పంట పండలేదని రైతులు చెప్పుకున్నారు.

కర్ణాటక సంగీత త్రిమూర్తులలో ఒకరైన ముత్తుస్వామి దీక్షితార్ దక్షిణభారతదేశంలో పర్యటిస్తున్నప్పుడు ఎట్టయాపురం అనే ఊరికి చేరుకున్నారు. అక్కడ తీవ్రమైన క్షామం నెలకొని ఉంది. ఆయన అక్కడి ప్రజల దుర్భర పరిస్థితిని చూసి చలించిపోయి వర్షం కురవాలని ప్రార్థిస్తూ, 'ఆనందామృతకర్షిణి' అనే కృతిని గానం చేశారు. అమృతవర్షిణి రాగంలో ఆయన పాడిన ఆ కీర్తనకు ప్రకృతి స్పందించి వర్షం కురవడంతో అక్కడి కరవు తీరిందని చెపుతారు.

ప్రపంచ ఆధ్యాత్మిక చరిత్రలో ఇటువంటి సంఘటనలు కోకొల్లలు. ఇక్కడ కొన్ని మాత్రమే ఉదహరించబడ్డాయి.

# 10. ప్రార్థన - ఆధునిక ప్రయోగాలు

## ఆధునిక వైద్యుల ప్రయోగాలు

కొందరు శాస్త్రజ్ఞులు ప్రార్థనకు జబ్బులను నయం చేసే శక్తి ఉందని కనిపెట్టారు. గుండెజబ్బుల వైద్యుడైన డాక్టర్ రాండాల్ఫ్ బైర్డ్, ప్రార్థనలు హృద్రోగుల మీద చూపిన ప్రభావాన్ని గురించి కొన్ని వింతైన విషయాలను వెలిబుచ్చాడు. శాన్‌ఫ్రాన్సిస్కోలోని వైద్యశాలలో వీరు పరిశోధనకు గురిచేయాలనుకున్న రోగులను రెండు వర్గాలుగా విభజించారు. ఒక వర్గం కోసం ప్రార్థన చేశారు, రెండవ వర్గం కోసం ప్రార్థన చేయలేదు. హృద్రోగులను ఎన్నుకునేటప్పుడు రాండమ్‌గా (క్రమరహితంగా) ఎన్నుకున్నారు. వారి పేర్లను బయట ఎవరికో చెప్పి, ప్రార్థన చేయించారు. రోగులకు కానీ, నర్సులకు కానీ, డాక్టర్లకు కానీ, ఏ రోగులు ఏ వర్గంలో ఉన్నారో చెప్పలేదు. చివరకు ఫలితాలను చూసినప్పుడు ఏయే రోగుల కోసం ప్రార్థన చేశారో వారు మరింత మెరుగ్గా

కోలుకున్నట్టు గమనించారు. వారికి తక్కువ మందులు సరిపోయాయి. ఊపిరితిత్తుల్లో నీరు చేరడం (పల్మోనరీ ఎడీమా) కూడా తగ్గింది. ఆక్సిజన్ ఎక్కించవలసిన అవసరం, మొత్తంగా మరణాల సంఖ్య తగ్గాయి.

ప్రపంచవ్యాప్తంగా ప్రార్థనలకు అసలు రోగనివారణా సామర్థ్యం (థిరప్యూటిక్ వాల్యూ) ఏమైనా ఉందా అని వైద్యులు అనుమానిస్తూనే ఉన్నారు. అయితే ప్రార్థన యొక్క సామర్థ్యాన్ని ఋజువు చేస్తున్న ప్రయోగఫలితాలు నెమ్మదినెమ్మదిగా వెలుగులోకి వస్తున్నాయి. త్వరలోనే వైద్యుల సిఫారసులలో మందులతో పాటు ప్రార్థనలను గురించిన సూచనలను కూడా చేర్చబడవచ్చు. వివేకానంద స్వామి శతాబ్దం క్రితమే స్పష్టపరచిన ఈ 'సత్యం' యొక్క అంశాలను పూర్తిగా అర్థం చేసుకోవడానికి ఆధునిక విజ్ఞానశాస్త్రానికి ఇంకా సమయం పడుతుంది.

## ప్రార్థనల మీద జరిగిన కొన్ని పరిశోధనలు

జీవవ్యవస్థల మీద ప్రార్థనలు ప్రభావం చూపగలుగుతాయా? ఈ ప్రశ్న మీద స్పిన్‌డ్రిఫ్ట్ అనే సంస్థ పరిశోధనలు చేసింది. ఈ సంస్థ కార్యాలయం సేలమ్, ఓరెగాన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఉంది. వీరు మొలకెత్తుతున్న విత్తనాల మీద పరిశోధనలు చేసి ఇంతవరకూ శాస్త్రబద్ధంగా నిరూపించని ఒక కొత్త విషయాన్ని వెలుగులోకి తెచ్చారు. వారు అలా చేసిన

ప్రయోగాలలో మనం కొన్నింటిని పరిశీలిద్దాం. వీటిని గురించి 'రికవరింగ్ ది సోల్' (ఆత్మను స్వస్థపరచడం) అనే పుస్తకంలో డా|| లారీ డొస్సీ ప్రచురించాడు. వీరు చేసిన ప్రయోగాలలో తొట్టెలలో మొలకెత్తుతున్న విత్తనాలను తీసుకుని కొన్నింటి కోసం ప్రార్థన చేస్తూ, కొన్నింటి కోసం ప్రార్థన చేయకుండా ఉన్నప్పుడు ఏమవుతుందని పరిశోధించారు.

ఒక పరీక్షలో 'రై' విత్తనాలను తీసుకుని వాటిని ఒక తొట్టెలో నాటారు. తొట్టె మధ్యలో ఒక దారాన్ని ఉంచి దాన్ని రెండు సమాన భాగాలుగా చేసి వాటికి ఎ, బి అని పేర్లు పెట్టారు. ఒక భాగంలో విత్తనాలు బాగా మొలకెత్తాలని ప్రార్థనలు చేశారు. రెండవభాగం కోసం చేయలేదు. ఆ తర్వాత ఎన్ని విత్తనాలు మొలకెత్తాయో లెక్కబెడితే, ప్రార్థన చేసిన భాగంలో ఎక్కువ విత్తనాలు మొలకెత్తడాన్ని గమనించారు. ఇదే ప్రయోగాన్ని అనేకసార్లు చేసినా అవే ఫలితాలు వచ్చాయి.

సాధారణంగా మనం ఆరోగ్యంగా ఉన్నవారికంటే అనారోగ్యంగా ఉన్నవారి కోసం ఎక్కువగా ప్రార్థన చేస్తాము. దీనినే మనస్సులో ఉంచుకుని, ఆ విత్తనాలను అనారోగ్యానికి గురిచేయడం వలన ఎటువంటి ఫలితాలు వస్తాయో ప్రయోగాలు చేశారు. విత్తనాలు నాటిన తర్వాత ఆ తొట్టెలో ఉప్పునీరు పోయడం ద్వారా మొలకెత్తే విత్తనాలను ఒత్తిడికి గురిచేశారు.

మిగిలిన ప్రయోగం పైన చెప్పినట్టుగానే చేశారు. అయితే ఈసారి ఫలితాలలో తేడాలు కొట్టొచ్చినట్టు కనిపించాయి. ప్రార్థన చేయబడిన విత్తనాలే ఎక్కువ సంఖ్యలో మొలకెత్తాయి. రెండుజట్ల విత్తనాల మొలకల్లో చాలా ఎక్కువ తేడా కనిపించడం ద్వారా ఒత్తిడికి గురైన పరిస్థితిలో ప్రార్థన మరింత మెరుగుగా పనిచేస్తుందని నిరూపించబడింది.

"ఇంకా ఎక్కువ ఒత్తిడికి గురిచేస్తే ఏమవుతుంది?" అని ఆ ప్రయోగకులు ఆలోచించి ఇంకా ఎక్కువ ఉప్పునీటిని పోశారు. ఇలా ఎక్కువ ఒత్తిడిని కలిగించిన పరిస్థితిలో ప్రార్థనల ప్రభావం మరింత ప్రస్ఫుటంగా కనిపించింది. రెండు జట్లలో మొలకల తేడాల శాతంలో మరింత వ్యత్యాసం కనిపించింది. దీనిని బట్టి ఒత్తిడి ఎక్కువైన పరిస్థితులలో, భౌతిక పరిస్థితులు గడ్డుగా మారినప్పుడు, ప్రార్థనలు మరింత బాగా పనిచేస్తాయని అర్థమయింది.

తదుపరి ప్రయోగాలలో రకరకాల విత్తనాలతోపాటు, ఉష్ణోగ్రతలోనూ, తేమలోనూ తేడాలు సృష్టించి తద్వారా ఒత్తిడిని కలిగించి ప్రయోగాలు చేశారు. అన్ని ప్రయోగాలకూ అటువంటి ఫలితాలే వచ్చాయి.

ఆపైన, మరొకరకం ప్రయోగం చేశారు. ప్రార్థన చేసిన వ్యవధిని బట్టి ఫలితాలు ఎలా ఉంటాయో వాళ్ళు పరిశీలించి

చూశారు. సోయా విత్తనాలు నాటిన ఒక తొట్టె కోసం రెండుసార్లు ప్రార్థన చేస్తే, మరొకదాని కోసం ఒక్కసారే చేశారు. ఒకసారి కన్నా రెండుసార్లు ప్రార్థన చేసిన తొట్టెలో విత్తనాలు మరింత పెరుగుదలను చూపాయి.

ఇంకా చేసిన రకరకాల ప్రయోగాలలో ప్రార్థన చేసేవారికి, తాము ఎవరికోసం ప్రార్థన చేస్తున్నామో వారి గురించి ఎంత ఎక్కువ అవగాహన ఉంటే వారి ప్రార్థన అంత ఫలవంతంగా ఉంటుందని తెలుసుకున్నారు. ఇది చాలా అద్భుతమైన విషయం. అదే విధంగా ప్రార్థన చెయ్యడంలో ప్రావీణ్యత సాధించిన వారి ప్రార్థనలు అంత ప్రావీణ్యత లేనివారి కన్నా మెరుగ్గా పనిచేస్తాయి.

# 11. కొన్ని సైద్ధాంతిక వివరణలు

## ప్రార్థనలలో స్థాయులు - వివేకానంద స్వామి వివరణ

వివేకానంద స్వామి ప్రార్థనలలో ప్రాథమికమైనవేవో ఇలా వివరించారు.

**బాహ్యమైన ఆరాధనలు, అంటే పూజలు, నైవేద్యాలు, మొక్కుబడులు మొదలైనవన్నీ ప్రాథమికమైనవని శాస్త్రాలు చెపుతున్నాయి. వాటికన్నా మానసికమైన పూజ ఉన్నతమైనది. వీటన్నింటికన్నా భగవంతుణ్ణి సాక్షాత్కరించుకున్న స్థితి అత్యుత్తమమైనది. ఒక విషయాన్ని మీరు గమనించాలి. ఒక విగ్రహం ముందు మోకరిల్లిన భక్తుణ్ణి తక్కువస్థాయికి చెందినవాడని మీరంటారు. అయితే అతడు కూడా, "సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పిడుగులు, అగ్ని ఇవేవీ ఆ భగవంతుణ్ణి చూపలేవు. కానీ ఆయన నుంచే అవి అస్తిత్వాన్ని, మనుగడను పొందుతున్నాయి!" అంటాడు. ఆ సద్భక్తుడు ఇలా ప్రార్థన చేస్తాడే కానీ వేరొకరి విగ్రహాన్ని తూలనాడడు, లేదా వేరొకరి పూజాపద్ధతిని పాపంగా చిత్రీకరించడు. ఇటువంటి ఆరాధనలన్నీ జీవితంలో ఎదగడానికి అవసరమైన దశలుగానే అతడు అంగీకరిస్తాడు. "నేటి బాలుడే రేపటి తండ్రి!" బాల్యంలో, యవ్వనంలో మనుష్యులు ఎన్నో పొరపాట్లు చేస్తారు కాబట్టి ఒక వృద్ధుడు వచ్చి, బాల్యం, యవ్వనం పాపంతో నిండి ఉంటాయని చెపితే అది సబబుగా ఉంటుందా?**

**ఒక మనిషి విగ్రహారాధన ద్వారా తన దివ్యస్వభావాన్ని తెలుసుకోగలిగి, అతి ఉదాత్తమైన వ్యక్తిత్వాన్ని నిర్మించుకోగలుగుతున్నప్పటికీ,**

విగ్రహారాధనను పాపమని చిత్రీకరించడం సబబుగా ఉంటుందా? లేకపోతే, ఆ స్థితిని దాటినవాడు దానిని తప్పు అంటే బాగుంటుందా? మానవుడు అసత్యం నుంచి సత్యానికి కాక సత్యం నుంచి సత్యానికి ప్రయాణిస్తున్నాడని హిందువులు చెపుతారు. కావాలంటే మీరు తక్కువ రకపు సత్యం నుంచి ఉన్నతమైన సత్యానికి అని అనవచ్చు. అతినీచమైన మాయమంత్రాలు, క్షుద్రపూజలతో కూడిన గుడ్డినమ్మకం (ఫెటిషిజమ్) నుంచి అత్యున్నతుడైన దైవం అధిపతిగా ఉన్నాడని చెప్పే పరిపూర్ణ జ్ఞానం (ఆబ్సొల్యూటిజమ్) వరకూ అన్నీ సత్యమైనవేనని హిందువులు చెపుతారు. అవన్నీ అనంతమైన దైవాన్ని అంచనా వెయ్యడం కోసం, తెలుసుకోవడం కోసం మానవుడి ఆత్మ చేస్తున్న రకరకాల ప్రయత్నాలు మాత్రమే. ఆ రకరకాల స్థాయులన్నీ మానవుడు పుట్టిపెరుగుతున్న పరిస్థితులను బట్టి ఏర్పడతాయి. రెక్కలు విప్పి మరింత పైపైకి ఎగరాలని ప్రయత్నిస్తున్న గ్రద్దపిల్ల ఇంకాయింకా ప్రయత్నించి సూర్యుణ్ణి చేరాలనుకున్నట్టుగా మనిషి జీవితంలో కూడా ఆయా ప్రయత్నాలన్నీ రకరకాల స్థాయులను సూచిస్తాయి.

...ఏదియేమైనప్పటికీ ఈ ప్రతిమలూ, ప్రతీకలూ అన్నీ కేవలం ప్రాథమికమైనవి మాత్రమే. అవే దేవుడి పట్ల నిజమైన ప్రేమ కానేరవు. ప్రేమ గురించి జనం మాట్లాడుతూ ఉండడం మనం నిరంతరం వింటూనే ఉంటాము. ...ఈ ప్రపంచంలో అందరూ ప్రేమ గురించి మాట్లాడేవారే కానీ నిజంగా ప్రేమించడం చాలా కష్టం. ప్రేమ ఎక్కడుంటుంది? మన ప్రేమ నిజమైనదని ఎలా తెలుస్తుంది? బేరమాడటం ఎరుగనిదే నిజమైన ప్రేమ. ...ఎంతవరకూ ఒక మనిషి మరొకడి నుంచి ఏదైనా కోరుతూ

**ఉంటాడో, ఏదైనా పొందడానికి ప్రయత్నిస్తూ ఉంటాడో, అంతవరకూ అది ఇచ్చిపుచ్చుకునే వ్యాపారమే అవుతుందేమో కానీ, నిజమైన ప్రేమ కాజాలదు. ఎక్కడైతే అమ్మకం, కొనడం జరుగుతున్నాయో అక్కడ ప్రేమ లేదని తెలుసుకోండి. కాబట్టి, మనిషి దేవుణ్ణి ప్రార్థన ద్వారా, "నాకు అది ఇవ్వు! నాకు ఇది ఇవ్వు!" అంటూ వేధిస్తూ ఉన్నట్టయితే, అది ప్రేమ ఎలా అవుతుందో మీరే చెప్పండి? నేను మీకు ప్రార్థన చేస్తాను, మీరు నాకు కోరినది ఇస్తారు - ఇది వ్యాపారం కాకపోతే ఇంకేమిటి?**

ఆపైన అన్నిటికన్నా ఉన్నతమైన ప్రార్థనను స్వామీజీ ఇలా వివరించారు.

**వేదాంతం మనకు కావలసిన ప్రార్థన ఇది ఒక్కటే అని చెపుతుంది: "నాకు మరణం లేదు, భయం లేదు. నాకు కులం లేదు, వర్గం లేదు. నాకు తల్లీ, తండ్రీ, సోదరులూ, ఎవరూ లేరు. నాకు మిత్రులూ, శత్రువులూ ఎవరూ లేరు. నేను సత్, చిత్, ఆనంద స్వరూపుణ్ణి. నేను పాపపుణ్యాలకు బద్ధుణ్ణి కాను. తీర్థయాత్రలకు, పవిత్రగ్రంథాలకూ, పూజాపురస్కారాలకూ నేను బద్ధుణ్ణి కాను. సుఖదుఃఖాలు కూడా నన్ను బంధించలేవు. నాకు ఆకలిదప్పులు లేవు. ఈ శరీరం నాది కాదు. దానితోపాటు వచ్చే మూఢనమ్మకాలు లేవు. ఆ శరీరం కృశించిపోవడం కూడా లేదు. నేను సచ్చిదానంద స్వరూపుణ్ణి. నేనే శివుణ్ణి, నేనే శివుణ్ణి."**

**మనం దైవస్వరూపులమని మనకు మనం చెప్పకోవాలి, మన తోటి వారందరికీ చెప్పాలి. గమ్యానికి మనల్ని చేర్చే మార్గం ఇదొక్కటే. దీన్ని మనం ఎంతగా స్మరిస్తే మనకు అంత శక్తి వస్తుంది. మనలోనుంచి వినిపించే అతడి (భగవంతుడి) కంఠస్వరం మొదట వినపడీ**

వినపడకుండా ఉండవచ్చు గాక. కానీ క్రమేపీ అది మరింత స్పష్టంగా, బలంగా వినపడడం మొదలుపెడుతుంది. క్రమంగా ఆ సత్యం మన హృదయాలను తన అదుపులోకి తెచ్చుకుంటుంది. అది మన నరనరాల్లో ప్రవహిస్తూ, మన శరీరమంతా నిండిపోతుంది. ఈ జ్ఞానకాంతి మరింత ప్రకాశవంతమయ్యే కొద్దీ, అజ్ఞానపు బరువులన్నీ మాయమైపోతాయి. చివరికి అన్నీ కనుమరుగైపోయి కేవలం జ్ఞానసూర్యుడొక్కడే ప్రకాశిస్తూ కనిపిస్తాడు.

## రాజయోగపరంగా ప్రార్థనకు వివేకానంద స్వామి వివరణ

వివేకానంద స్వామి ఇలా చెప్పారు: "స్థావరజంగమాలతో కూడిన ఈ చరాచర ప్రపంచం అంతటా వ్యాపించివున్న విశ్వమనస్సులో మన మనస్సు ఒక అంతర్భాగం. అంతేకాక, ప్రతి మనస్సు ఈ విశ్వం మొత్తంతో నిరంతరం సంభాషణలో, సంపర్కంలో ఉంది." వేదాంతం ప్రకారం మనస్సే అన్నింటికీ కారణం. ఈ విశ్వంలోని ప్రతిదానికీ కారణం మనస్సులోనే పుడుతుంది. కంటికి కనిపించేవీ, కంటికి కనిపించనివీ అయిన భౌతికమైన వస్తువులన్నీ కూడా మనస్సులో పుట్టినవే. భౌతికస్థాయిలో కనిపించే భౌతికశక్తుల్ని మనిషి తన 'సంకల్పశక్తి' ద్వారా అదుపుచేయగలుగుతాడు. మనస్సు రూపుదిద్దుకుంటున్నప్పుడు ఏర్పడే మొదటి శక్తి సంకల్పశక్తి. ఇది అతి సూక్ష్మస్థాయిలో ఉండే శక్తి అయినా, భౌతికస్థాయిలోని శక్తుల్నీ, పదార్థాన్నీ ఎంతైనా ప్రభావితం చెయ్యగలదు. మనస్సులో కలిగే ప్రతిమార్పూ (చుట్టూ ప్రకృతిలో) భౌతికమైన మార్పును కూడా తేగలదు. ప్రార్థనలంటే తీవ్రమైన కోరికల రూపాలే కదా! ఈ తీవ్రమైన కోరికలు మనస్సులో పుట్టినపుడు వాటికి భౌతిక స్థితిగతుల్నీ

పర్యావరణాన్నీ మార్చివేసే శక్తి ఉంటుంది. 'ఆలోచన' అనేది ఒక శక్తి. అది బాహ్యప్రపంచం మీద పనిచేయగలదు. మనిషి మనస్సుకున్న ఏకాగ్రత ఎంత ఎక్కువైతే, దాని శక్తి అంత ఎక్కువవుతుంది, అంత ప్రభావం చూపగలుగుతుంది. దానికి తోడు, మనిషి మనస్సు మొత్తం విశ్వంతో నిరంతరం అనుసంధానంలో ఉంటుంది. మనుష్యులు ఎవరికి వారే ఏకాకులు కారు. నో మాన్ ఈజ్ ఏన్ ఐలాండ్! (No man is an island!) కాబట్టి, తీవ్రమైన ప్రార్థన, ప్రార్థిస్తున్న మనిషినే కాక ఎవరి కోసం ప్రార్థిస్తున్నారో వారిని కూడా ప్రభావితం చెయ్యగలదు.

మనిషి తన ప్రార్థనలకు ప్రతిఫలం లభిస్తోందని సంబరపడుతున్నప్పుడు ఆ ప్రతిఫలం తన సహజలక్షణమైన దివ్యత్వం నుంచే వెలువడిందని అర్థం చేసుకోడు. తనలోనే చుట్టచుట్టుకుని నిద్రాణంగా ఉన్న ఆ అనంతశక్తిని తన మానసికమైన ప్రయత్నం ద్వారా కొద్దిగా మేలుకొలిపి, తద్వారా తన ప్రార్థనకు ప్రతిఫలాన్ని సాధించగలిగాడని అతడికి తెలియదు. ఆ విధంగా, మనుష్యులు వేర్వేరు నామరూపాలు కల దేవతలను హృదయపూర్వకంగా అర్చించి, ఆయా దేవతలపట్ల భయభక్తులను కలిగివుండడం ద్వారా, అత్యంత కష్టభరితమైన సాధనల ద్వారా, ఏ శక్తిని సాధిస్తారో, దాన్నే రాజయోగి ప్రతిమనిషిలోనూ చుట్టచుట్టుకుని ఉన్న (కుండలినీ)శక్తిగా అభివర్ణిస్తాడు. ఆ కుండలినీశక్తియే అనంతశక్తికి మూలమనీ, ఆ శక్తిని ఎలా మేలుకొలపాలో తెలుసుకుంటే సర్వం సాధ్యమవుతాయనీ ప్రకటిస్తాడు. ఈ ప్రకటన ద్వారా రాజయోగం మతాన్ని శాస్త్రీయంగా విడమరచి చెప్పగలుగుతుంది. అన్ని పూజావిధానాలకూ, ప్రార్థనలకూ, విగ్రహాలకూ,

ప్రతీకలకూ, పండుగలకూ, మాయమంత్రాలకూ వెనుకనున్న హేతువు అదేననీ, ఆ పనులన్నింటి యొక్క పరమగమ్యం ఆ కుండలినీశక్తిని మేలుకొలపడమేననీ వివరిస్తుంది.

## జ్ఞానయోగపరంగా ప్రార్థనకు వివేకానంద స్వామి వివరణ

ఎవరిని ఎవరు చూస్తున్నారు? ఆయన (భగవంతుడు) ఇక్కడే, మన హృదయాలలోనే ఉన్నాడు. మన శరీరాలూ, మనస్సులూ మారిపోతూ ఉంటాయి. సుఖదుఃఖాలు, మంచిచెడులూ వస్తూపోతూ ఉంటాయి. ఏళ్ళూపూళ్ళూ గడచిపోతూ ఉంటాయి. జీవితం వస్తుంది, పోతుంది. కానీ 'ఆయన' మాత్రం మరణించడు. సనాతనము, నిర్వికారము అయిన ఆ కంఠస్వరం, "నేను ఉన్నాను, నేను ఉన్నాను!" అని వినిపిస్తూనే ఉంటుంది. 'ఆయన'లోనూ, 'ఆయన' ద్వారానూ, మనం అన్నింటినీ తెలుసుకుంటున్నాము, ఆలోచిస్తున్నాము, జీవిస్తున్నాము. చివరికి మన ఉనికి కూడా 'ఆయన'లోనే, 'ఆయన' ద్వారానే ఉంది. సాధారణంగా మనం 'నేను' అన్నప్పుడు మనలోని అల్పమైన, పరిమితమైన నేను గురించి మాట్లాడుతుంటాము. కానీ పై సందర్భంలో, మనం దేనిని 'నేను' అని అంటున్నామో, అది దైనందిన జీవితంలో వ్యవహరించబడే పరిమితమైన 'నేను' కాదు. అంతకంటే ఎంతో ఉన్నతమైన ఆత్మను ఉద్దేశించి మనం మాట్లాడుతున్నాము. అది నాలోనూ, నీలోనూ, అందరిలోనూ, జంతువులలోనూ, దేవతలలోనూ, చివరికి నీచాతినీచమైన వాటిలో కూడా ఉంది. ఒక హంతకుడిలో ఎంత ఉందో, ఒక సాధువులోనూ అంతే ఉంది. ఒక ధనికుడిలో ఎంత ఉందో పేదవాడిలో కూడా అంతే ఉంది. ఒక పురుషుడిలో ఎంత ఉందో, ఒక స్త్రీలో కూడా అంతే ఉంది. మనిషిలో ఎంత

ఉందో జంతువులలో కూడా అంతే ఉంది. అత్యల్పమైన అమీబా నుంచి అత్యున్నతుడైన సాధువు వరకూ అందరిలోనూ అంతే మొత్తంలో ఉంది. ఆయన అన్ని ఆత్మలలోనూ నివాసం ఉంటూ, "తత్త్వమసి, తత్త్వమసి" "నీవే అతడు, నీవే అతడు" అని ప్రకటిస్తున్నాడు. ఈ సనాతనస్వరాన్ని మనం తెలుసుకున్నప్పుడు, ఈ పాఠాన్ని మనం నేర్చుకున్నప్పుడు, ఈ విశ్వంలోని మర్మమేమిటో తెలుసుకున్నట్టే. అది తెలుసుకున్నప్పుడు ప్రకృతి తనలోని రహస్యాన్ని మనకు తేటపరచినట్టే. ఇక ఆపైన తెలుసుకునేదేమీ మిగలదు. ఆ విధంగా, మతాలన్నీ ఏ సత్యాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నాయో దాన్ని మనం తెలుసుకోగలుగుతాము. దీనితో పోలిస్తే భౌతికశాస్త్రాలు తెలియజెప్పే విషయాలన్నీ తక్కువస్థాయికి చెందినవే. ఈ ఏకత్వాన్ని తెలిపే జ్ఞానమే ఈ విశ్వం యొక్క విశ్వజనీనమైన దేవదేవుడితో మనల్ని ఒకటి చేస్తుంది.

## భక్తియోగపరంగా ప్రార్థనకు వివేకానంద స్వామి వివరణ

హిరణ్యకశిపుడి కొడుకైన ప్రహ్లాదుడు ఇలా ప్రార్థించాడు: "ప్రాపంచికులకు అశాశ్వతమైన ఇంద్రియసుఖాల పట్ల కోరిక ఎలా చావకుండా ఉంటుందో అదే విధంగా నీవు తప్ప వేరేమీ కోరని నా హృదయంలో నుంచి నీమీది ప్రేమ ఎప్పటికీ తొలగిపోకుండా చూడు, దేవా!" ఈ ఒక్క ప్రార్థనలో భక్తియోగం గురించిన అత్యుత్తమమైన నిర్వచనం ఇవ్వబడింది. మనుష్యులకు డబ్బుపట్ల, దుస్తులపట్ల, భార్యా పిల్లలపట్ల, స్నేహితులపట్ల, ఆస్తిపాస్తులపట్ల బలమైన ప్రేమ ఉంటుంది. వారికి అంతకంటే ఉన్నతమైనదేమీ తెలియదు. వాటిపట్ల వారికి విపరీతమైన అనురాగం ఉంటుంది! అందుకనే ప్రహ్లాదుడు ఆ ప్రార్థనలో,

"నాకు అటువంటి అనుబంధం, అనురాగం కావాలి. కానీ అది నీపట్ల మాత్రమే!" అని కోరాడు. ఇటువంటి ప్రేమను, ఎప్పుడైతే మనం భగవంతుడికి మాత్రమే ఇస్తామో, దాన్ని భక్తి అని పిలుస్తారు. భక్తి విధ్వంసకరమైనది కాదు. అది దేనినీ వద్దని చెప్పదు. మనకు దేవుడిచ్చిన కర్మేంద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ, అన్నింటిలో ఏదీ వ్యర్థమైనది కాదని భక్తిమార్గం బోధిస్తుంది. వాటి ద్వారా మనం సహజంగా ముక్తి పొందవచ్చునని బోధిస్తుంది. భక్తిమార్గం మనలోని సహజస్వభావాలను చంపివేయమని చెప్పదు, ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించమని చెప్పదు. కానీ వాటికి మరింత ఉన్నతమైన, శక్తిమంతమైన మార్గాన్ని ఎలా చూపాలో బోధిస్తుంది. ఇంద్రియవిషయాలను మనమెంత సులభంగా, సహజంగా ప్రేమిస్తామో గమనించారా? అలా చేయకుండా మనం ఉండలేము. ఎందుకంటే మనకు అవి చాలా సత్యమైనవిగా కనిపిస్తాయి. సాధారణంగా ఇంద్రియవిషయాలకన్నా ఉన్నతమైనవేవీ యథార్థంగా తోచవు. కానీ ఎప్పుడైతే మనిషి, ఈ ఇంద్రియ విషయాలకన్నా ఉన్నతమైన వాటిని అనుభూతి చెందగలుగుతాడో అప్పుడు వాటి పట్ల బలమైన ప్రేమను పెంచుకోగలుగుతాడు. ఇంకోలా చెప్పాలంటే, మనిషి తనకు ఇంద్రియవిషయాల పట్ల ఉన్న ప్రేమను కేవలం భగవంతుడి వైపు మరలిస్తున్నాడంతే. ఇంద్రియవిషయాలకిచ్చే ప్రేమనే భగవంతుడివైపు మరలించినప్పుడు దాన్ని భక్తి అంటారు.

## మనలోని శక్తిని మేలుకొలపడమే ప్రార్థన ఉద్దేశ్యం

వివేకానంద స్వామి ఇలా వివరించారు: మీ సంకల్పశక్తే మీ ప్రార్థనలకు సమాధానమిచ్చేది. అయితే అది వేర్వేరు మతాలవారికి వారి మతంలో

బోధించిన భావాలను బట్టి ఆ సంకల్పశక్తి వేర్వేరు రూపాలలో కనిపిస్తుంది. దానినే మనం బుద్ధుడనీ, ఏసుక్రీస్తు అనీ, అల్లా అనీ, అగ్ని అనీ పిలుస్తూ ఉంటాము. అయితే వాటన్నింటిలోనూ ఉండేది ఒకటే ఆత్మశక్తి. మనలో ఉన్న శక్తులకు రూపంగా తయారైనవే ఏసు రూపంలోనూ, బుద్ధుడి రూపంలోనూ కనిపిస్తాయి. మన ప్రార్థనలకు నిజంగా సమాధానం ఇచ్చుకునేది మనమే.

మానవాళి వెనుకనున్న అనంత జ్ఞానసాగరానికి, శక్తిసాగరానికి ప్రతి ఒక్క మనిషి ఒక కుళాయిలాంటివాడు. కోరికలూ, కామాలూ మనిషిలో ఉన్నట్టుగానే వాటిని తీర్చగలిగే శక్తి కూడా అతడిలోనే నిక్షిప్తమై ఉంది. ఎప్పుడైనా ఒక కోరిక తీరినప్పుడు, ఒక ప్రార్థనకు సమాధానం లభించినప్పుడు అది ఈ అనంతమైన పెన్నిధిలోనుంచే వెలువడుతుంది కానీ పైన ఎక్కడో కూర్చున్న మానవాతీత శక్తి నుంచి కాదు.

# 12. కొన్ని విశిష్టమైన ప్రార్థనలు

## దేశం కోసం ప్రార్థన

వివేకానంద స్వామి భారతదేశాన్ని మేలుకొలుపుతూ చెప్పిన ఈ క్రింది మాటలనే మనం మన దేశం కోసం చెయ్యాల్సిన ప్రార్థనగా భావించవచ్చు. దానిని నిరంతరం తలచుకోవడం ద్వారా మన దేశం కోసం ఎలా పనిచెయ్యాలో మనకు అర్థమవుతుంది.

**ఓ భారతదేశమా! నీవు నాగరికత, ఔన్నత్యాల శిఖరాలను అధిరోహించాలని అనుకుంటున్నావు. అయితే ఇలా పరాయి భావాలను చిలుకపలుకుల్లా వల్లెవేయడం ద్వారా, ఇతరులను ఇలా గుడ్డిగా అనుకరించడం ద్వారా, ఇలా ఇతరుల మీద ఆధారపడడం ద్వారా వాటిని అందుకోగలుగుతావా? ఈ బానిసతనపు బలహీనతలతో, ఈ అసహ్యాన్ని కలిగించే దుర్మార్గపు ఆలోచనలతో, తోటివారిని అణచివేసే ఈ క్రూరత్వంతో ఏమి సాధించగలవు? ధీరులు, సాహసోపేతులు మాత్రమే పొందదగిన అటువంటి స్వేచ్ఛను ఇటువంటి సిగ్గుపడవలసిన పిరికితనం సహాయంతో పొందగలవా? ఓ భారతదేశమా! నీ స్త్రీజాతికి ఆదర్శం సీత, సావిత్రి, దమయంతి అని మర్చిపోవద్దు. నీవు ఆరాధించే దేవుడు సన్న్యాసులకే సన్న్యాసి, అన్ని అనుబంధాలనూ విడిచిపెట్టిన త్యాగి, ఉమాపతి అయిన శంకరుడని మరచిపోవద్దు. నీ వివాహం, నీ సంపదలు, నీ జీవితం, ఇంద్రియసుఖాల కోసం కాదని, నీవొక్కడివే సుఖపడడం కోసం కాదని మరచిపోవద్దు. జగన్మాత బలిపీఠం మీద**

**బలిగా సమర్పించబడడానికే నీవు పుట్టావని మరచిపోవద్దు. నీ సామాజిక వ్యవస్థ, అనంతమైన, విశ్వజనీనమైన మాతృత్వానికి ప్రతిబింబమని మరచిపోవద్దు. బడుగు వర్గాలు, విద్యలేని వారు, పేదలు, నిరక్షరాస్యులు, చెప్పలు కుట్టేవారు, వీధులూడ్చేవారు నీ రక్తమాంసాలనీ, నీ తోబుట్టువులనీ మరచిపోవద్దు. ఓ ధీరుడా! ధైర్యంగా ఉండు! సాహసాన్ని అలవరచుకో! నీవు భారతీయుడవని గర్వించు! "నేను భారతీయుణ్ణి. ప్రతి భారతీయుడూ నా సోదరుడే!" అని సగర్వంగా ప్రకటించు. "విద్యలేని భారతీయుడు, పేద భారతీయుడు, అనాథ భారతీయుడు, బ్రాహ్మణ భారతీయుడు, చండాల భారతీయుడు నా సహోదరుల"ని ఎలుగెత్తి చాటు. నీవు కూడా నడుముకు ఒక చింకిపాత బిగగట్టి దిక్కులు పిక్కటిల్లేలా, "భారతీయుడు నా సోదరుడు! భారతీయుడే నా ప్రాణం! భారతదేశపు దేవీదేవతలే నా ఆరాధ్యదైవాలు. భారతదేశపు సమాజమే నా చిన్ననాటి ఊయల, పడుచుదనపు పూదోట, వృద్ధాప్యపు స్వర్గధామమైన వారణాసి!" అని గర్జించు. ఓ సోదరా! "ఈ భారతదేశపు నేల నా మహోన్నత స్వర్గం. భారతదేశానికి మేలు చెయ్యడం ద్వారానే నాకు మేలు కలుగుతుంది," అని ప్రకటించు. రాత్రింబవళ్ళూ, "గౌరీపతివైన ఓ ప్రభూ! జగన్మాతవైన ఓ తల్లీ! నాకు పౌరుషత్వాన్ని ప్రసాదించండి! ఆదిశక్తివైన ఓ మాతా! నా బలహీనతలను తొలగించు! నాలోని పిరికితనాన్ని తీసివెయ్యి! నన్నొక ధీరుడైన మనిషిగా తయారుచెయ్యి!" అని ప్రార్థించు.**

తన శిష్యుడైన అలసింగ పెరుమాళ్‌కు వ్రాసిన ఈ ఉత్తరంలో దేశపరిస్థితిని గురించి ఆందోళన చెందుతూ, దేశం కోసం ఎలా

ప్రార్థన చెయ్యాలో వివేకానంద స్వామి వివరించారు.

**ప్రియమైన అలసింగా,**

**కుమారా! పట్టు విడవకు! ఎవరోవచ్చి నీకు సహాయం చెయ్యాలని ఆశించకు. మానవులు చెయ్యగలిగిన సహాయం ఎంతటిది? అంతకన్నా ప్రభువు అనంతంగా గొప్పవాడు కాడా? పవిత్రంగా ఉండు! ప్రభువు మీద విశ్వాసం ఉంచు. ఎల్లప్పుడూ ఆయన మీదే ఆధారపడి ఉండు. అప్పుడు నువ్వు సరైన మార్గంలో ఉన్నట్టే; నీకు అడ్డు నిలువగలిగేది ఏదీ ఉండదు.**

**మనకు "వెలుగునిచ్చి, దారి చూప"మని ప్రార్థిద్దాం. ఆ చీకటిలోంచి ఒక కాంతిపుంజం వెలువడుతుంది. మనను నడిపించడానికి ఒక చేయి ముందుకు చాచబడుతుంది. నేను ఎల్లప్పుడూ నీకోసం ప్రార్థన చేస్తూ ఉంటాను. నీవు కూడా నాకోసం ప్రార్థించాలి. రాత్రింబవళ్ళూ ప్రార్థిద్దాం! పేదరికం, మతాచార్యుల క్రూరత్వం, రాచరికపు నిరంకుశత్వం అనే సంకెళ్ళలో బంధించబడి, అణగద్రొక్కబడుతున్న కోట్లాదిమంది భారత ప్రజల కోసం మనలోని ప్రతిఒక్కరూ రాత్రింబవళ్ళూ ప్రార్థిద్దాం. ఉన్నత వర్గాల కంటే, ధనికుల కంటే ఈ బడుగువర్గాలకు మతబోధ చేయడానికే నేను ఎక్కువ శ్రద్ధ చూపిస్తాను. నేనొక ఆధ్యాత్మికవేత్తను కాను, తత్త్వవేత్తనూ కాను, ఋషిని అంతకంటే కాను. నేను పేదవాణ్ణి, పేదలను ప్రేమిస్తాను.**

**...మన దేశపు పేదల్ని ఎవరు పట్టించుకుంటారు? వారికి జ్ఞానం, విద్య అందే మార్గమే లేదు. వారికి వెలుగు చూపించేది ఎవరు? ఎవరు ఇంటింటికీ తిరిగి వారికి విద్య నేర్పుతారు? ఆ పేదలనే నీ దైవంగా భావించు. వారి గురించే ఆలోచించు, వారి కోసమే పని చెయ్యి, వారి**

అభ్యున్నతి కోసం నిరంతరం ప్రార్థించు. ప్రభువు నీకు త్రోవ చూపిస్తాడు. ఎవరి హృదయం పేదల కోసం ద్రవిస్తుందో అతణ్ణే నేను మహాత్ముడని అంటాను. లేకపోతే అతడు దురాత్ముడే! వారికోసం చేసే ఎడతెగని ప్రార్థనలో మన సంకల్పాలను ఒక్కటిగా చేద్దాం.

మనం ఏమీ సాధించకుండా ఒక దిక్కులేని చావు చావవచ్చు గాక! మనకంటూ ఎవరూ సానుభూతిపరులు ఉండకపోవచ్చు గాక! మనకోసం ఏడ్చేవారు ఎవరూ ఉండకపోవచ్చు గాక! కానీ ఈ నిస్వార్థపు ఆలోచనలలో ఏవొక్కటీ వృథా పోదు. వాటి ఫలితం ఇవాళ కాకపోతే రేపు అయినా తప్పక ప్రభావాన్ని చూపుతుంది. నా హృదయం నా భావాలను విడమరిచి చెప్పలేనంతగా నిండిపోయివుంది - అది నీకు తెలుసు, నీవు ఊహించగలవు. కోట్లాదిమంది ప్రజలు ఆకలితో, అజ్ఞానంతో జీవిస్తున్నంత కాలం, వారి కష్టార్జితంతో విద్య నేర్చి, వారి గోడు కొంచెమైనా పట్టించుకోని ప్రతి ఒక్కణ్ణీ నేను ద్రోహి అని అంటాను. ఆకలిగొన్న ఆదిమమానవులలాగా ఉన్న ఆ ఇరవై కోట్లమంది కోసం ఏమీ చెయ్యనంతవరకూ, ఆ పేదలను రాచిరంపాన పెట్టడం ద్వారా తమ ధనం అంతటినీ సంపాదించి, దానితో సోకు చేసుకుని కులుకుతూ తిరుగుతున్న వారందరినీ నేను సిగ్గులేనివాళ్ళని అంటాను. సోదరులారా! మనం పేదలం, అల్పజీవులం. కానీ ఎల్లప్పుడూ ఇటువంటి వారే ఆ పరమేశ్వరుడి చేతిలో పనిముట్లు అయ్యారన్నది చరిత్ర చెప్పిన సత్యం.

ఆ భగవంతుడు మిమ్మల్నందర్నీ దీవించుగాక!

నిండైన ప్రేమతో,

వివేకానంద

## బలం కోసం ప్రార్థన

వివేకానంద స్వామి బలం కోసం చేసే ప్రార్థనను ఇలా వివరించారు.

**బలం! మనకు ఈ జీవితంలో అన్నిటికన్నా మిన్నగా కావలసినది బలమే! మనం పాపమనీ, దుఃఖమనీ పిలిచేవాటన్నింటికీ ఒకటే కారణం. అదే మన బలహీనత! బలహీనత వల్లనే అజ్ఞానం కలుగుతుంది. అజ్ఞానం వల్లనే దుఃఖాలు కలుగుతాయి. ఈ దుఃఖాల్ని ఎదుర్కొనే పోరాటం మనల్ని బలవంతులుగా చేస్తుంది. ఒకసారి మనం బలవంతులుగా తయారయ్యాక, ఆ దుఃఖాలను చూసి నవ్వుతాము. దుర్మార్గాన్నీ, క్రూరత్వాన్నీ చూసి చిరునవ్వు నవ్వుతాము. పెద్దపులి లాంటి ఒక క్రూరమృగం కూడా దాని క్రూరమైన స్వభావానికి వెనుక ఉన్న ఆత్మ స్వభావాన్నీ, అదీ నేనూ ఒకటేనన్న సత్యాన్నీ చూపిస్తుంది. బలం వల్ల కలిగే ఫలితమిదే. భగవంతునితో ఏకత్వాన్ని సాధించిన ఆత్మ ఒక్కటే నిజంగా బలవంతమైనది. మిగిలినవేవీ బలమైనవి కావు. బైబిల్‌లో ఏసుక్రీస్తుకున్న బలం ఎక్కడనుంచి వచ్చిందనుకుంటున్నారు? అటువంటి అపారమైన, అనంతమైన బలంతో ఆయన తనకు ద్రోహం చేసినవారిపట్లే నవ్వగలిగారు. తన హంతకులనే ఆశీర్వదించారు!**

## భగవంతుడి చేతిలో పనిముట్టు కాగోరే ప్రార్థన

భగవంతుడు తన పనిముట్లుగా వాడడానికి సమర్థులయిన మనుష్యుల కోసం వెతుకుతుంటాడు. ఆయనకు మీరు సమర్థులని తోస్తే మిమ్మల్ని పూర్తిగా అరిగిపోయేదాకా ఉపయోగిస్తాడు. ఆ

విధంగా చూసినప్పుడు అన్నిటికన్నా కష్టమైన ప్రార్థన "నన్ను నీ పనిముట్టుగా చేసుకో!" అని కోరడమే. కానీ అలా ప్రార్థన చేయ డానికి వెనుదీయకూడదు. ఒకసారి ఆయన చేతిలో పనిముట్టుగా మారాక, మన బాధ్యతను ఆయనే తీసుకుంటాడు కదా!

చిత్తశుద్ధితో ప్రార్థన చేసేవాడు, "ఓ దేవా! నీ సంకల్పమే నెగ్గాలి కానీ నాది కాదు!" అని ప్రార్థన చేస్తాడని మనం చదివాము. ఇదే విషయాన్ని భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జునుడితో, "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్!" (గీత 11.33) "చేసే పని అంతా నేనే చేస్తున్నాను. నువ్వు కేవలం నిమిత్తమాత్రుడివిగా, అంటే నా చేతిలో పనిముట్టుగా ఉండు!" అని చెప్పాడు. కాబట్టి, మనం కూడా భగవంతుడి చేతిలో పనిముట్లుగా ఉండాలని హృదయపూర్వకం గా ప్రార్థించాలి. అయితే అలా జరగాలంటే కావలసిన నియమం - మన అహంకారమమకారాలు పూర్తిగా తుడిచిపెట్టుకుపోవ డమే. అటువంటి యోగ్యతను సాధించడం కష్టమే, కానీ అసాధ్యం కాదు. నిజానికి మనందరం అటువంటి స్థితి కోసమే ప్రార్థించాలి. ఆ స్థితిని సాధించిన వాడు తానే భగవంతుడవుతాడు.

**అన్ని వైపులనుంచీ వ్యతిరేకత ఎదురవుతున్న సందర్భంలో వివేకానంద స్వామి ఒక ఉత్తరంలో ఇలా వ్రాశారు: "ఒక నిముషంలోనే నేను ఓటమిని అంగీకరిస్తానని నీవనుకుంటున్నావా? నేను ఆయన చేతిలో గొడ్డలిగా పనిచేస్తూ, పురవీధుల్లో పడి చావాలని భగవంతుడు ఇచ్ఛగిస్తే అలాగే కానియ్యి. వ్హా గురూ కీ ఫతే! గురుదేవులకు జయం!"**

## ప్రేమగల ప్రార్థన

మనకు కావలసిన చిల్లరమల్లర పనులన్నీ భగవంతుడే చేసిపెట్టాలని మన ఉద్దేశ్యం. అయితే, ప్రేమగల ప్రార్థన ఎలా ఉంటుందో శ్రీరామకృష్ణులు ఇలా వివరించారు:

**“ఒకసారి ముగ్గురు స్నేహితులు కలిసి అడవిలో నుంచి వెడుతున్నారు. ఆ సమయంలో అకస్మాత్తుగా ఒక పెద్దపులి ఎదురుగా వచ్చింది. దానిని చూచి భయపడి వారిలో ఒకడు, ‘మిత్రులారా, మనకు కాలం తీరిపోయింది. మనమిక బ్రతకం!’ అని అరిచాడు. వెంటనే రెండవవాడు, ‘ఫర్వాలేదు, రండిరా! మనకాలం తీరలేదు, ఏమీ కాలేదు. మనందరం కలిసి భగవంతుణ్ణి ప్రార్థిద్దాం!’ అన్నాడు. ఇంతలో మూడవవాడు అందుకొని, ‘మిత్రులారా! ఈ మాత్రం దానికి మనం భగవంతుణ్ణి ఎందుకు కష్టపెట్టాలి? ఇదిగో ఇక్కడే ఉన్న ఈ చెట్టు ఎక్కి ప్రాణాలు రక్షించుకుందాం!’ అన్నాడు.” “మన కాలం తీరిపోయింది” అని గగ్గోలుపెట్టిన వాడికి, ‘భగవంతుడనేవాడు ఒకడున్నాడు, వాడు మనల్ని రక్షిస్తాడు’ అనే విషయమే తెలియదు. ఇక ‘భగవంతుణ్ణి ప్రార్థిద్దామన్న’ రెండవవాడు జ్ఞానభక్తి కలవాడు. భగవంతుడు ఒకడున్నాడని, అతడు సర్వవ్యాపి అని, ప్రపంచాన్ని, మనను అతడు సృష్టించి పోషిస్తాడని వాడికి తెలుసు. ఇక ‘చెట్టెక్కి ప్రాణం రక్షించుకుందాం; భగవంతుణ్ణి మనం ఎందుకు కష్టపెట్టాలి’ అన్న మూడవవాడు ప్రేమభక్తి కలవాడు. అటువంటి ప్రేమ స్వభావం భగవంతుని కంటే తానే బలవంతుడనని భక్తుడు విశ్వసించేలా చేస్తుంది. వాడు ఎల్లప్పుడూ, తన ప్రియసఖుడైన భగవంతుడికి ఎక్కడ**

**నొప్పి కలుగుతుందో అన్న మెలకువతో ఉంటాడు. తన ప్రియుడికి ఆఖరుకు కాలిలో ముల్లు కూడా గుచ్చుకోకుండా ఉండేలా చూస్తాడు."**

ఈ కథద్వారా భగవంతుణ్ణి ఎలా ప్రేమించాలో, అలా నిజంగా ప్రేమించేవాడు ఎలా ప్రవర్తిస్తాడో, మనకు అర్థమవుతుంది.

## ఏదీ కోరని ప్రార్థన!

సెయింట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసి, "మనం దేవుణ్ణి ప్రార్థించేటప్పుడు దేనినీ కోరకూడదు!" అని చెప్పాడు.

కష్టాలూ, అగ్నిపరీక్షలూ అందరికీ ఎదురయ్యేవే. ఎవరూ వాటిని తప్పించుకోలేరు. మన తోటివారు చేసిన సహాయం, వారు చూపిన జాలి, మన కష్టాలను తీర్చలేనప్పుడు మనం పరమాత్మ వైపుకు తిరుగుతాము. ఆయన ద్వారా మనకు సాంత్వన కలిగి, మనలో ఆశలు చిగురిస్తాయి. అటువంటి గడ్డు పరిస్థితులలో మనం కోరుకున్న ఫలితాల కోసం కాక మనకేది మంచిదో అటువంటి ఫలితాన్ని ఇమ్మని ఆ నిర్ణయాన్ని పరమాత్మకే వదిలిపెట్టడం మంచిది. ఇలా చేయడానికి ధైర్యం, విశ్వాసం కావాలి. మనం కోరుకున్న దాన్ని పక్కన పెట్టాలి. మన కోరికలు సంకుచితమైనవి. అవి చాలాసార్లు మనల్ని ప్రక్కదోవ పట్టిస్తూ ఉంటాయి. "ఆశలు, ఆశయాలు నావి. ఫలితాన్ని మాత్రం నీకే విడిచిపెడుతున్నాను!" అని వాల్ట్ విట్‌మాన్ చెప్పిన మాటలు అన్ని ప్రార్థనలకూ పునాదిగా ఉండాలి. థామస్ ఎ. కెంపిస్ వ్రాసిన 'ది

ఇమిటేషన్ ఆఫ్ క్రైస్ట్' (క్రీస్తు అనుకరణ) అనే గ్రంథం ప్రార్థన చేసేటప్పుడు సరైన ప్రవర్తన ఎలా ఉండాలో వివరిస్తుంది. దానిలో, "ఓ భగవంతుడా! నీ నామం ఎల్లకాలాలకూ నిలచుగాక! ఈ కష్టం నాకు కలగాలని నీవే భావించావు. దానిని నేను తప్పించుకోలేక, తప్పనిసరి పరిస్థితులలో నిన్ను శరణువేడినప్పుడు, నీవే నాకు సహాయం చేసి, నన్ను రక్షించావు. ఆ కష్టాన్ని నా మేలు కోసమే ఉద్దేశించి పంపావని నాకు అర్థమైంది!" అన్న ప్రార్థన కనిపిస్తుంది.

శ్రీరామకృష్ణులు ఒక ఉదాహరణ చెప్పారు. 'ఒక న్యాయవాది తన వాదనలన్నింటినీ వినిపించిన తర్వాత న్యాయపతితో, "అయ్యా! నేను చెప్పవలసినదంతా చెప్పాను. ఇక నిర్ణయం మీది!" అని న్యాయాధికారితో అంటాడు. అలాగే బాధలో ఉన్నవాడు తన కష్టాలను దేవుడి ముందు ఏకరువు పెట్టి, ఆయననే తన విషయంలో కలగజేసుకోమని వేడుకుంటాడు. అంతేకానీ, "నేను చెప్పినట్టే చెయ్యాలి!" అంటూ దేవుడి మీద ఒత్తిడి పెట్టడు.'

శ్రీ శారదామాత ఒక రోజు భక్తులతో సంభాషిస్తూ, "సరే! మనం దేని కోసం ప్రార్థించాలో చెప్పండి?" అని వారిని ప్రశ్నించారు. వారిలో ఒకరు, "భక్తిజ్ఞానాలు కావాలనీ, సంతోషంగా జీవించడానికి అవసరమైనవన్నీ కావాలనీ ప్రార్థిస్తాము. అవే కదా మనం కోరవలసింది!" అని సమాధానమిచ్చారు. అమ్మ దానికి సమాధానం చెపుతూ, **"ఒక్క మాటలో చెప్పాలంటే, 'నిర్వాసన'**

**అంటే 'కోరికలు లేకుండా ఉండాల'ని ప్రార్థించాలి. మన కష్టాల న్నింటికీ కారణం కోరిక. ఈ సంసారచక్రంలో అంతులేని చావు పుట్టుకలలో మనం తిరుగుతూ ఉండడానికి కారణం కోరికలే. ఈ చక్రంలో నుంచి బయటపడడమే ముక్తి. ఆ ముక్తిని సాధించడానికి అన్నిటికన్నా పెద్ద ఆటంకం కోరికే!"** అని చెప్పారు.

కాబట్టి మనం, "ఓ దేవా! నా మనస్సులో నుంచి కామం, క్రోధం, లోభం, ద్వేషం, అసూయ మొదలైన అవలక్షణాలన్నింటినీ తొలగించు!" అని చిత్తశుద్ధితో ప్రార్థించాలి. అటువంటి ప్రార్థన మనకు ఔన్నత్యాన్ని కలిగించి, జ్ఞానోదయాన్ని ఇస్తుంది. అలాకాక, "అది కావాలి! ఇది కావాలి!!" అంటూ చేసే ప్రార్థనలు మనల్ని మరిన్ని బంధాలలో పడవేసి, అంతులేని కష్టాలను కలిగిస్తాయి.

**వివేకానంద స్వామి ఇలా ప్రార్థించారు: "ఓ దేవా! నాకున్న ఒకేవొక్క కోరిక నిన్ను సాక్షాత్కరించుకోవడం. ఆ కోరికను కూడా లేకుండా చేయి!"**

**ఆయన ఇంకా ఇలా చెప్పారు: "మీరు ప్రేమించాలనుకుంటే భగవంతుణ్ణే ప్రేమించండి. ఈ ప్రపంచం ఒట్టి అబద్ధం. ప్రపంచంలోని ఈ విషయాలన్నింటినీ ఎవరు లెక్క చేస్తారు? జగద్గురువులందరూ ఆ విషయాన్ని తెలుసుకున్నారు. ఇక్కడ నుంచి బయటపడేందుకు భగవంతుడి ద్వారా తప్ప మరొక మార్గం లేదు. మన జీవిత గమ్యం అతడే. ఈ ప్రపంచమే జీవితగమ్యమని చెప్పే భావనలన్నీ అత్యంత వినాశకర మైనవి. ఈ ప్రపంచానికీ, దేహానికీ ఆ గమ్యాన్ని చేర్చే సాధకాలుగా కొంత**

**విలువ ఉన్నా అవి ముఖ్యమైనవి కావు. ఈ ప్రపంచమే గమ్యం కాకూడదు. దురదృష్టవశాత్తూ, చాలా తరచుగా మనం ఈ ప్రపంచాన్ని గమ్యంగానూ, దాన్ని చేరుకునే సాధకంగా భగవంతుణ్ణీ ఉపయోగించుకోవాలని చూస్తాం. జనం దేవాలయానికి వెళ్ళి, "ఓ దేవా! నాకు ఫలానాఫలానా వాటిని ఇవ్వు; ఓ దేవా! నా రోగాన్ని నయం చెయ్యి," అని కోరుతూ ఉండడం చూస్తాం. వారికి చక్కటి ఆరోగ్యవంతమైన శరీరాలు కావాలి; తమకు ఆ పనిని ఎవరో చేసిపెట్టగలరని విన్నారు కాబట్టి, అక్కడకు వెళ్ళి ప్రార్థిస్తారు. మతమంటే ఇంతేనని అనుకునేకన్నా, దేవుణ్ణి నమ్మని నాస్తికుడిగా ఉండడమే మేలు. నేను చెప్పినట్లుగా, ఈ భక్తి అన్నదే మన అత్యున్నత ఆదర్శం. కనీసం రాబోయే కొన్ని కోట్ల సంవత్సరాలలోనైనా దాన్ని చేరుకుంటామో లేదో నాకు తెలియదు. కానీ దాన్నే మన అత్యున్నత ఆదర్శంగా చేసుకోవాలి. మన ఇంద్రియాలన్నింటికీ దానినే గమ్యంగా చూపాలి. మనం గమ్యాన్ని చేరుకోలేకపోయినా, కనీసం దానికి దగ్గరవుతాం. ఆ విధంగా, ఈ ప్రపంచం ద్వారానూ, ఇంద్రియాల ద్వారానూ నెమ్మదినెమ్మదిగా పని చేస్తూ, భగవంతుణ్ణి చేరుకోవాలి."**

## అత్యుత్తమమైన ప్రార్థనలు

అత్యుత్తమమైన ప్రార్థనలు ఎలా ఉంటాయో వివేకానంద స్వామి వివరించారు.

**ఇహలోకంలో కానీ, పరలోకంలో కానీ ఏదైనా కావాలని కోరుతూ, భగవంతుణ్ణి ప్రేమించాలనుకోవడంలో తప్పేమీ లేదు. కానీ భగవంతుణ్ణి కేవలం భగవంతుడు కావాలని మాత్రమే కోరుతూ ప్రేమించడమనేది మరింత మేలైనది. ఈ విధంగా ప్రేమించేవారు చేసే ప్రార్థన ఇలా**

ఉంటుంది. "స్వామీ! నాకు సంపదలు వద్దు! సంతానం వద్దు! పాండిత్యం వద్దు! నీ సంకల్పం మేరకు అవసరమైతే ఎన్నిసార్లు పుట్టడానికైనా నేను సిద్ధం. కానీ నేను నిన్ను ఒక వరం కోరుతాను. ఏ ప్రతిఫలం ఆశించకుండా నిన్ను ప్రేమించేలా నాకు వరమియ్యి. ప్రేమ కోసమే నిస్వార్థంగా ప్రేమించేలా వరమియ్యి."

ధర్మరాజు రాజ్యాన్ని కోల్పోయి హిమాలయప్రాంతాలలోని అడవులలో తన తమ్ములతో, భార్యతో, తలదాచుకున్నాడు. ఒకరోజు ఆయనతో ద్రౌపది, "ఆర్యా! మీరు ధర్మవర్తనంలో అత్యుత్తములు కదా! మరి మీకు కూడా ఇన్ని కష్టాలు దాపురిస్తున్నాయే!" అని వాపోయింది. ధర్మరాజు దానికి ఇలా సమాధానం చెప్పాడు. "చూడు, మహారాణీ! ఈ హిమాలయాలు ఎంత మహోన్నతంగా, మనోహరంగా ఉన్నాయో. నేను వాటిని ప్రేమిస్తున్నాను. అవి నాకేమీ ఇవ్వవు. కానీ మనోహరమైన వాటిని, మహోన్నతమైన వాటిని ప్రేమించడం నా స్వభావం. అందుచేతనే నేను వాటిని ప్రేమిస్తున్నాను. అదే విధంగా నేను భగవంతుణ్ణి ప్రేమిస్తున్నాను. ఈ సృష్టిలోని అన్ని అద్భుతమైన సౌందర్యాలకూ, సూక్ష్మాతిసూక్ష్మమైన వాట న్నింటికీ భగవంతుడే మూలం. ప్రేమించవలసిన వస్తువు భగవంతు డొక్కడే. ఆయనను ప్రేమించడం నా స్వభావం కాబట్టే ప్రేమిస్తున్నాను. నేను దేనినీ అర్థించను. దేనినీ కావాలనుకోను. ఆయన నన్ను ఎక్కడ ఉంచినా ఫర్వాలేదు. నేను ప్రేమ కోసమే ఆయనను ప్రేమిస్తాను తప్ప ప్రేమకు ప్రతిగా మరొకదానితో వ్యాపారం చెయ్యలేను" అని సమాధానం చెప్పాడు. (ధర్మం కోసమే ధర్మవర్తనం కానీ పేరుప్రతిష్టల కోసం, రాజ్యం కోసం కాదని ధర్మరాజు ఆశయం.)

ప్రతి మనిషిలోనూ దివ్యత్వం ఉంది. దానిని వెలికితీసి, వెలుగొందేలా చేయవచ్చు. ఆ దివ్యత్వాన్ని వెలికితీయడమే మనిషి యొక్క పరమోత్కృష్టగమ్యం. దానిని ఎలా సాధించాలో వివేకానంద స్వామి వివరించారు.

**మంచితనపు కాంతిని లోపలికి తెండి! చెడు క్షణంలో మటుమాయమవుతుంది. మంచి శీలాన్ని నిర్మించుకోండి. దేదీప్యమానంగా, ఉజ్జ్వలంగా వెలుగుతూ ఉండే మీ నిజస్వభావాన్ని, సదా పవిత్రమైన మీ నిజస్వభావాన్ని వెలువరించండి. మీకు ఎదురుపడే ప్రతి ఒక్కరిలోనూ దాన్ని మేలుకొలపండి. చివరికి అతి నికృష్టుడైన మానవుడిలో కూడా నిజమైన ఆత్మను చూడగలగాలి. వాణ్ణి నిందించ డానికి బదులు, "ఓ కాంతిమంతుడా! పైకి లే! ఓ నిత్యశుద్ధ స్వరూపా! పైకి లే! జననమరణాలు లేనివాడా! పైకి లే! ఓ సర్వశక్తిమంతుడా! పైకి లే! నీ నిజస్వభావాన్ని ప్రకటించు! ఈ అల్పమైన మనశ్శరీరాలు నీకు సరిపోలగలిగేవి కావు" అని చెప్పగలిగే స్థితికి మనలో ప్రతి ఒక్కరూ చేరుకోవాలన్నదే నా కోరిక. అద్వైతం బోధించే అత్యున్నతమైన ప్రార్థన ఇదే. మన నిజస్వభావాన్నీ, ఎల్లప్పుడూ మనలోనే ఉండే ఆ భగవంతుణ్ణీ నిరంతరం గుర్తు చేసుకోవడమే మనం చెయ్యగలిగే అత్యుత్తమమైన ప్రార్థన. ఆ భగవంతుణ్ణి అనంతుడుగానూ, సర్వశక్తి మంతుడిగానూ, ఎల్లప్పుడూ మనకు మేలుచేసేవాడిగా, సంక్షేమాన్ని కలిగించేవాడిగా, నిస్వార్థమైనవాడిగా, అన్ని పరిమితులకూ అతీతమైన వాడిగా ఆలోచించడమే మనం చెయ్యగలిగే అత్యుత్తమమైన ప్రార్థన.**

# 13. ప్రార్థనలు - కొన్ని ఉదాహరణలు

## సంస్కృత శ్లోకాలలో కొన్ని అద్భుతమైన ప్రార్థనలు

**సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ ।**
**విద్యారంభం కరిష్యామి సిద్ధిర్ భవతు మే సదా ॥**

(కోరికలన్నింటినీ తీర్చే తల్లివి, కోరికలకే రూపమైన ఓ సరస్వతీ! నీకు నమస్కరించి చదువు ప్రారంభిస్తున్నాను. దయచేసి ఎల్లవేళలా నా ప్రయత్నాన్ని ఫలింపచెయ్యి!

**దుర్గే స్మృతా హరసి భీతి మశేష జంతోః**
**స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి**
**దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా**
**సర్వోపకార కరణాయ సదార్ద్రచిత్తా ॥ (దేవీమహాత్మ్యం 4:17)**

ఓ దుర్గా! కష్టాలలో నిన్ను తలచుకున్న వారందరి భయాన్నీ నీవు పోగొడతావు. ఏ భయమూ లేక సుఖంగా ఉన్నవారు నిన్ను తలచుకుంటే వారికి మరిన్ని సుఖాలనిస్తావు. ఓ దేవీ! నీవు పేదరికాన్నీ, కష్టాలనూ, భయాన్నీ నివారిస్తావు. ప్రతివారికీ నిరంతరం ఉపకారం చెయ్యడానికి ప్రయత్నించే నీలాంటి దయార్ద్రహృదయం వేరెవరికైనా ఉన్నదా?

**న త్వహం కామయే రాజ్యం న స్వర్గం న పునర్భవం ।**
**కామయే దుఃఖతప్తానాం ప్రాణిణాం ఆర్తినాశనం ॥**

మహారాజు అయిన రంతిదేవుడు ఇలా ప్రార్థించాడు: "ఓ దేవా! నేను రాజ్యాన్ని కోరను. స్వర్గాన్నీ, పునర్జన్మనీ కూడా కోరను. దుఃఖంతో తపిస్తున్న ప్రాణుల ఆర్తిని పోగొట్టడమొక్కటే నేను కోరేది."

**నాన్యా స్పృహా రఘుపతే హృదయేఽ స్మదీయే**
**సత్యం వదామి చ భవాన్ అఖిలాన్తరాత్మా ।**
**భక్తిం ప్రయచ్ఛ రఘుపుంగవ నిర్భరాం మే**
**కామాది దోషరహితం కురు మానసం చ ॥**

రామచరితమానస్ రచయిత అయిన తులసీదాస్ ఇలా వేడుకున్నాడు: "ఓ రఘుపతీ! అఖిలప్రాణులలోనూ అంతరాత్మగా ఉండే నీకు నేను సత్యంగా చెపుతున్నాను – నా హృదయంలో నిన్ను గురించి తప్ప వేరే ఆలోచన లేకుండా చేయి. ఓ రఘుపుంగవా! నీ మీదే పూర్తిగా ఆధారపడి ఉన్నానని మనఃపూర్వకంగా చెపుతున్నాను. నా మనస్సులోని కామం, క్రోధం, లోభం మొదలైన దోషాలన్నింటినీ సమూలంగా నిర్మూలించు!"

## వ్యక్తిత్వ నిర్మాణ ప్రార్థనలు

మన ప్రార్థనల ద్వారా మన వ్యక్తిత్వం పెంపొందుతుందని ఇంతకు ముందు చదివాము. ఇందుకోసం కొన్ని శ్లోకాలు ఉన్నాయి. వాటిని కంఠస్థం చేసి, పదేపదే వల్లెవేయడం ద్వారా, వాటి అర్థాన్ని మననం చేయడం ద్వారా వాటినే మన ప్రార్థనగా మలచుకోవచ్చు.

**క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! ॥ (గీత 2.3)**

వివేకానంద స్వామి భగవద్గీతలో అత్యంత ముఖ్యమైన శ్లోకంగా దీనిని చెప్పారు. "ఓ నరుడా! బలహీనతకు చోటు ఇవ్వద్దు. అది నీకు ఏమాత్రం తగదు. పిరికితనాన్ని, క్లీబుతనాన్ని (నపుంసకత్వాన్ని) విసిరిపారవేసి ధైర్యంగా లేచి నిలబడు. నీ కర్తవ్యాన్ని పౌరుషంతో నిర్వర్తిస్తూ ముందుకు సాగిపో!" ఈ శ్లోకాన్ని మాటిమాటికీ జపించడం ద్వారా మనకు శక్తి కలుగుతుంది.

**కిం నామ రోదిషి సఖే త్వయి సర్వ శక్తిః**
**ఆమంత్రయస్వ భగవన్ భగదం స్వరూపం ।**
**త్రైలోక్యమేతదఖిలం తవ పాదమూలే**
**ఆత్మైవ హి ప్రభవతి న జడః కదాచిత్ ॥**

ఇది వివేకానంద స్వామి చేత వ్రాయబడిన ప్రార్థన. ఓ స్నేహితుడా! ఎందుకు ఏడుస్తున్నావు? శక్తి అంతా నీలోనే ఉంది! నీ సహజ స్వభావమైన దివ్యత్వాన్ని ఎలుగెత్తి పిలువు! (ఎందుకంటే) నీలోనే ఉన్న సర్వశక్తిమంతమైన ఆత్మ నీ పిలుపు కోసం సిద్ధంగా వేచి చూస్తోంది. దాని శక్తుల్ని వెలువరించు! నీలోని శక్తులన్నింటినీ సమీకరించుకుని పనిచేసినప్పుడు ముల్లోకాలూ నీ పాదాల ముందు సాగిలపడతాయి! జడపదార్థమైన ఈ శరీరం నశించిపోతుంది కానీ ఆ ఆత్మ అన్నది శాశ్వతంగా నిలబడుతుంది. కాబట్టి నీవు ఏమాత్రం భయపడవలసిన పని లేదు!

**ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్ నిబోధత ।**
**తమేవైకం జానథ ఆత్మానమ్ ।**
**స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్ ।**

లేవండి! మేల్కొనండి! మహోన్నతులైన ఆచార్యులను ఆశ్రయించి, మీలోని ఆత్మను తెలుసుకోండి! చీకటి నుంచి వెలుతురులోకి మీరు అతిశీఘ్రంగా చేరుదురు గాక!

## తెలుగు శతకాలలో కనిపించే కొన్ని అద్భుతమైన ప్రార్థనలు

**నీవే తల్లివి తండ్రివి,**
**నీవే నా తోడు నీడ, నీవే సఖుడౌ**
**నీవే గురుడవు దైవము,**
**నీవే నా పతియు గతియు, నిజముగ కృష్ణా! (కృష్ణ శతకం)**

ఓ కృష్ణా! నా తల్లీ, తండ్రీ నీవే. నా తోడూ నీడా నీవే. నా స్నేహితుడివి నీవే. నా గురువూ, దైవమూ నీవే. నా పతీ, గతీ నీవే! ఈ మాటను నేను సత్యంగా పలుకుతున్నాను.

**నిను సేవింపగ నాపదల్పొడమనీ, నిత్యోత్సవంబబ్బనీ**
**జనమాత్రుండననీ మహాత్ముడననీ సంసారమోహంబు పై**
**కొననీ జ్ఞానముగల్గనీ గ్రహగతుల్ కుందింపనీ, మేలు వ**
**చ్చిన రానీ యవి నాకు భూషణములే, శ్రీకాళహస్తీశ్వరా!**

ఓ కాళహస్తీశ్వరా! నిన్నే నా జీవితమంతా సేవించాలనుకుంటున్నాను. అలా చేసేటప్పుడు నాకు ఏది ఎదురైనా దానిని నేను శరీరానికి ధరించే బంగారు నగలాగా సంతోషంగా స్వీకరిస్తాను. నాకు ఆపదలు

